శ్రీ

# అనుభవామృతము

# పీఠిక

ఈ యనుభవామృతమును తెలిఁగించిన శ్రీ కలుగోడు అశ్వత్థ రావుగారి పేరు ఇదివరకే వీరి 'దండకరామాయణము' మూలమున ఆంధ్రదేశములో విరివిగా వెలసినది. 'అశ్వత్థేశశతకము' మొదలగు వీరిఇతరరచనలును తెలుఁగువారు చవిగొన్నారు. నాయెడల నిర్హేతుకముగా ప్రణయగౌరవము లపారముగా గలవారు కనుక నే దండకరామాయణమునకు నేను వ్రాసినయుపోద్ఘాతము చాలక దీని కిని ఒకటి నన్నే వ్రాయుమని ఒత్తిడిచేసినారు. అనావశ్యకమని ప్రార్థించినా వినరు. దానిఫల మీనాల్గుమాటలు. వట్టి 'ఉపచార మంతే.'

మూలగ్రంథము కన్నడదేశమున చాలావ్యాప్తి గౌరవములఁ గాంచినది. విషయము అనూచానమైన అద్వైతసిద్ధాంతము. అశ్వత్థ రావుగారి శైలియందలిధార, గడుసుదనము, తీపి, చలువ, నాల్గు పద్యములు చదివిన మాత్రాన అనుభవమునకు రాఁగలవు. గ్రంథము తనంత చదువరులను తలపోలముదాఁక ఈడ్చుకొనిపోఁగలదు. ఇఁక ఎవరిపీఠికతో నేమిపని?

మఱియొకవింత! మూలగ్రంథకర్త శైవసంప్రదాయమునకు చేరినఅద్వైతి. అశ్వత్థరావుగారు ద్వైతపథమునందు సాంప్రదా

యుక్తమైన శ్రద్ధాభక్తులు గలవారు. నేనును అట్లే విశిష్టాద్వైతమతానుయాయిని. ఈ మూఁడుమార్గములను పరస్పరసౌహార్దములో, సాహాయ్యముతో వర్తింపనిది తత్త్వపులోతునకు స్వతంత్రముగా దిగఁజాల వనుట సూచించుట కేమో భిన్నాధ్వనీనులగు మేము ముగ్గురును ఈకార్యములో చేరవలసివచ్చినది.

అవాఙ్మానసగోచర మగు పరబ్రహ్మతత్త్వమును, అట్టిదిగా నెఱిఁగియు, అనుభవమునకు తెచ్చుకొనుటకు ప్రయత్నించుట మనుష్యుఁడు చేసెడు పరమసాహసకార్యములలో మొదటిది. అట్లు చేయుటకు మనకుఁ గలసాధనములు ఆ వాఙ్మానసములు రెండే! ఏమాత్రమైనను అనుభవమునకు గల్గించుటకు మూఁడవసాధన మేదియు లేదు. కనుకనే "నమోనమో వాఙ్మనసాతిభూమయే నమో వాఙ్మనసైకభూమయే" అని యామునముని ఘోషించెను. వ్యాసమహర్షి విష్ణుసహస్రనామములలో "శబ్దాతిగః శబ్దసహః" అను రెండుపేళ్ళను జేర్చెను. ఇవి "మనోఽతీతో మనస్సహః" అనుట కుపలక్షణములు. మనోవాక్కులు రెండును గుణభూమిలో సంచరించును. వీనిసంచారము నిలిచినప్పుడు ఆత్మ నిర్గుణభూమి యగును. బ్రహ్మతత్త్వానుసంధానమందలి యీసగుణనిర్గుణభూమికాద్వయమే అనేకవిభిన్నమతములకు మూలమైనది. బహిరంగములైన ఆచారవ్యవహారములలో లోకకల్యాణదృష్టితో ఉత్తమమధ్యమాధమములను నిర్ణయింపవచ్చును; గాని అంతరంగమైన పరతత్త్వస్వరూపమువిషయమై అభేదభావములను గమనించుట కొంతవఱకు వినోదము; మితిమీఱితే విరోధము. దానిసగుణత్వమునుగాని నిర్గుణత్వమునుగాని నికరముగా సిద్ధాంతీకరించుటకు తర్కశాస్త్రము చాలదు. మఱి ఆ రెంటినీ అనుభవమున గ్రహించుశక్తి మనస్సునకు కలదు, అఖండమైనసాధన ఒకటికావలెనంతే. గుణగ్రాహులగు మనోవృత్తులను ఒక్కొక్కటిగా వదలుచు ఏకాగ్రతనుసాధింపఁ

బూనినవానికి క్రమముగా తుదకు జ్ఞేయమే అంతర్ధానమై సాక్షిభూతమగు జ్ఞాతృత్వము మాత్రము నిర్విశేషముగా శేషించి నైర్గుణ్యానుభవము గలుగును. దానికి ప్రతిగా గుణముల ప్రమాణమును సంఖ్యను ఒక్కొక్కటిగా పెంచుకొనుచు పరమాత్మను వానికన్నిటికిని ఏకమాత్రాశ్రయముగా ధ్యానించువానికి ఆ యనంతకల్యాణగుణపరిపూర్ణ పరతత్త్వము స్వాధీన మగును. మొదటిది సంకోచపద్ధతి; రెండవది వికాసమార్గము. ఈ రెంటను పరతత్త్వముయొక్క 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అను సమన్వితస్వరూపమును తెలుపును.

ఈ 'యనుభవామృతము' అద్వైతమును అనుభవించుమార్గమును విపులముగా మాటలతో వివరింపఁ బ్రయత్నించిన గ్రంథము. తర్క మీమాంసా నిశితబుద్ధులగు పండితులకుఁగాక సామాన్యజనులకు ఆయనుభవమును సుగ్రహముఁ జేయుట గ్రంథకారునియాశ. కనుకనే ఒక్కొక్క విషయమును పెక్కువిధములుగా మాటలు మార్చి మార్చి పిష్టపేషణముచేయుట గ్రంథమందంతయు చూడవచ్చును. ప్రమేయమును మాత్రము పట్టి చూచితిమేని ఈ గ్రంథము పదింట నొకపాలుకు సంగ్రహించి దించినను జాలు ననిపించును. కాని గ్రంథకర్తయుద్దేశము ఆ మార్గమున ఫలింపదు. విషయదార్ఢ్యమునకు పునరుక్తి ముఖ్యసాధనము. కాబట్టియే మూలగ్రంథము కన్నడదేశమందలి 'పామర' జనులలో ఎక్కువవ్యాప్తిఁ జెందినది. వీథిపురాణముగా దీని [illegible] పఠించి వ్యాఖ్యానింతురు.

మూలగ్రంథకారుఁడు రంగనాథకవి, మహాలింగరంగఁడని రంగావధూతుఁడని కూడ ప్రసిద్ధుఁడు. కర్ణాటకకవిచరిత్రకారు లితనిని బ్రాహ్మణుఁడుగా నుండవచ్చునన్నారు. తుద కితఁడు సన్న్యాసియై సదానందుఁ డనుపేరు వడసియుండునని కూడ నూహింతురు.

శైవసంప్రదాయాభిమానియగుట స్పష్టము. పరమహంస పరివ్రాజకాచార్య సహజానందుని శిష్యుఁడు. ప్రాయశః ౧౭వ శతాబ్ది మధ్యభాగములో జీవించియుండు నని చారిత్రకులయూహ. ౧౮వ శతకాదిభాగమున ఈ గ్రంథము సంస్కృతభాషకు పరివర్తింపఁబడి యుండుటగూడ దీనివ్యాప్తికిని విలువకును సాక్షి. ఇందలి ఛందోను సారముగావచ్చిన అధికపదజాలమును, జనసామాన్య బోధదార్ఢ్యమునకై చేసినపునరుక్తిని వేఱుపఱచిచూడఁగల జిజ్ఞాసువులకు నిర్వి శేషచిదానందానుభవసిద్ధాంతము నెఱుఁగుటకును, సాధించుటకును వలసినవిషయము లెన్నో లభించు ననుటలో సందేహము లేదు. ఇది ప్రత్యక్షప్రయోజనముగల ప్రమాణగ్రంథము కాదు. మఱి ప్రమేయమును పలువిధముల ఆవాపోద్వాపములతో ఎదలకంటించి భక్తిప్రత్యయములను గలిగించు ఉపన్యాసవిస్తరము. ఛందోరూప మంతే.

ఇందలిఛందస్సును గూర్చి ఒకమాట. సప్తమాత్రలగణములు ౧, ౨, ౪, ౫ పాదములయందు రెండేసి వచ్చును. ౩, ౬ పాదములయందు మూఁడేసిగణములును, ఒక్కగురువును వచ్చును. అనగా ఆకడపటిగురువు నిజమునకు ఏడుమాత్రలకాలమునే ఆక్రమించును గాన, సీసపాదములందు కడపటిలఘువువలెనే ఒకగణమే యగును. గనుక ౩–౬ పాదములలో నాల్గేసిగణము లగును. ఆ యేడుమాత్రలునూ ౩–౪ మాత్రలుగా రెండుభాగములుగా నుండును. రెండవభాగము జగణముగానుండ రాదు. ఆరుపాదాలలోను ప్రాసము గలదు. భామినీషట్పదియని కన్నడులు దీని పేరొ్కనిరి. కన్నడ సాహిత్యమున ఈ షట్పదివృత్తములు పలువిధములు గలవు. వానిలోనెల్ల భామినీషట్పదియే బహుళప్రచారము గలది. తెలుఁగువారు ద్విపదితో తృప్తులైరి. అనంతామాత్యుఁడు మొదలుగా ఛందోలక్షణకారులు షట్పదులను లక్షించిరి. కాని ఎందుకో ఆఛందస్సు తెలుఁగులో వ్యాప్తికి రాలేదు. నే నెఱిఁగి

సంతవఱకు హిందూపురములోనుండిన శ్రీఅనంతరామాచార్యులనఁబడు 'హరికథా'శవి యొక్కఁడే తాను రచించినయక్షగానములలో భామినీషట్పది అపరూపముగా వాడినాఁడు. మఱి గురజాడ అప్పారావుగారి 'ముత్యాలసరము' దీనిచక్కనగమే. తెలుఁగుభాష ఈఛందస్సుతో ఎంతచక్కగా అతుకుకోఁగల దనుటను అశ్వత్థరావుగారు ఇందు స్పష్టముగా చాటినారు.

వారిభాషాంతరీకరణమునుగూర్చి ఎక్కువగా నేఁ జెప్పఁగలిగిన దేమియు లేదు. వారు తీసుకొన్నస్వాతంత్ర్యము చాలా మితమైనది. తెలుఁగునకు ప్రాణమైనయతిని 3–4 పాదములలో 3వ గణాద్యక్షరముతో చక్కగా నిలిపినారు. దీనితో ఆదిమనదై పోయినది. ఈమాత్రావృత్తపు మిశ్రజాతిగతిధోరణికి తగినట్లుగా శ్రీఅశ్వత్థరావుగారిధారయు సాపుగా, నిర్భయముగా, ఆద్యంతము లొకేవిధముగు మెఱుఁగుచక్కఁదపుఁజక్కదనముతో నడచినది. చదువుకొని సంతోషించుట మనపని.

మైసూరు
విరోధి కార్తిక కృష్ణపంచమి. }

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

# అనుభవామృత పరిచయము

బ్రహ్మశ్రీ శతావధాని, వేలూరి శివరామశాస్త్రిగారు,

కర్ణాటకభాషయందలి అనుభవామృత మీ తెలుఁగు అనుభవామృతమునకు మాతృక. తద్రచయిత రంగఁడు. ఈ గ్రంథము సంస్కృతమునకు పరివర్తితమైనది. కాన దీనిచేవ చెప్పనక్కరలేదు. దీనిని ఇపుడు తెలుఁగుగా చిలికి యీయమృతమును మనకు ధారపోసినవారు కరణం అశ్వత్థరావుగారు. దండకరామాయణాదికవితాసామగ్రిచే వీరు లబ్ధప్రతిష్ఠులు. దానిపై నీకబ్బము పండుగుపై పబ్బము.

నావలెనే కన్నడమురానివారందఱును ఈప్రతికను బట్టియే మాతృకాప్రాశస్త్యమును గ్రహింపఁగలరు. కావున రంగఁడు మన కీయశ్వత్థరాయనిలోను అశ్వత్థరాయనిలో రంగఁడును కనఁబట్టుదురు. ఈ తెలుఁగు అనుభవామృతమ్ము మెట్టిదో కవిచేతనే చెప్పింతము.

"తెలుఁ గిదంచును బెడమొగము నిడఁ
దలఁచు పెద్దలకళికి పలికెదఁ
దెలుఁగు తియ్యని తేటమాటల తేనెయూట సుఁడీ!
కలుగునుపనిషదర్థమును నేఁ
దెలుఁగుపలుకుల నంటి నింతియు,
కలుగునే యొకకొఱఁత చూడ్కిని ఘనతకొఱవడ దేఁ.

ఒలువఁబడినయనంటిపండటు,
తొలువఁ ద్వక్కను నిలుచుచెఱకటు,
కలఁచునుడుకులఁ దోలఁగి కమ్మనఁ గమ్మపాలటులన్
తెలుఁగుతీపులసులువుపలుకుల
తెలిసి తనలోఁ దన్ను ముక్తికి
నలవరచుకొనరాదె సంస్కృతమందు నింకేమి?"

అనుభవామృతము ఏకధారమున శాస్త్రము, మఱి కావ్యము. ఇం దేదియు మఱియొకదానికి గౌణముకాదు, గాని నిక్కమున కిది కవిపెట్టిన పేరికే తగు—అనుభవామృతము—ఈవిషయము పిదప.

ఈప్రపంచ మేమిటి? దీనిని సృజించిన దెవరు? నే నెవఁడను? అని తరతరములనుండియు ఉద్బుద్ధములయి వచ్చుచున్న ప్రశ్నములకు జ్ఞానులు పలువురు పలుదెఱఁగుల సమాధానములు చెప్పుచువచ్చుచున్నారు. అందద్వైత మొకతెఱఁగు.

ఏశాస్త్రమేని గురువుతోఁ జదువనినాఁడు రాదు. ఇఁక వేదాంతశాస్త్ర మన్నిశాస్త్రములకును కూడలి. అది పండితైకవేద్యము. మఱి తత్త్వమునందో, ఎపుడో ఒకపుడు అందఱకును తీపి. పంచీకరణము, కోశవివేకము, జీవత్రయవిభాగము ఈ మొదలగువాని యందును కొందఱకు చెడ్డకౌతుకము. ఇటులగుటఁ జేసి పామరుల కడకును తత్త్వశాస్త్రము నడవవలసివచ్చెను. ఇట్టివారి ననుగ్రహింపఁ దలఁచి రంగఁ డశ్వత్థరాయరూపముతో అనుభవామృతమును తెలుఁగువారికిఁ గ్రోలనిచ్చుచున్నాఁడు. అనుభవము నితఁడు—

“స్వానుభవగురువాక్యశాస్త్ర

జ్ఞానముల నొక్కటిగ” (3—15; 1—4. చూ.) ఎఱుఁగు మనెను. సదనుభవము లొకటి

“శ్రుతిగురులచే మథనపడి ని

శ్చితము నగుననుభవప్రమాణమె” (10—50, 51 చూ.) అట్టి యనుభవము గురూపసదనమువలనఁగాక కేవలపుస్తకమువలనఁ గలుగునా? కవినోటనే యిటులు విందుము.

“అదినిమిత్తము తనయు సద్గురు
పదపయోజముఁ జేరి శాస్త్రో
ద్గదితమార్గము పట్టి యనుభవగరిమఁ బ్రశ్నములకా
ముద మొదవ వినయోక్తి వేడఁగ
నదె సుమీ యనుకూలతర్కము
సదమలాత్మజ్ఞానసిద్ధికి సరణియదియె యగుఁగా.” (3—17)

పుస్తకపఠనమువలన పండితుఁడు కావచ్చును. 'పుస్తకీ భవతి పండితః' అనువృద్ధవాక్యముచొప్పున పండితుఁడు పుస్తకమై పోవచ్చును, అని యందురా? నిక్కమే. గురూపసదనమే దొడ్డది. వీలులేనివారికిని లజ్జగొనువారికిని పుస్తకపఠనమువలన ప్రయోజనము తప్పక ఉన్నది.

కొంచెము సంస్కారము కలవారికి వేదాంతపఠనము వలన బండతనము పోవుటయేకాక ఉత్తరోత్తరగ్రంథపఠనమువలన తెలియనిపూర్వపూర్వగ్రంథము సుబోధక మగునని వాల్మీకి చెప్పుచున్నాడు.* "చెవిలోపడ్డది మేలుగాని పుస్తకజ్ఞానము మేలుగాదు," అను తాంత్రికులుగూడ "గురువుతటస్థింపనిచో పుస్తకమునే గురువుగా చేకొనునది" అని అభ్యనుజ్ఞ నిచ్చిరి. "గురోరభావే దేవేశ! పుస్తకం గురుమాచరేత్, (దేవీరహస్య)

ప్రపంచములో నింతవఱకు తత్వశాస్త్రములో పాఠకులను చదివించుకొనుచుఁబోవుపుస్తకమేదియు లేదు. పుస్తక మెత్తఁగనే మూలతత్వములును వానిని సమర్థించుతర్కమును పులులవలె నెదురుపడును. బుద్ధికివి చమరుపుట్టించునంత శ్రమకలిగించును.

ఇది శాస్త్రస్థితి. కాని యిపు.డీయనుభవామృతమును పామరులచేతఁ బెట్టినను పండితులచేతఁబెట్టినను ఒకేయూపునఁ జదివించుకొనుచుఁబోవును. ఆచదు వూరకపోదు. అది మనసుకు మలాము. జటిలము లగువిషయములను తెల్లముచేయుట కితనిచేతిలో ఉపమ కీలుబొమ్మ. అర్థాంతరన్యాసము అంతఃకరణన్యాసము. వేయేల ఇతని ఉపదేశము పాఠకునిహృదయమున అలుగువలె నాటుకొని పోవును.

---

* కారణంమౌర్ఖ్యమేవాస్య తచ్ఛాస్త్రదేవశాస్త్రతః
కించిత్సంస్కృతబుద్ధీనాం వాచితాదేవశామ్యతి
అబద్ధముత్తరగ్రంథాత్ పూర్వంపూర్వంహిబుద్ధ్యతే.

ఈకవికి జ్ఞానముతోపాటు లోకజ్ఞాన మపారము. పామరుల వార్తలును పండితుల ప్రవచనములును ఇతనికి కంఠస్థము. ఈకవి లోకములో కొన్ని వస్తువులను నిరసించినచందము చూచినచో ఇతని తరువాత నన్నసర్వజ్ఞుఁడును, ఇతనికి కొంచెము వెనుకనో ముందో యున్న వేమన్నయు, గుఱుతువత్తురు. వేదములు వల్లించి పొట్ట చేతఁబట్టుకొని తిరుగువారిని జూచి యితఁడు 'పరువవేదిని తాకట్టు పెట్టినట్టులు వేదశాస్త్రగ్నులను అమ్ముదురు.'' (కి—గ.) అనియెను. వేమన మరియొకమెట్టు ఎక్కుట అందఱకును తెల్లము. పిత్రార్జితము పంచుకొనుటకు కొడుకులు కలహించుటయు రచ్చకెక్కుటయు పంచాయితీదారులు అంతలంతలుగాఁ బంచియీయక తామే మ్రింగి వారిచేతికి పంచపాత్ర నను గ్రహించుటయు సుకవి యెఱుఁగును. యౌవనసన్నిపాతగ్రస్తుఁడు తనబుజములు చూచుకొనునట, కనుసన్నలు సేయునట, పరహేళన మొనరించునట, మీసలకొనల మెలివెట్టునట, పోవుచుఁబోవుచు సన్నరాగములు తీయునట, ఎవరికిని లొంగక సజ్జనుల గడ్డిపోచలుగా చూచి సాధులఁ జెనకి అంతకంతకు రక్కసుండగునట, న్యాయమును ధిక్కరించునట, కుక్కవలె గుఱ్ఱుమనునట.

ఈకవి విద్యామదముకలవాఁడో తర్కముసల్పును. నాయంత పండితుఁడు లేఁడని అనుకొనును. తనప్రజ్ఞను తానే మెచ్చుకొనును. నేనేసర్వజ్ఞుఁడను అని అనుకొని కనులు నెత్తికెక్కినట్టులు వర్తించును.

ఇతఁడు జ్ఞానియైనందులకు కులమదముకలవానిని

"తాను సత్కులజాతుఁ డను వి
జ్ఞానయుతవంశజుఁ డ నను న
న్నాన మిడఁదగు ననును దన కభిమానమానసుఁడై,
హీనవర్ణజు లిత రజనులనుఁ,
దాను వారలఁ వాఁక నను న
జ్ఞానపరవశుఁ డగుచుఁ గులమదచపలచేష్టితుఁడై. అ. 2—55

కామమునకు బదులు ఆఁడుదాని నిత్తుఁ డందఱవలెనే అశ్లీలము లాడు టకు వాచాలురగు పలువురు జ్ఞానులవలెనే జంకక దూషింపఁ బూనుకొని భగవంతునిగూడ కలిపితిట్టక,—

"స్త్రీపురుషభేదమున బహువిధ
రూపములఁ గల్పించి సురతపుఁ
దీప్తి మదికెక్కించి సఖ్యము తీఱరానిగతిం
జూపి తత్ఫలితంబు సంతతి
రూపమునఁ గల్పింపఁజేసిన
యాపరాత్పరులీల నెన్నఁగ నద్భుతముగాదే. 2—61.

అని ఆశ్చర్యపడియు,

'ఏరులేనివనంబులో పా
దూరికొలుమ్రానున దగుల్పడి
దారిఁబోయెడివారిఁ జీరువిధంబుదోఁపఁగ, సం
సార మనుకాంతారసీమను
మారుఁ డనెడుకిరాతుఁ డొడ్డిన
నారి యనువలఁబడిననరులకు నాస్తి సూ ముక్తుల్.' 2—63.

అని తనకుఁగల ఏవమునంతయు

............మాయయే యిటు
సుదతిరూపముఁ దాల్చి పురుషుల
మదిఁ గలంచెడు............"— 2—83

అని ఒక ఉండ జేసి మనముం దుంచుచున్నాఁడు. భగవంతునిపట్ల అడ్డిలీల మనుజులపట్ల అపహేల.

లోగడ ఇటులతిట్టినవా రంతయును పురుషులే. తానును పురుషుఁడే కావున పురుషులకు బుద్ధిచెప్పుట కెత్తఁడు ఆఁడువారలమీఁద మాత్రమే నేరుచేసికొనెనని యనవలయును. గాఢవిరక్తి చెందిన

ఆఁడువా రిఁకముం దెవరేని పురుషుల నిటులు తిట్టుదు రేమో— వినుటకు వేచియుందము. మఱచితిని, పాప మీతనికి తెలియకపో లేదు—

“స్త్రీలకును బురుషేచ్ఛ, పురుషుల
కో లలనలం దిచ్ఛ, సృష్టికి
మూల మగుచు ననాదినుండియు మోహవారాశిం
గూలఁద్రోసి యుజాదులను గ
గ్గోలుపఱచెడు.............. (2—67.)

అని పురుషునిఁ గూడ స్పృశించెను. ఇతఁడే ఆఁడుదియైయుండుచో పురుషులను పడఁదిట్టువాఁ డేమో.

ఈ ఆఁడువారలఘట్టముననే—

‘మాయ అనఁగా హీనవిషయని
కాయలోలత’ అని వింతగా నొకలక్షణము చెప్పినాఁడు

ఇఁక వేదాంతులనఁబడువారు తామే బ్రహ్మలమనియు తమ చర్యలే సచ్చర్యలనియు అవి ధర్మములనియు ఉద్ఘాటించుచు పరులకు బ్రహ్మోపదేశము చేయుదురట.

శ్రీరంగనికి కనఁబడిన ఇట్టివారంఱును నాఁడును నేఁడును గలరు. ఇతనిమతమున కర్మలు టక్కునాణెములు, ధర్మములు చిక్కుదారులు. తన్ను నిజచిత్తుగా తెలిసికొనుట యొకటే కావలసినది. (3—9.) అనధికారికి కర్మమే శరణ్యము. శ్రుతిప్రమితములగు ఇతరమతములయెడ నితనికి ద్వేషములేని—

“శైవవైష్ణవమతము లనఁగ న
వేవి యన్న షడంగమద్గుణ
భావభిన్నములైన వంతియె వస్తుభేదములు
లేవు, శ్రుతితతులగయ ‘ఏకో
దేవ’ యని ఘోషించవే? మా
యావిలాసమువలన భేదం బంతె తేహాంశము. 5—5.

ఇట్టిసామరస్యము కలదు.

కామమునకు బదులు ఆఁడుదానినితఁ డందఱవలెనే అశ్లీలము లాడుటకు వాచాలురగు పలువురు జ్ఞానులవలెనే జంకక దూషింపఁ బూనుకొని భగవంతునిఁగూడ కలిపితిట్టక,—

"స్త్రీపురుష భేదమున బహువిధ
రూపములఁ గల్పించి సురతపుఁ
దీప్తి మది కెక్కించి సఖ్యము తీఱరానిగతిం
జూపి తత్ఫలితంబు సంతతి
రూపమునఁ గల్పింపఁ జేసిన
యాపరాత్పరులీల నెన్నఁగ నద్భుతముగాదే. 2—61.

అని ఆశ్చర్యపడియు,

'ఏరులేనివనంబులో పా
దూరికొఱుమ్రానున దగుల్వడి
దారిఁబోయెడివారిఁ జీరువిధంబుదోఁపఁగ, సం
సార మనుకాంతారసీమను
మారుఁ డనెడుకిరాతుఁ డొడ్డిన
నారి యనువలఁబడిననరులకు నాస్తి సుమ్ము ముక్తుల్.' 2—63.

అని తనకుఁగల ఏవమునంతయు

..............మాయయే యిటు
సుదతిరూపముఁ దాల్చి పురుషుల
మదిఁ గలంచెడు..............''— 2—83

అని ఒక ఉండ జేసి మనముం దుంచుచున్నాఁడు. భగవంతునిపట్ల అడిలీల మనుజులపట్ల అపహేల.

లోగడ ఇటులతిట్టినవారంతయును పురుషులే. తానును పురుషుఁడే కావున పురుషులకు బుద్ధిచెప్పుట కతఁడు ఆఁడువారలమీఁద మాత్రమే నేరుచేసికొనెనని యనవలయును. గాఢవిరక్తిచెందిన

ఆఁడువా రింకముం దెవరేని పురుషుల నిటులు తిట్టుదు రేమో— వినుటకు వేచియుందము. మఱచితిని. పాప మీతనికి తెలియకపో లేదు—

“స్త్రీలకును బురుషేచ్ఛ, పురుషుల
కో లలనలం దిచ్ఛ, సృష్టికి
మూల మగుచు ననాదినుండియు మోహవారాశిం
గూలం ద్రోసి యుపాదులను గ
గ్గోలుపఱచెడు................ (2—67.)

అని పురుషునిం గూడ స్పృశించెను. ఇతండే ఆఁడుదియైయుండుచో పురుషులను పడందిట్టువాం డేమో.

ఈఆఁడువారలఘట్టముననే—

‘మాయ యనంగా హీనవిషయాని
కాయలోలత’ అని వింతగా నొకలక్షణము చెప్పినాఁడు

ఇంక వేదాంతులనంబడువారు తామే బ్రహ్మలమనియు తమ చర్యలే సచ్చర్యలనియు అవి ధర్మములనియు ఉద్ఘాటించుచు పరులకు బ్రహ్మోపదేశము చేయుదురట.

శ్రీరంగనికి కనంబడిన ఇట్టివారంఱును నాఁడును నేఁడును గలరు. ఇతనిమతమున కర్మలు టక్కునానెపములు, ధర్మములు చిక్కుదారులు. తన్ను నిజచిత్తుగా తెలిసికొనుట యొకటే కావలసినది. (3—9.) అనధికారికి కర్మమే శరణ్యము. శ్రుతిప్రమితములగు ఇతరమతములయెడ నితనికి ద్వేషములేని—

“శైవవైష్ణవమతము లనంగ న
వేవి యన్ని షడంగమద్గుణ .
భావభిన్నములైన వంతయె వస్తుభేదములుంగ
లేవు, శ్రుతితతులరయ ‘ఏకో
దేవ’ యని ఘోషింపవే? మా
యావిలాసమువలన భేదం బంతె లేవాంఛుంగ. 5—6.

ఇట్టిసామరస్యము కలదు.

ఇతనికి 'జన్మము అఘము' (2-13.) అనగా పాపసూత్రము. కరువునకు అన్నమును గుడ్డతో కట్టునటులు దేహమునకు అన్నవసనములను పడవేయవలెను (10—89.) గర్భము పారవేయఁ దెగించు జాణివలె సంసారము చించి సమాధిలోఁ బడవలెను (10—102.) ప్రపంచము స్మశానము, ఇటులైనను ప్రపంచము పంచభూతముల వలనఁ బుట్టెను. బీజమే ఫలము అనుట నైజము. అంతయు బ్రహ్మమే కాని వేఱు పదార్థ మెక్కడ? 8—15. అని ఇతఁడు ఉపదేశించెను. ఈజగతిలో దుఃఖస్పర్శలేని సౌఖ్యము దొరకదు (2—32) కావున—

"సురతకాలమునందుఁ బురుషుఁడు
తరుణికిడు క్లేశంబు గడుసుఖ
కర మగుచు నాసతికిఁ దోఁచెడుకైవడిగ నపురుష
భరితపరమానందమునఁ దా
మరగి తన్మయుఁడైనయెడ సం
సరణదుఃఖ మదంతయును సుఖమయముగాఁ దోఁచుకా (10-26)

"సురతసుఖమున దేహభావము
మఱచి తన్మయుఁడైనరీతిగ
నరయ నపరోక్షానుభవ మగునద్వయానందా—
వరణమతి యగుయోగి సర్వము
మఱచి తాదాత్మ్యమున సత్తా
స్ఫురణమాత్రవిచేష్టితుం డయి పొలుపుఁ బరికింపక. 10—27.

అని సమాధ్యానందమునకు పామరులను ప్రలోభితులఁ జేయుచున్నాఁడు. ఈమహాకవి వినరిన (2—72, 75, 91 వంటి) అశ్లీలములును కొన్ని శృంగారములును ప్రకృతార్థపోషకములే. శ్రీరామకృష్ణపరమహంసవంటి బ్రహ్మచారియు శుద్ధబ్రహ్మవాది యగుశ్రీవివే

కానందమునితో కొన్నిపట్ల నిట్టివానిని విసరియున్నాఁడు. తంత్రశాస్త్ర మిట్టి రూపకాతిశయోక్తుల కొకభాండాగారమే కదా! లాక్షణికులు గూడ ప్రకరణమునుబట్టి ఇవికావ్యమునకు గౌరవాపాదకము లనియే యనిరి. ఈకాలమువారి కివి యెటులుండునో?

అందు అద్వైతులవలెనే తత్త్వ మెఱిఁగిన యాకవి:— ఆలుబిడ్డలు గృహాధనములు గాలిలోదీపములు, మానవులు క్రిములలెవ పుట్టిగిట్టుదురు. అక్కసెల్లెండ్రు అన్నదమ్ములు చలిపందిరిలోఁ గలిసినబాటసారులు. చైత్యమునఁ జేరినపిట్టలు. విద్యవలన ఉద్యోగము వలన విత్తమునకుఁ జేయుప్రయత్న మినుకడిబ్బకు నీరెత్తుట. మించువలె మాయుశరీరమును పోషించుట నీటిబుడగను లింగమని సంపుటమునఁ జెప్పుట. శరీరమును అలంకరించుట కొడుకును ముద్దిడుకొనుమగనిఁ గని జారిణి నవ్వుట. ఈసంసారము రోఁత. నీమేను ముట్టుకుండ నీవెన్నున యముఁ డున్నాఁడు. బలికి తెచ్చినగొఱియ తోరణముందలి చిగురుటాకున కొఱుకునటులు నీవు సంసారసుఖ మందఁజూచుచున్నావు. ఈశరీరము నీది కాదు. యముది! అని విరక్తి కలిగించి తత్త్వపరిచయ మెటులుచేయుచున్నాఁడో చూడుఁడు:—

'పుట్టినా మఱి చావు నెఱుఁగని
గుట్టు నేర్వఁగవలెఁ జుమీ,— 3-4.

ఇది ఎవరు నేర్వఁగోరరు, నేర్వలేరుకాని. అట్టివారికి కవి మఱల—

'ఆ! పట్టుదొరకని దేని స్మృతి చొప్పడినపిదప మఱికి
బుట్టు వెఱుఁగని నేరుపైనను
బట్టుకొనవలె"—
యని మనమనసును పట్టుకొనును.

ఇట్టి కవి నెవరు చదువకుండఁగలరు? ఇతఁడు సోమరులను మేలుకొలిపి

"జ్ఞాన మభ్యసనంబొనర్పని
యానతుండే వానరుఁడురా,
తాను బ్రహ్మమటం చెఱుంగనతండె పామరుఁడు,
స్వానుభవ మేమాత్ర మెఱుఁగని
మానవుండే దానవుం డగు"— 1—34.

అని రెచ్చఁగొట్టి 'నేనే యీశ్వరుఁడను' అని అనుకొన్నంత మాత్రమున దొరవై పోవునా? ఆ యీశ్వరుఁడు చెఱఁబడిన దొర కాఁడా? చీఁకటింట దీపము 'దీపము అని అఱచిన కనిపించునా?' అని నిజానుభూతి కలయించి నీ వెవఁడవో తెలిసికొనుమని—

"తన్నుఁ దా గుఱుతించి లోఁగను
టన్న సామాన్యంబె?"— 3—10.

"నోటిమాటల బ్రహ్మనిష్ఠా
పాటవం బలవడునె? దొరకునె
తేటసౌఖ్యము? చీఁకటింటను దివ్వె పేర్కొన్నఁ
గాటుకొన్న మహాంధకారము
మాటువడి వెలుఁగొనె? మఱిమఱి
మాట లేల, నిజానుభవమే మాననీయ మగుఁ. 3—11.

ఇటులు నిన్ను ఆలోచనాసముద్రములోనికి త్రోసి నీలోనున్నఅసలు నిన్నును తెలుపుటకు కనఁబడునవి దృశ్యము లనియు కనుఁగొనునది దృక్కనియు లక్షించి దానికి ఉదాహరణముగా రూపములు దృశ్యములనియు కన్ను దృక్కనియు, ఇటులే మరల కన్నుదృశ్యమనియు మది దృక్కనియు, ఇటులే మరల మది దృశ్యమనియు సాక్షి దృక్కనియు—

"మనసు బుద్ధి యనంగ ద్వివిధం
బు నగు కరణ మొకండె, బుద్ధి యు
గును నమలముగఁ జూడఁ గల్మషగుణము నగు మనము,
మనసు మఱచుట బుద్ధి తెలియుట
తనగు మఱి పెఱుకలస్వరూపము
గ నెడు నిజమగు తెలివి ద్రష్టకుఁ గాంచఁగాఁ దనయా! 3-36"

"తలఁప దేహముకంటె నింద్రియ
ములు ఘనంబులు నరయ నింద్రియ
ములకు మేలు మనంబు మదికిని బుద్ధి యుత్తమమౌ;
తెలియుబుద్ధిని తెలివి సాక్షిగ
నిలుచునది సోహ మ్మనుచు ని
మ్మలుఁ డగునా ప్రత్యగాత్మకుఁ గలుగఁ డోరుఁడింక. 3-31

అని యిటులు నిన్ను జుట్టుపుచ్చుకొని పైకిలాగి అన్నమయాదికోశ ములు నీవు కావు; జాగ్రత్ స్వప్నసుషుప్తులను జూచువాఁడవు 'నీవు', అన్నిటిని తెలిసికొను తెలివి 'నీవు' అని తెలియఁజెప్పి ఆ తెలివి నీవై యుండియు 'నన్ను నే నెఱుఁగను' అని అందువు. 'నాకు నాలుక లే దని' చెప్పునటులు ఇది హాస్యాస్పదము. 'నేను ఆత్మ నెఱుఁగ' నని యనుట నాతల్లి గొడ్రాలని అనుట కాదా? నీశరీర ములో ప్రతిఫలించు ఆత్మ నెఱుఁగ నని యనుట నీట నిలిచిన చా కలి దప్పిచే చచ్చినటు లగుఁ గదా? అని యితఁడు మనల నాశ్చర్య చకితులను, లజ్జాళువులను జేయును.

ఆశ్చర్యపడి యేమిలాభము, లజ్జించిన నేమిలాభము? ఇంత మాత్రమున నిన్ను నీవు కనుఁగొంటివిగనుకనా? కావున నీలో నీ వెంత ఉంటివో చెప్పి అంతకు ఇంకను పదిరెటు ఉంటి వనియు

'త్రాడు పాముబోలెఁ దెలివిని
జూడఁ జూడఁగఁ బాము గా కవి
త్రాడె యగునటు నిజపదార్థము తలఁప భ్రాంతి మెయిన్
జూడ భువనములట్లు చూపున
నాఁడు, మదివిభ్రమము దొలఁగిన
తోడఁ దాఁ దానైనవస్తువు తుదకు బ్రహ్మ మగున్".

ఎఱుఁగ బ్రహ్మపిపీలికాంతముఁ
బరఁగు ప్రాణులబుద్ధిభావన
కెఱుకపడకయె సాక్షియగుచును నెనఁగు నేవిభుఁడా
కరణతతు లెవ్వానికరుణన్
బరిపరిగ వర్తింపనేర్చునొ,
అరయ వానినిమిత్తకారణ మదియు బ్రహ్మమగున్. 5—37.

అని బ్రహ్మోపదేశముతోపాటు—

'మాయ యనునది మిథ్య, జీవని
కాయమనున దబద్ధమగు, న
న్యాయ మాయాభేదబోధన, మరయఁగా నిజమున్
గాయఁ డేభటుఁ డాభటుండే
రాయఁ డనుచందమున బ్రహ్మము
మాయచే జీవుండు జీవుఁడె మరల బ్రహ్మమగున్. 5-38

"ఓలి శ్రుతితతి తత్త్వమసి" యని
పోలఁ దెల్పెడి వినుమవిద్యా
జాల మాత్మను నావరింపఁగఁ జాలదు"—

అని మహావాక్యోపదేశముచేసి సప్తభూమికలలో త్రిప్పి పరమా
త్మను మాయను వివిక్తముగాఁజూపి తానాత్మత్వమునఁ దృప్తి గనక,

'తనయ తత్త్వముఁ దెలిసినంతనె
తనువు తా నస్వభ్రమను విడువదు"— 10—5.

అనిచెప్పి మున్ను విరక్తితో దూషించినప్రపంచమునంతయు బ్రహ్మమయమే యని భూషించి మరల,

"లేని దగుమాయాప్రపంచమె
గానఁబడి నిజమాటుల దృశ్యము
గా నెగడెను దదాశ్రయంబుగఁ గలుగుసాక్షి యదే.
తా నలరె దృక్కనఁగ రెండును
లేనివే యగు నిత్యసత్య
జ్ఞాన మది దృగ్దృశ్యభేదముఁ గనునె బ్రహ్మంబు? 8—20.

అని దృగ్దృశ్యభేదము నెగురఁగొట్టి నిన్ను జీవన్ముక్తుని జేసి విడుచుచున్నాఁడు.

అశ్వత్థరాయలు—ఆంధ్రీకరణము.

ఈయనుభవామృతము స్వతంత్రగ్రంథము అని అనిపించును గాని ఏమూలను ఆంధ్రీకరణము అని అనిపింపదు. (కవియింటిపేరిలో కరణము తక్క.) ఇందెన్నియో జటిలము లగు అంశము లున్నవి. కాని తదర్థ మెరుల నర్థయాచనము చేయ నక్కర లేదు ఇందలి భాష భావమున కద్దమయినను వింతయేమనగా గడుసుదనమున కిసుమంతయు లోపము లేదు. నాలుగుపద్యములు చదివినంతనే యిందలిపలుకుబళ్ళు తెలుఁగుదనము నిండుదనము నడక పోకడ నిలుకడ మొదలగుకవితాసామగ్రి మనల నాత్మీయులఁ జేసికొనును. [illegible]షట్పది నందుకొన్నను 'ఝు'మ్మనుచు అప్రయత్నముగా కన వఱిఁ బరుగిడును. కాళిదాసునోట మందాక్రాంత మేనడచెను; అశ్వత్థరాయనినోట షట్పదియే నడచెను. అందలియర్థమో మడ

అంతఃకరణములకు గౌరవప్పును. ఈషత్పది బ్రహ్మకమలమునుండి అమృతమును మనపై చిలుకరించుచున్నది. రంగడు ఉపనిషత్తుల నుండియు, కొన్ని వేదాంతగ్రంథములనుండియు, కొన్ని భాగములను శ్లోకములను కన్నడించుకొనియుండెను. అవి అశ్వత్థరాయునిచే చక్కగా తెలిగింపబడినవి.

ఈ యనుభవామృతమందు "రోచన" (3—26) అను ప్రయోగము తగులును. శ్రీ త్యాగయ్యగారు 'రోచన కమలలోచన' అనుకృతిలో 'రోచన' అని వాడిరి. యుచ-లుడ్యంతరూపమగుచో అర్థముకుదురదు. కొందఱు 'రోజన' అని వాడుదురు 'యుజ' ధాతువునకును 'ఆలోచన' అను నర్థము లేదు. కాని ఇదిలోకసిద్ధము.

ఇంతచక్కని యీ తెలుఁగుఅనుభవామృతము దేశాటనము చేయుచు అందఱకు జ్ఞానభిక్ష పెట్టుమహాజ్ఞానివలె తెలుఁగునాట మాఱుమూలలఁ గూడ మాఱుమ్రోగగలదు, ఈయమృతమును తెలుఁగువారి కిచ్చినశ్రీఅశ్వత్థరాయలకు ఒకతూరి జయవెట్టి శ్రీమహాలింగరంగని గొప్పఅనుభవసూక్తుల నెడనెడ నలఁతిమార్పులతో ఎత్తిచూపుదును.



## 2-వ భాగము.

### 1వ ప్రకరణము.



### 2వ ప్రకరణము.



### 2 ప్రకరణము.

*("కింజ్యోతి స్తవభానుమాన్", శంకరభగవత్పాదా.)

49 బుద్ధి లోఁజూపున బుద్ధమగును; వెలిచూపున విక్షిప్తమగును. బంధమోక్షములు బుద్ధివే 141

50 ఇనుపకుండు నీట మునుఁగును; ఇనుపగిన్నె తేలును. సంసార బుద్ధి మునుఁగును; జ్ఞానబుద్ధి తేలును. 142

51 బుద్ధి దేని నంటునో అదిగా మారును. బుద్ధిని విషయమున కంటించితివా విషయమగును. బ్రహ్మమున కంటించితివా బ్రహ్మమగును. 143

52 మాసిన దోస మద్దముదా కడుగనివానిదా? కలఁగు దోసము బుద్ధిదా కడుగని నీదా? 148

## 4 ప్ర.

53 నింగిలో కప్పువలె దివ్వెలో నలుపువలె చంద్రునిలో కందువలె భూమిలో మాయ. 36

54 తననిద్రలో తాను పడియుండఁగా వచ్చినకలవలె తన్నెఱుఁగని అవిద్యచేతనే ప్రపంచోత్పత్తి. 41

55 ఆవమున కాఁగు కుండ లీబ్రహ్మాండంబులు. 49

56 ఎండ నింగిని గనఁబడక పల్లెలనక పత్తనములనక భూమి నెల్లెడఁ గనఁబడునటులు బ్రహ్మము పూర్ణమయ్యు కొన్నిటకనఁబడక కరచరణాదుల కనుబండువుగ వెలుఁగొందును. 50

57 మణులలో సభమటులు బ్రహ్మాండములో బ్రహ్మము వెలుఁగును. 51

58 నీవే మామవు, మఱఁదివి, తండ్రివి, తాతవు. ఎఱుకయే సకల నామరూపాత్మకము. 55

59 ద్రవమయ్యు, శుభ్రమయ్యు, ఆనందమయ్యు, అనంతమయ్యు, ఆత్మ ఒకటే. 57

5 వ॥.



6 వ॥.

7 వ



8 వ

10 ప్రె

## ౩వ భాగము.

---

అద్వైతప్రక్రియ యిది:—

తత్త్వము ఒక్కటన్ననొక్కటి అది ఆత్మ. ఆత్మ దృగ్రూపము (౩—270 అను) అనఁగా జ్ఞానరూపము.

జ్ఞాత జ్ఞేయము జ్ఞానము అనునీమూఁటి నెల్ల రెఱుఁగుదురు. ఇందు జ్ఞానమున కాశ్రయుఁడు జ్ఞాత. జ్ఞానమునకు విషయము జ్ఞేయము. ఇటులు జ్ఞాతృజ్ఞేయముల స్వరూప నిరూపణము జ్ఞాన నిరూపణాధీనము. కాఁగా జ్ఞానమే తత్త్వము.

జ్ఞానము సోపాధిక మనియు నిరుపాధిక మనియు నిరుదెఱఁగులు. నిరుపాధిక మగు జ్ఞానము నిరాశ్రయము, మఱియు సన్మాత్రరూపము. దాని స్వరూపలబ్ధి కితరాపేక్ష లేదు. ఇట్టి జ్ఞానమునకే బ్రహ్మ మని పేరు.

జ్ఞానము బ్రహ్మమునకు గుణముకాదు, మఱి స్వరూపమే. శ్రుతి బ్రహ్మమును విజ్ఞాతగా చెప్పినమాట (బృహ 2-4-14.) ఉపచారము, బ్రహ్మము అద్వితీయము. భేదమూలక మగు ధర్మధర్మి భావము విషయవిషయిభావము దాన విపరీతము- కాన బ్రహ్మమునకు జ్ఞేయత్వము లేదు.

సోపాధిక మగు జ్ఞానము సాశ్రయము; సవిషయము. ప్రమాణాదిజన్యము. ఇది లౌకికము. పుల్లయ్య కుండ నెఱిఁగెను అను నపుడు ఎఱుకకు పుల్లయ్య ఆశ్రయుఁడు. కుండ విషయము. ఇది సోపాధికము. ఈజ్ఞానము ఆశ్రయమును విషయమును లేక భాసింపదు. కావున విషయాశ్రయము లగు కుండపుల్లయ్యలతోపాటు ఈ సోపాధికజ్ఞానముకూడ కల్పితమే. కాఁగా కల్పితము లగు వస్తువు లన్నిటికిని ఆశ్రయమును కల్పనాధిష్ఠానమును గనుకనే బ్రహ్మము జగత్కారణము.

కారణము కార్యముకంటె సూక్ష్మము. ఈసూక్ష్మత కార్యాకారత్యాగతనుబట్టి గాని పరిమాణమునుబట్టి గాదు. మఱియును కారణము వ్యాపకము. కావుననే కారణము కార్యముకంటె సామాన్యభూతము. అనఁగా కార్యగతవిశేషహీనము ఘటాదులందలి ఘటత్వాదివిశేషములు కారణావస్థయందు మట్టిలో కానరావు. కావుననే సర్వకార్యములకును కారణమగు బ్రహ్మము సర్వవిశేషరహితము.

విశేషశూన్యమగుట బ్రహ్మసజాతీయమగు చేతనమొండె బ్రహ్మవిజాతీయమగుధర్మమొండె ఉండదు. సవిశేషమగు వస్తువే భేదమునకు అధికరణముగదా; కావున బ్రహ్మము అద్వితీయము భేదత్రయశూన్యము, నిర్విశేషము.

దానఁజేసియే నిర్గుణము. 'నిర్గుణమ్' అనిశ్రుతి కల్యాణగుణములుగూడ బ్రహ్మమున లేవని చెప్పుచున్నది. బ్రహ్మము సగుణమేని దాన సవిశేషత్వము తప్పనిసరియగుటచే కారణత్వభంగము ఉప్పతిల్లును. సగుణశ్రుతు లారోపితగుణగాయికలు. బ్రహ్మమునందు గుణములను ఒప్పి హేయగుణరాహిత్యముగా నిర్గుణశ్రుతులను సమర్థించు నెడల బాహ్యేంద్రియగ్రాహ్యమగు రూపరసాదులు లేనివాఁడగుట జీవుఁడును నిర్గుణుఁడు ఏలకాఁడు? సుఖదుఃఖాదిగుణరాహిత్యముచే భూతములును నిర్గుణము లని చెప్పవచ్చును. కాన బ్రహ్మమునందు అసలు కల్యాణగుణములుగూడ లేవు. బ్రహ్మమునందు కలవని అనుకొనఁబడు కల్యాణకారకము లగు గుణములు జీవులకు జీవావస్థయందే ఉపయోగించును. ఆయవస్థయు అవిద్యాకల్పితము. కాన ఆగుణములును కల్పితములే. కలలో దేశాంతరమున కేఁగ నుపయోగించు బండిగూడ కల్పితమేకదా; మఱియు బ్రహ్మము నిత్యము. అది పరిణామినిత్యత కాదు. బంగారము ముదుగుగా గొలుసుగా మాఱినను ఆయానగలవలె నశింపదు గాన నగ

శంతె బంగారు నిత్యము. బ్రహ్మనిత్యత అట్టిదికాదు. అది కూటస్థనిత్యత. అనగా ఎపుడును ఒకేరీతిగా నుండుట. శ్రుతులు బ్రహ్మమును వికారరహితమని చెప్పును. అట్టిదానికి పరిణామ మసంభవము.

మఱియు బ్రహ్మ మద్వితీయము. బ్రహ్మమునకు సంబంధించిగాని సంబంధింపకగాని శరీరభూతముగాని ధర్మభూతముగాని ఏదేనియు కొండొకటి లేదు. (8—8 అనుభ) కావుననే దీని వివరించు మతమునకు అద్వైత మని పేరు.

బ్రహ్మము సన్మాత్రరూపము. అనఁగా 'ఇట్టిది అట్టిది' (3—33.) అని చెప్పవీలుకాక, 'ఉన్నది' అని మాత్రమే చెప్పఁదగినది. అట్టి దిట్టి దనువిశేషణములచే సద్వితీయతాపత్తికలుగును. సన్మాత్రరూప మగుబ్రహ్మము జ్ఞానస్వరూపముగాన జ్ఞానముగూడ సన్మాత్రరూపమే. సన్మాత్రము అందు విషయము కాదు. లౌకిక జ్ఞానమువలె సాశ్రయమును సవిషయమును అగునేని సత్సామాన్య రూపత్వ మెనయమి జ్ఞానము బ్రహ్మస్వరూపము కాకపోవును. అపుడు 'బ్రహ్మము విజ్ఞానఘనము' అను శ్రుతికి పెట్లువచ్చును.

అనాదిగా అజ్ఞానము కలదు. *ఇది త్రిగుణాత్మకము. ఇది ఉన్నదనియు లేదనియు చెప్పుటకు వీలులేనిది. మఱియు నిది భావరూపము. భూతములకు ప్రకృతి. దీనికే మూలప్రకృతి అవిద్య తమస్సు మోహము ప్రధానము గుణసామ్యము అవ్యక్తము మాయ కారణ మొదలగు పేళ్ళు. శుక్తిరూప్యాద్యుపాదాన మగు అజ్ఞానమునకు తూలాజ్ఞాన మనియు పల్లవాజ్ఞాన మనియును పేళ్ళు.

'జీవుఁడు, ఈశుఁడు, చిత్తు, అవిద్య, జీవేశ్వరభేదము, అవిద్యాచిద్యోగము అనునీయాఱును అనాద్యములు' అని ఒప్పుచు బ్రహ్మ

---

*8—4, 8—31, 8—35, 8—4, 5—8, 4—2, 5—57, 5—39, 10—66 చూ. అనుభవామృతము.)

మద్వితీయమని యెటులు? అని అనుచో:- చిద్భిన్నములగు నైదిటికిని వ్యావహారికసత్తయేగాని పారమార్థికసత్త లేదు. ఇవి అనాదులైనను అనంతములు కావు. వీనిలో జీవేశ్వరభేదము అవిద్య చిదవిద్యాయోగము వీనికి స్వరూపనాశము. జీవేశ్వరులవిషయమున వానిఉపాధికే నాశము. పారమార్థికసత్యాభిప్రాయమునుబట్టి బ్రహ్మమద్వైతము.

ఈమాయలో చిత్ప్రతిబింబ మీశ్వరుఁడు. మాయకు ఆవరణశక్తి విక్షేపశక్తి అని రెండుశక్తు లున్నవి. అవియ అవిద్య. అవిద్య రజఃప్రధాన. బహుప్రకార. అనంత. ఆ అవిద్యయందు చిత్ప్రతిబింబము జీవుఁడు.

శుద్ధసత్త్వప్రధాన మాయ. మలినసత్త్వప్రధాన అవిద్య. మాయాప్రతిబింబ మీశ్వరుఁడు. అవిద్యాప్రతిబింబము జీవుఁడు. ఇది ఒకమతము.

మూలప్రకృతియే విక్షేపప్రధాన (6) మగుచో మాయ. అది యీశున కుపాధి (7) ఆవరణప్రధానమగుచో అవిద్య. అది జీవోపాధి (8) ఇది ఒకమతము.

అజ్ఞాన మేకరూపమే. కాని దానికి రెండుశక్తులు. ఒకటి జ్ఞానశక్తి. రెండు క్రియాశక్తి. రజస్తమస్సులచే అడఁగనిసత్త్వము జ్ఞానశక్తి. శబ్దాదివిషయక మగుజ్ఞానమున కది హేతువు. ఇఁక క్రియాశక్తి ఆవరణశక్తియనియు విక్షేపశక్తియనియు ఇరుదెఱఁగులు. రజస్సత్త్వములచే అడఁగనితమస్సు ఆవరణశక్తి. 'కుండ లేదు, కనఁబడుటలేదు'. ఈమొదలగువ్యవహారమున కది హేతువు. తమస్సత్త్వములచే మరుఁగుపడనిరజస్సు విక్షేపశక్తి. విక్షేపశక్తియుక్తాజ్ఞానోపహితస్వరూపము చేతనే ఈశ్వరుఁడు జగదుపాదానము గనుక ఆకాశాదిప్రపంచోత్పత్తికి విక్షేపశక్తి హేతువు. జ్ఞానశక్తియుక్తాజ్ఞానోప

హితస్వరూపముచేత ఈశ్వరుఁడు జగత్కర్త. ఈమతమున ఆశక్తి కలఅజ్ఞాన మవిద్య విక్షేపశక్తి కలఅజ్ఞానము మాయ ♦

కారణ మగుఅవిద్యలో చిత్ప్రతిబింబ మీశ్వరుఁడు ♦ కార్య మగుఅంతఃకరణములో చిత్ప్రతిబింబము జీవుఁడు. ♦ ఇది యొక మతము.

ఘటాకాశ జలాకాశ మేఘాకాశ మహాకాశములపగిది ఉపాధిభేదముచే కూటస్థ ♦ జీవబ్రహ్మేశ్వరులు అను చాతుర్విధ్య ప్రక్రియ నొప్పి అందు ధీవాసనోపరక్తుఁడు అజ్ఞానోపాధికుఁడు ఈశ్వరుఁడు అనియు అంతఃకరణోపాధికుఁడు జీవుఁడనియు ఒకమతము. † ఆయాతావుల నీమతముల నేకాక జీవేశ్వర స్వరూపవిషయమున అవచ్ఛేదవాదమును † ఆభాసవాదము † ప్రతిబింబవాదమును †

అవచ్ఛేద మనఁగా అంతఃప్రవేశము. తద్వ్యాప్త మచ్ఛిన్నము. జలాంతఃప్రవిష్ట మగుఆకాశము జలావచ్ఛిన్నము, ఇటులే అంతఃకరణాంతఃప్రవిష్ట మగు చైతన్యము అంతఃకరణావచ్ఛిన్నము. ఈమతమున అజ్ఞానవిషయీకృత మగుచైతన్య మీశ్వరుఁడు. అజ్ఞానాశ్రయభూతచైతన్యము జీవుఁడు.

అన్యసంబంధముచే అన్యముగా భాసించుట ఆభాసము. మంకెనపూలదాపున నున్నస్ఫటిక మెఱ్ఱగా భాసించును. ఇది ఆభాసము. దీనికి ఉపహిత మనియు వాడుక. చైతన్య మెల్లెడను గలదు. అది అజ్ఞానమునందు భాసించి తాదాత్మ్య మొందును. ఫలిత మీశ్వరుఁడు. అవిద్యాకార్య మగు బుద్ధియం దుపహితమును బుద్ధితాదాత్మ్యపన్నము నగు చైతన్యము జీవుఁడు. †

---

♦(6—4, 8.) ♦(7-5, 8) ♦(8-9, 5, 26) ♦(9-10, 90.) †(11, 10-65; 5—43) †(10—61) †(7—10) †(7—8 అనుభవాప్తమతము స్వీకరించెను.) †(5—7 అను.)

ప్రతిబింబ: మెల్ల రెఱుఁగుదురు. బింబము సూర్యుఁడు మొదలగుపదార్థములు. బింబము లేక ప్రతిబింబ ముండదు. ప్రతిబింబము లేకయు బింబ ముండును. బింబమునందలి మార్పు లన్నియు ప్రతిబింబమునం దుండవచ్చును. కాని ప్రతిబింబమునందలి మార్పులు బింబమునం దుండవు. అద్దము నూఁపుచో ప్రతిబింబమే యూఁగును గాని బింబ మూఁగదు. వేఱొకటి—రెండద్దములనడుమ నొకఁడు నిలిచెనని అనుకొందము. ఒకఅద్దములో అతఁడు ప్రతిబింబించును. ఆప్రతిబింబము రెండవ అద్దములో ప్రతిబింబింపవచ్చును. అది మరల మూఁడవదానిలో ప్రతిబింబింపవచ్చును. ఇటు లెన్ని ప్రతిబింబించినను బింబ మొకటియే.

బింబములేక ప్రతిబింబము ఉండజాలదు గాన బింబప్రతిబింబము లొకటియే అని అనవచ్చును. ప్రతిబింబము మిథ్యయు బింబము నిక్కపుమును గాన ఈ రెండును వేఱయు అనవచ్చును. ఇదియు బింబప్రతిబింబభావము. అజ్ఞానప్రతిబింబ మగుచైతన్య మీశ్వరుఁడు; బుద్ధిప్రతిబింబిత మగుచైతన్యము జీవుఁడు. §

‘ అవిద్యాకార్యబుద్ధ్యుపహితచైతన్యము జీవుఁడు’ అనుమతమునందును ‘బుద్ధిప్రతిబింబితచైతన్యము జీవుడు’ అను మతమునందును ‘అంతఃకరణ తత్సంస్కారావచ్ఛిన్నాజ్ఞాన ప్రతిబింబితచైతన్యము జీవుఁడు’ అను మతమునందును జీవున కనాదిత్వము లేకపోవలసి వచ్చును.

త్రిగుణాత్మక మగు అవిద్య లేక అజ్ఞానము జ్ఞానముచే నివర్తనీయము.§

‘ బ్రహ్మమును నేనెఱుఁగను’ అను అనుభవము ఇచట ప్రమాణము.

---

§ 5—8, 3—107, 5—40.

చిదవిద్యాయోగ మనాదియని అంగీకరించుటంజేసి ఈ అవిద్య యెటులు పుట్టెననియు ఏకారణమువలన దీనికి బ్రహ్మతో సంబంధము కలిగెననియు ప్రశ్నింపలేము. కాని ఆసంబంధ మిటు లూహింపనగును:— లెసను చల్లార్చు నీటిలో అగ్ని తానుగా చొఱంజాలక కాగు కుండ మొదలగు వానిని ఆశ్రయించి వానియే సాయమున సూక్ష్మరూపముతో నీటం జొచ్చి దాని చలువదనమును మాయించి తన వేడిమిని నీటిదిగాం గనంబఱచుచున్నది. అటులే అవిద్య తాను సొంతముగా బ్రహ్మమునం జొఱలేక సూక్ష్మతర మగు తనమూలరూపముతోం జొచ్చి నిరాశ్రయమును నిర్విషయమును సామాన్యము నగు బ్రహ్మస్వరూపము నాచ్ఛాదించి సాశ్రయత్వ సవిషయత్వరూప మగు తనవిశేషరూపమును బ్రహ్మముదిగాం గనంబఱచును. §

భాసమానమగు ఈజ్ఞానమే మహత్తత్త్వము. మహత్తు మొదలు మహీపఱకును గలదంతయు సాదియే కాని అనాది కాదు. గాన జ్ఞానరూపమగు బ్రహ్మ మొకటియయ్యు ధర్మధర్మిభావముచేతను విషయవిషయిభావముచేతను జ్ఞాతృజ్ఞేయ రూపముగా కనంబడును.

అందు జ్ఞాత అహంకారము. జ్ఞేయము శబ్దతన్మాత్రాదులు. భాసమానమగు నిదియెల్లయు అవిద్యాపేక్షచే పరిణామము. బ్రహ్మాపేక్షచే వివర్తము. పూర్వావస్థను వీడి అవస్థాంతరము పొందుట పరిణామము. ఉదా:- పాలని చెప్పంగలవీలు పోయి పెరుగని చెప్పవలసివచ్చుట. పూర్వావస్థను విడువకయే అవస్థాంతరభానము వివర్తము. ఉదా:- తాడు తాడుగ ఉండియే పాముగాం గనంబడుట. తన్మాత్రలనంగా సూక్ష్మభూతములు. శబ్దతన్మాత్రము సూక్ష్మాకాశము దాన స్పర్శతన్మాత్రము అనగా సూక్ష్మవాయువు జనించెను. ఇటులే వరుసగ సూక్ష్మభూతముల పుట్టుక.

---

§ 4—౩౮,

అనుభవామృత మిటుల చెప్పుచున్నది:—

ఆదిమధ్యాంతములులేని య
భేద నిర్గుణ నిత్య నిరతా
మోద సహజావ్యక్త చిత్ పరిపూర్ణుడై తనా
నాదరూపునిలోనఁ గల్గె వి
వాదమయ శబ్దంబు దానినె
యీాదృశంబై తగు ప్రపంచంబెల్ల నుదయించెన్ 4—10

తనయ! తద్వాచ్యమున శబలతఁ
గనిన బ్రహ్మము గల్గె సదస
త్తనఁగ వ్యక్తావ్యక్త మందున నామహత్తందున్
మొనసి త్రిగుణాత్మిక మహంకృతిఁ
దనరె వైకారికము సత్త్వం
బునను రజమునఁ దైజసము తమమునను భూతములున్. 4—11

ఈనాద బ్రహ్మప్రక్రియ తంత్రశాస్త్రమున సుప్రపాతము.

అవిద్య త్రిగుణాత్మకము అవిద్యాపరిణామము పంచభూతములు. కావున అవియు త్రిగుణాత్మకములు. వానిలో ఆకాశసాత్త్వికాంశము వలన చెవి, వాయుసాత్త్వికాంశమువలన మేను, తేజసాత్త్వికాంశమువలన కన్ను, జలసాత్త్వికాంశమువలన నాలుక, భూసాత్త్వికాంశమువలన ముక్కును పుట్టెను. పంచభూతముల సాత్త్వికాంశము లన్నిటికలయిక వలన అంతఃకరణము, భూతముల రాజసాంశముల ఐదిటియు కలయికవలన ప్రాణము.

పంచీకరణమునఁ జేసి భూతములు దృశ్యములగును. స్థూలములగు ప్రాణిశరీరము లన్నియు పంచీకృత భూతపరిణామమే.
)4—8...30)

అన్న—ప్రాణ—మనో—విజ్ఞాన—ఆనందమయ కోశములు శరీరాంతర్గతములు. స్థూల మన్నమయ కోశము. కర్మేంద్రియములతోఁగూడిన ప్రాణము ప్రాణమయకోశము. జ్ఞానేంద్రియములతోఁ గూడిన మనస్సు మనోమయము. బుద్ధి విజ్ఞాన మయకోశము. దానిలోనున్న అజ్ఞానముగాని ఆత్మగాని ఆనందమయకోశము.

జీవాత్మకు కర్తృత్వమేని భోక్తృత్వమేని ఔపాధికము. బుద్ధి శబ్దవాచ్యమై నిశ్చయాకారవృత్తి గల అంతఃకరణము కర్తృత్వోపాధి. సుఖాద్యాకారవృత్తిగల అంతఃకరణము భోక్తృత్వోపాధి. జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియములైదును ప్రాణపంచకమును మనోబుద్ధులును వెరసి పదియేడింటిముద్ద లింగశరీరము. ఇదియే సూక్ష్మశరీరము లేక కులుచమేను. మృతిచే నిది నశింపదు. ప్రళయమున నశించును. అందు సూక్ష్మశరీరమునకు కారణమగు అజ్ఞానము మిగులును. ఆయజ్ఞానమే కారణశరీరము. తత్త్వజ్ఞానముచే మోక్షావస్థలో ఇది నశించును. తురీయావస్థలో దేహత్రయాభిమానము లేకున్నను తత్సంబంధము మాత్రము తొలఁగదు. నిద్రలో కారణ దేహాభిమానమును కలలో కారణ లింగ దేహాభిమానమును మెలకువలో మూఁటి అభిమానమును ఉండును.

నిద్రాజాగ్రత్సంధిలక్షణము తురీయావస్థ. అందు జ్ఞానము పరిణామోన్ముఖమై గర్భమునుండి వెలువడఁబోవు శిశువువలె నుండును. సంస్కారములన్నియు నశియుటచే జీవన్ముక్తిదశలో జ్ఞానము పరిణామోన్ముఖము కాదు. అవిద్యాపరిణామము రజ్జుసర్పము. దీని కధిష్ఠానము బ్రహ్మము. అవిద్యాకార్యమగు పాము సత్యముకాదు, అసత్యమునుగాదు. అదిసత్యమగునేని రజ్జుజ్ఞానముచే నివృత్తముకారాదు. అయిన అనుభవమునందు నివృత్తమగుచున్నది. కాన పాము మిథ్య. మఱియు అది అసత్యమునుగాదు. అసత్యమగునేని ప్రతీతము కారాదు, అయినను అనుభవమునందు ప్రతీతమగుచున్నది. కాన

ఇది సద సద్విలక్షణము దీనికి అనిర్వాచనీయ మని పేరు బాధింపఁబడఁదగినదియు స్వరూపము కలదియు నగుపదార్థము అనిర్వాచనీయము. ♦

'ఇది శాస్త్రము' అను ప్రతీతియు అనిర్వచనీయమే. శాస్త్రము గూడ అవిద్యాకార్యమును అనిర్వచనీయమును అగు ప్రపంచములో నిది గనుక 'నేహ నానాస్తి కించన' ఇత్యాదులుగా శాస్త్రమే స్వయముగా అనఁగా బృహదారణ్యకాద్యము తన అనిర్వచనీయతను చెప్పికొన్నది.

శాస్త్ర మనిర్వచనీయ మయ్యు తత్త్వజ్ఞానహేతువు. కలలో గుఱ్ఱములును బండ్లును జీవకల్పితము లగుట అసత్యములయ్యు సత్యబుద్ధిని కలిగించును. శుభాశుభములను సూచించునుగదా. ఇంతియ కాక అజ్ఞాననివారకత్వముగా శాస్త్రము హేతువు. పారమార్థికసత్యత లేదనియే కాని శాస్త్రము గగనారవిందమువలె కల్లబొల్లి కాదు అది అపారమార్థిక మయ్యు అపారమార్థికమే యగు అజ్ఞానమునకు నివారకము † అపారమార్థికమైనను ఏతావన్మాత్రము చేతనే దీనికి ప్రామాణ్యము. ప్రత్యక్షాదిప్రమాణములచే గలుగు లౌకికజ్ఞానము సాశ్రయము సవిషయము. అంతఃకరణము దానికభివ్యంజకము, అంతఃకరణవృత్తియే లౌకికజ్ఞానము. ఇటులా యెనేని జ్ఞాత అంతఃకరణమా తదుపాధికుఁడగు జీవుఁడా? శుద్ధచిత్తు కాఁదు. అది జ్ఞానరూపమే కాని జ్ఞాత కాఁడు. అది అహమర్థముదిక అహమర్థమాత్మ కాదు. § అది అవిద్యాపరిణామముతో చేరిన అహంకారము § అహంకారమం దాత్మత్వ మారోపితమై భాసించునుగాని అది వాస్తవము కాదు. అటులే మనఃప్రాణదేహేంద్రియాదులయం

---

♦4-38, 41. § 9-24, 10-41. 9-5, 7, 8, 10, 15, 16, 19, 20, 3-105: † 10-73; 74.

దాత్మత్వమారోపితమయియే భాసించును. ఇట్టి భ్రమ పోవలయును. మోక్షము రావలయును. బ్రహ్మజ్ఞానముచేతనే మోక్షము.

సాధనచతుష్టయసంపన్నుఁడు మోక్షమునకధికారి. అట్టివానికి శ్రవణాదులచే ‡ సంశయము భ్రమయు తొలఁగి వేఱు ప్రతిబంధకము లేనిచో 'నేను బ్రహ్మమను' అను అపరోక్షప్రమ కలుగును. ఇదియే జీవన్ముక్తి, దేహపాతానంతరము విదేహముక్తి. ఇది అద్వైత మతసంగ్రహము.

ఈ చెప్పినమాటలను రంగడు అశ్వత్థరాయఁడై తెలుఁగు పలుకులలో అనుభవామృత సృష్టి చేసెను. వానిని పాఠకులిఁక ముందు చదివిచూడగలరు.

వేలూరి శివరామశాస్త్రి.

‡ శ—79—45, 69. 11—6.

# సమీక్ష

[ "కవిసామ్రాట్" శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు, ఎం. ఎ.,
విజయవాడ.]

ఈ అనుభవామృతమన్నగ్రంథమును కన్నడములో శ్రీమహాలింగరంగకవి యనునాయన వ్రాసినాఁడఁట. బళ్ళారిజిల్లా రాయదుర్గగ్రామనివాసి శ్రీకలుగోడు అశ్వత్థరావుగారు తెలుఁగులోని కనువదించిరి. నాకు కన్నడము తెలియదు. నన్నీకావ్యమునుగూర్చి పరామర్శించు మని యనువాదకుని నిర్బంధము. మూలగ్రంథము అనువాదముకంటె నధికముగా నుండియుండవచ్చు నని యనుకొనవచ్చును గాని యీగ్రంథరచనచూచినచో మూలమునకంటె నిదియే గొప్పగ్రంథ మేమో యనిపించుచున్నది. భావములన్నియు మక్కీకి మక్కీ కావచ్చును. తెలుఁగులో చెప్పుటలోని యొకవైలక్షణ్యము చేత నీగ్రంథము మహోత్కృష్టముగా నున్నది. మూలమైనపదకము, వేదాంతవిషయములు సర్వమును కన్నడకానివే కాని, యీ యనువాదకునకున్నధారాశుద్ధియు భాషామాధుర్యమును మూలకారునకున్నవో లేవో తెలియదు. భాషాదృష్టితోఁ జూచినచో నిదియొక పరమోత్తమమయిన గ్రంథము. ఇదియొక యమృతప్రవాహము. వేదాంతసంబంధమయిన పారిభాషిక పదములుతీసివేసినచో నింతచక్కని తెలుఁగురచన వేయిపుస్తకములలో నొకదానిలోనఁ గూడ నుండదు.

ఈ తెలుఁగింత ప్రకాశించుటకు మఱియొక కారణము గలదు. తిక్కనాదులవలె చంపకాది వృత్తములు తీసికొనినచో వృత్తములం దొక రచనాప్రౌఢి సంపాదించుటకుఁ జిరంతనాభ్యాసము కావలయును. ఆయాభ్యాసమునందు అసిద్ధియందు నొక క్లేశమున్నది. దాని పేరు సారస్వతక్లేశము. ఈ క్లేశమును బట్టియే మార్గకవిత్వమునకు నొకమర్యాద లభించెను. ఆ క్లేశ మీ గ్రంథమునందు లేదు. లేదనగా తాదృశమైనది లేదనిగాదు. ఇందు సర్వత్ర షట్పదివృత్తము. ఇది కన్నడభాషకుఁ గాణయాచి. ఈ ఛందోమార్గము తెనుఁగులో మున్ను లేదు. శ్రీ గురుజాడ అప్పారావు పంతులుగారి ముత్యాలసరములు రెండు కలిపినచో షట్పది కావచ్చును. ముత్యాలసరములు వ్రాసినవారు చాలమందిగలరు. ఎవ్వరిరచనయు నశ్వత్థరావుగారిస్థాయి నందుకొనలేదు ఇది యొక యమృతప్రవాహము.

తెలుఁగులో ప్రసిద్ధమైన వేదాంతగ్రంథము సీతారామాంజనేయము. అది ప్రౌఢప్రబంధము. సామాన్యజనుల యందుబాటులో లేనిది. అమహాకవి, పద్యరచనాశక్తిలో పోతన్నగారివంటివాఁడు. ఈ గ్రంథము విషయనిగరణమునందేమి రచనయందేమి సులభమైనది, సర్వజనగ్రాహ్యమైనది.

ఈకాలమున నీయద్వైతమతగ్రంథ మెవరికిఁ గావలయును? వలసిన కొలఁదిమందికి నిది సులభగ్రాహ్యమైనది. స్వాదుపేశలమైనది.

ఈకవి సహజముగ శిల్పి కాని యిదిభాషాంతరీకరణ మగుట చేత ఈయన యొక్క భాషయు రచనామాధుర్యము ధారాశుద్ధియు మొదలయిన యనువాదకుని గుణములే మహోత్కృష్టముగాఁ గన్పించుచున్నవి. కథానిర్మాణకథాకథనాది విషయములలో నీయన ప్రతిభ యెట్టిదో యిందు కనుగొనుటకు వీలులేదు. కాని కవి

ప్రతిభావంతుఁ డనుటకు నొకటిరెండుగుర్తు లీకావ్యమునఁ గలవు. ఇందు పదునొకండు ప్రకరణములున్నవి. ఈషట్పదీవృత్తములో నారుచరణము లుండును. ప్రతిప్రకరణము మొదలిచివరిషట్పదులు వేపలపర్తి శ్రీరంగని సంబోధనములు. ఈయన దేవుఁడు. వేపలప అను గ్రామములో నున్నస్వామి. ఆయన కీగ్రంథ మంకితము. మొదలి ప్రకరణము వదలినచో తక్కినయన్నిప్రకరణముల మొదలి షట్పదులలోని స్వామిసంబోధన మూడవచరణాంతమం దుండును. ప్రకరణాంత షట్పదీగతసంబోధన యారవచరణాంతమం దుండును. ఇది యొక చిన్నమెలకువ. శిల్పపుజాతికి సంబంధించిన యొక రచన. మరి రెండవది యీకవియొక్క తెలుఁగుసేత. ఈవృత్తమును భావమునుబట్టి పలుచోట్ల పలువిధములుగా కవి మలచును. ఆరుచరణములుగల యీవృత్తము పలురీతులుగా మలచబడు స్వత్వము కలిగియుండును.

ఏరు దాఁటగలారు కారా
గారములు లేపాపఘోరా
ఘోర మగుసంసారమును; గనఁగాఁ జరాచరముల్
దూరి స్వర్గముఁ దారి నరకముఁ,
జేరి ధారణి, సుకృతదుష్కృత
కారణముగా సుఖము దుఃఖముఁ గంద్రు మనుజులొగిఁ,

(2.అ, 5-వ)

ఈషట్పదిలో మూడుచరణములనడక వేఱు, చివరి మూఁడు చరణములనడక వేఱు. ఇట్లు పలుచోట్ల పలుసొగసులు గలవు. పాఠకులు చూచుకొనవలయును.

ఈగ్రంథములో మొదలిరెండధ్యాయములలో కవియొక్క ప్రతిభ యతిశయముగఁ, దక్కినవానిలో విషయబోధన ప్రధాన

ముగ గన్పించుచున్నది. సర్వశాస్త్రగ్రంథములు నిట్టివియే. ఆశాస్త్రగ్రంథమును నిర్మించువాఁడు తనసిద్ధాంతమును తోఁచినట్లు చెప్పునప్పుడు ప్రతిభా భాసకముగా నుండును తక్కినదంతయు సామాన్యముగా నితరులు చెప్పినదియే.

ఇందు ప్రథమ ప్రకరణ మధికారినిర్ణయము. అన్వయవ్యతిరేకనిందలచేత నధికారినిరూపణము చేయఁబడినది. ఇఁక రెండవ ప్రకరణము; ఇది బహ్వంశములుగా నిరూపింపబడినది. ఈప్రకరణ మీకావ్యమున కలలామభూతమైనది. మహాలింగరంగకవియొక్క ప్రతిభ యావంతయు నీప్రకరణమున నున్నది. మొదట ప్రపంచము నిత్య మనుకొనువాని నిత్యత్వభావము మృత్యువుచేత నిరాకరించినాఁడు. ఆ మృత్యువును వివరించినాఁడు. మృత్యువుకంటె పూర్వమయిన జీవితములో లోకమునందలి యన్యాయముచేత సుఖము లేదని నిరాకరించినాఁడు. పరమమైన బ్రహ్మభావమును స్థాపించుటకు సణిమాదిసిద్ధులను బ్రహ్మనులయహంకారమును నిరూపించినాఁడు. తరువాత కర్మాధీనత ప్రపంచించినాఁడు. మదము, మాయ, మోహ నిరాకరము పునర్జన్మము నీవిషయములను క్రమముగాఁ బరామర్శించి వైరాగ్యముతప్ప వేరొకగతి లేదని నిస్సంశయముగా స్థాపించినాఁడు. ఇది యీశాస్త్రమునకు మూలకందము. మరల నిది శాస్త్రగ్రంథము కాదు. ప్రకరణగ్రంథములవలె తర్కజటిలము గాదు. ప్రమాణము సర్వధా ఉపమానమే. ఆయుపమానము లోకజ్ఞత పరమరమణీయము. ఈకవియొక్క లోకజ్ఞత పరమరమణీయమైనది. దీని కొన్నియయిన నుదాహరణముల నీయవచ్చును. కాని పరమాశ్చర్యకరమైనది యొకటి చూపింతును,

కన్నశిశువుకుగాక, ధనమిడు
చున్నవిటునకుగాక యటునిటు
లన్నడచు "బాలెంతలంజ" విలాసచేష్టగతిఁ,

అన్నిఁగడు చెడు సిమావరంబులు;
నెన్న జీవన్ముక్తి నొందక
సున్న యగు సంసారసౌఖ్యము-చూడఁ డెద్దరినిక్ (2.అ 91.ప)

ఇందున్న "బాలెంతలంజ" యన్నశబ్దము లోకజ్ఞత కవధిభూతము. మూలము నం దెట్లున్నదో? ఇట్లు తెలుఁగుచేసిన యశ్వత్థరావుగారి ప్రతిభ చాలగొప్పది.

కవిశబ్దశక్తి యెన్నివిధములనుండవలయునో యన్నివిధముల నీకావ్యమునందున్నది. ఒకటి యుక్తివైచిత్ర్యము. ఈకవి యనంతమైనరచనాశక్తి గలవాఁడు.

కరి, తురగ, పశు, పక్షి మృగ, సూ
కర, శునక, మార్జాల, మర్కట,
సరట, శలభ, జలూక, కుక్కుట,—సర్పక్రిమికీటములన్,
ఖర, గగన, జల, వనచరాదులు
సురనరోరగు లరయమిథునీ
కరణమునఁబడి సహ్యలోలత—గనిరి కేమనఁగ ; (2అ.65ప)

కొన్నిద్రవ్యములయో, జంతువులయో నామములు గుదిగ్రుచ్చుటలో నీయన యొకవిలక్షణమైనరచనాసామర్థ్యమును నెఱపుచుండును. ఈగ్రంథమున నిట్టిషట్పదులు చాలగలవు. ఇట్టిదే మరియొకటి: —

కేశుల నందము, చెక్కులందము,
సురచిరాధర, మతులరదములు
మెఱుఁగుఁగన్నులు, ముద్దునాసిక—మేలిఫాలంబున్,
పరమసౌఖ్యప్రదము లని మది
మరుగుచుదురు కాముకుల్ శ్లేష్మా
కరము ఘద్వారమును గనఁగొని—కాముకులు నగుబు (2అ.71)

ఇతరులు చెప్పినభావమే తాను చెప్పుటలో నొకనైచిత్ర్యమును సంపాదించి క్రొత్తగాఁజెప్పినట్లు కన్పింప జేయుట యొకగొప్ప కవితాశక్తి.

మీలుజిహ్వాపేక్ష, కరి-కరి
ణీలసత్స్పర్శేచ్ఛ, శలభము
గ్రాలు నేత్రాపేక్ష; శ్రుతి భుజ-గంబు; ఘ్రాణేచ్ఛా
లీలభ్రమరం, బిట్టులొక్కొక
టోలి విషయేచ్ఛఁ జెడె ననఁ, జెడఁ
డేల తనయా! పంచవిధవిష-యేచ్ఛ గలనరుఁడుఁ? (2అ.79ప)

ఇందులో చివరిచరణములో "చెడఁడేల తనయా" యని సమకూర్చుట కవియొక్క సొంతపలుకుబడి. దానిచేత భావము యొక్క ప్రతిభ గోచరించును.

మఱి యుపమానములు లోకరమణీయములు. మఱియు నుపజ్ఞాసహితములు.

తెలియ సూక్ష్మశరీర మది తాఁ
దలఁచి తను వే ననుచు కర్మల
వలచి, బహుజన్మముల గని, క్రతువ్రతములఁ గృశమై
మెలఁగి స్వర్గముఁ, బిదపనరకముఁ
గలుగఁ దిరుగును రాట్నమున బిగు
వలరఁ గట్టినభాండమన నాశాంతముఁ గనకే. (3. అ. 70 ప.)

ఈచివర రాట్నమునకట్టినకుండవలె నన్నపోలిక చిత్రము గానున్నది. ఇట్టివి వేదాంతులందరు చెప్పుదురు గాని,

ఉన్నతస్తని, నిమ్ననాభిని
కన్నియను జిత్రపు పటమున,
నున్నత స్తననాభినిమ్నత లొప్పు సమమగుచుఁ;
ఎన్నఁ బూర్ణబ్రహ్మమున హై
న్యోన్నతలు లే వరయ, నంతయు
నున్న; నామాకారశబ్దస్ఫురణమాత్ర మగుఁ. (10 అ. 45 ప)

ఇది యెవ్వరును జెప్పలేరు. ఈయుపమానము సర్వాంగీణముగనున్నది. చిత్రపటములో స్తనములయొక్కయున్నతత్వము నాభియొక్కనిమ్నత్వము నిజముగా లేవు. దీని నింగ్లీషులో (perspective) అందురు. ఇదియే మాయ. ఈయుపమానము వేదాంతమున కెంతయనుకూలముగ నున్నది! కవిప్రతిభ యనగా నిది.

లోకజ్ఞత కవికి ప్రధానమైనది. ఈగ్రంథమునందు లోకజ్ఞత నికషాయమానముగా నున్నది. లోకజ్ఞత వైరాగ్యమునకు మొదటి మెట్టు. వైరాగ్య మనగా విరక్తిపొందుట. దేనినుండి విరక్తి? లోకమునుండి విరక్తి. ఆ లోకము తెలియకుండ విరక్తి యెట్లుండును? కనుక లోకజ్ఞుఁడే బ్రహ్మజ్ఞుఁడు కావలయును.

మగఁడు తనయుని ముద్దిడం గని
నగెసిజారిణిగతిని, తనువును
సొగసుఁజేయుచు మమతతో దాసుండు తా నగుచుఁ.
తగినపోషణ మెంతచేసిన
నగుచు మృత్యువు కౌఁగిలించును
జగతిఁ బ్రాణం బెవరికైనను శాశ్వతం బగునే? (2 అ. 21 ప)

ఈలోకములో నున్నప్రతారణముయొక్కస్వరూప మింత కంటె నింకెట్లుండును? భార్య భర్తను ప్రతారించుట, తక్కినప్రతారణముమాట చెప్పుట యెందులకు? ఈప్రతారించుట యెక్కడ?

ఆయువుపట్టువునందు సృష్టికి మూలభూతమైనదానియందు ఇంత కంటె వైరాగ్యమును బోధించుట యెట్లు?

లోకోక్తులను సంగ్రహించుట భాషాకవియొక్క యొకగొప్ప కవితాశక్తి. ఈగ్రంథమునందు లోకోక్తులు బహుళముగా నున్నవి. ఇచ్చట భాషాంతరీకర్త మూలకారునికంటె నతిశయించును. మూల భాషలో లోకోక్తులువేఱు. భాషాంతరమునందలిలోకోక్తులు వేఱు. ఇందు తెలుఁగుదేశపులోకోక్తులు చాలసమీచీనముగ నున్నవి. లోకోక్తులు, పలుకుబడులు, నానుడులు భాషాగ్రంథమున కలం కారములు.

కాలిసంకెలలుండ గొంతున
గాలమును గ్రుచ్చినవిధంబున
చాలవివిధములైనసంసృతి నమితి బంధింపఁగ,
లీలవిషయాసక్తుఁ డగునరు
నేల చెప్పఁగ? మోక్షశాస్త్రపు
గాలిసోఁకిననైన నైపఁడు గాంచఁగాఁ దనయా! (1 అ 24 ప)

ఇచ్చట "గాలి సోఁకిననైన నైపఁ" డనుట తెలుగు.

ఏలగృహకృత్యము? గృహము? సుతుఁ
డేల? సతిగోడవేల? సంసృతి
గోల, నమ్మగరా, దసత్యము కూడ దెవ్వరికిఁ;
జాలు చాలది. మాకు నిఁక మీ
సాల కంటినతేనె యని తల
జోలవేసియు విడువ రకట! చోద్య మిది కనఁగఁ. (2 అ. 12 ప)

"మీసాలకంటినతేనె" తెలుఁగు.

నోసటివ్రాఁతను మీఱ బ్రహ్మకు
వసముగావన, మానవుం డను
పసరమున కద్దాని ద్రోయఁగ వచ్చునే తలఁపఁగ?

ఎనఁగుపూర్వకృతం బదేరికి
వనము త్రోఁచునఁగఁ? గుడిచితీరక
తనుకుమినుకులతప్పరా వవి తనయ! నిజమిదియుఁగా.

(2 అ. 34 ప)

ఇందులో "తనుకుమినుకు"లన్నది తెనుఁగునానుడి.

మెచ్చువారికి చావుసుఖమని
యుచ్చరించిరి బుధులు, మూ త్రము
వచ్చుబిల మది తెలిసి తెలియక వాంఛ సేయుదు రే?
విచ్చిచెప్పఁగ నేల, యదియొక
పిచ్చియేసరి, తలఁప వమనముఁ
దెచ్చుచిహ్నము కాదె? సుఖ మాదేవుఁడే యెఱుఁగుఁగా.

(2 అ, 75 ప)

"సుఖమాదేవుఁడే యెఱుఁగుఁ" ఇదిసర్వదేశభాషలయం దుండ వచ్చును. కాని తెలుఁగు తెలుఁగే.

మంటిగణపతి తానమాడఁగ
వెంటనే మరణమనుసామెత
కొంటెమాయకు మూలమెఱిఁగినఁ గూలు నది యపుడే
తంటె! కలుగదుమున్ను; తెలిసిన
వెంటఁ దనుఁ దా నద్ది లయమగు
చుంటఁ, గనఁబడు నడుమ గుణఘణియోజ భ్రాంతిదమై.

(8 అ. 31 ప)

ఈసామెత యీజిల్లాలో లేదు. బళ్ళారిజిల్లాలో నున్నదికాబోలు, ఎంతబాగుగా నున్నది!

అల యవిద్యావిద్య లనఁబడు
పలుపురులపగ్గంబు వలగొనఁ
గలఁత్రవడు జీవేశు లనునవి కనఁగ, వాచ్యములౌ;

తొలఁగి యీ రెంటి నుపాసల
వల, నఖండాద్వైతచిద్ఘన
కలితశేషమౌ యసిపదైక్యముఘనత వినుతనయా! (5 అ 27 వ)

ఇందు "పలుపురులపద్గము" అన్నమాట ప్రామాణ్యమైన జీవితమును మధురముగా నిరూపించుచున్నది. ఇవి కొన్ని యుదాహరణములు. వీటినిమించి కవికొక ప్రత్యేకశైలి యుండవలయును. ఆ శైలిలో నవనవమైనస్థలములయందు ప్రౌఢియుండవలయును. ఈయన శైలియు ప్రౌఢియు నెట్టిదో యుదాహరింతును.

శైలి కవితకు ప్రాణభూతమైనది. నిర్దుష్టమైన నిర్వచనము పట్టించి యిది శైలియని చెప్పుటకుఁ గష్టమేయగుచు. వృత్తి, రీతి, శైలులు మూడు లాక్షణికు లెంతవివిచ్ఛ్యానముగఁ జెప్పినను నిది యిది యని చెప్పుటకు కష్టమే యగును. అందుచేత శైలియను మాట యిచ్చట స్థూలముగానే వాడఁబడుచున్నది. ఒకయక్షర సన్నివేశచారుత్వము లేకుండ నెవ్వఁడును కవి కాలేఁడు.

కవిత్వమున నుండవలసినసర్వలక్షణములలోనిది పరమప్రధానమైనది. ఇది లేనివాఁ డెంతభావసంపద కలిగినను కవి కానేరఁడు. ఈయక్షరసన్నివేశచారుత్వ మీయనుభవామృతమునందు సమృద్ధిగా గలదు. అధికముగా గలదు. ఈయనరచన యర్జునుఁడు యుద్ధముచేసినట్లున్నది. తెలుఁగులకు తెలుఁగులు, సంస్కృతాలకు సంస్కృతాలుం శబ్దమును శబ్దముతోఁ బొందించుటలో రమణీయత మెచ్చుటను కొరటువడదు. ఈరచన యొకయమృతప్రవాహమువలె పొంగిపొరలుచు పోవుచున్నది.

దారినడచుచు దాహమెత్తినఁ,
జేరి చలిపందిటిని నలసటఁ
దేరి, నిమిషమ్ము బెవరి నెవరినో తెలిసి కలిసి, మజిలీ

శ్రీ

# అనుభవామృతము

## సమర్పణము.

---

భామినీషట్పది:

కలుము లొలుకు ,,అనంతపుర'' మం
డలిని,-,,కల్యాణగిరి'' ఉపమం
డలిని—,,వేపలపర్తి'' గ్రామమున్ విభాసితుఁడౌ,
జలజభవముఖ నుతుఁడు శ్రితజన
సులభుఁడగు శ్రీరంగధాముం
డెలమి నా—యీ—కృతికుమారి వరింపఁ బ్రార్థింతున్. 1.

ప్రకటస్వయముద్భవ శిలామూ
ర్తికిఁ, బరంధామునకు, సద్భ
క్తకుల కల్పకముగ ధరిత్రిన్ గ్రాలువేల్పునకున్,
సకలలోకారాధ్యునకు, సుర
నికరనుత చరణునకు నా—యీ
సుకృతికన్యక నర్పణం బిడి చొక్కువాఁడ మదిన్. 2.

మును గడిగి పాదముల జనకుఁడు
తనయ "సీత" నొసంగ నెవనికి,
ఘనశరధి శ్రీకాంత నెవనికిఁ గాంతగా నిడియెఁ,
తనదుసర్వస్వంబు 'బలి' యె
వ్వని పదత్రయిఁ జేర్చె, నా—యీ
తనయ కృతి నర్పించి యతనికి, ధన్యతను గాంతుఁ

మంగళధ్వను లలరఁ జెలువుగ
ముంగిటను "వేదావతీ" నది
పొంగి పాడఁగ వినుచు, భక్తులు పూజ లిడఁగఁ గృపా
పాంగదృష్టులఁ గని మనుచు శ్రీ
రంగధాముఁడు నాదుకృతిక
న్యం గరుణఁ జేపట్టవేఁడెద నతికుతుక మతినై.

వేదనుత! అవధారు: నాయను
వాది "తానుభవామృతము" కృతి
శ్రీదయిత! త్వత్పాదసన్నిధి శ్రీతులసియుతో గం
గోదకముతో ధారవోసితి
నాదరింపుము మునిజనార్చిత
పాద! నన్నశ్వత్థరావుఁ గృపాసుధాశరధీ!

— — — —

శ్రీ

# అనుభవామృతము.

## నాంది

---

శ్రీ సురార్చిత! శ్రితజనావన!
భాసురాంబుజమృదుచరణ! వర
దాసజనదురితౌఘనాశన! ధర్మసంచరణా!
వాసవప్రముఖాభినుతపద!
వాసికెయి మమ్మేలు మునివ్యా
ద్యాస! కరుణాపాంగ వేపలిపర్తి శ్రీరంగా! 6

హరిహరబ్రహ్మస్వరూపుని
వరుని విదురాశ్వత్థదేవుని
వరముచే శ్రీరామచంద్రుకృపామహిమచేతన్
స్ఫురితమతినై కన్నడంబునఁ
బరఁగు "శ్రీమహాలింగరంగ"క
విరచితానుభవామృతముఁ జెప్పెదఁ దెలుఁగుబాసన్ 7

తెలియ నద్వైతమును, మత్సఖు
తలఁపుమెయి నిద్దాని నాంధ్రము
సలిపెదను, మూలాతిరిక్తశబ్దదోషాదుల్
గలుగుచో నారచనలో నవి
తెలిపి నాచేఁ దిద్దఁ జేయఁగఁ
దలఁతు గురువులఁ బండితులఁ దత్త్వజ్ఞుల సుకవులన్

---

శ్రీ

# అనుభవామృతము.

---

## ప్రస్తావన

---

పాలు వోసినఁ గుడువనొల్లని
బాలకునియటు మానసం బిది
యాలకింపదు హితము, మూర్ఖుని యటులఁ బరికింపన్
బాల నుపలాలించుగతిఁ గడు
లాలనల లోఁగొనినచో మఱి
పాలుపడును వినంగ స్వల్పము స్వల్పముగ నదియే. 9

వినఁ గడంగిన పిదప విడువడు
కనఁగఁ బ్రౌఢవిధాన, సతతము
వినుచుఁ దా నాసక్తిమెయిఁ గడు విహితగతి నెగడున్
అనుదినాభ్యాసమున నయ్యది
యనుపమానందాంబురాశిని
మునిఁగి నిజసాయుజ్యపథమును బొంది సుఖమొందున్. 10

అకలుషిత మధ్యాత్మవిద్యను
సుకవు, లాత్మజ్ఞులును, ప్రాజ్ఞులు
సకలజను లౌననఁగఁ జెప్పెద సరస సరళగతిన్ ;
శుకునియటు లాసక్తులయి, యో
పికను దత్పథమూని నిజతా
రకసమున్నతమోక్షసుఖసామ్రాజ్యమున్ గొనుఁడీ. 11

మున్ను జేసినపాపపుంజము
లన్నినాశము నొందు నొకక్షణ
మెన్న బ్రహ్మవిచారమును సరుఁ డెలమి, ధన్యాత్ముల్
కన్నపితరులు, నున్నబందుగు
లున్నతంబగు నతనివంశం,
బన్నరుఁడు మెట్టినదె క్షేత్రం బగును దథ్యముగన్. 12

మేరుసదృశసువర్ణరాశిని,
వారినిధిపరివేష్టితావని,
చారుకన్యాజనసహస్రము సద్విజేంద్రులకున్
ధారవోసినఫలము చేకుఱుఁ
గోరి నిమిషార్ధంబు బ్రహ్మవి
చారతత్పరు లైనసద్గుణ సాధుసంతతికిన్. 13

అది నిమిత్తం బాత్మవిద్యా
హృదయ మగు నీగ్రంథమును, ముద
మొదవ వేపలపర్తి రంగని కొగి సమర్పణగా,
విదితమై కర్ణాటభాషా
గదితమై తగు ననుభవామృత
మిది, యథాతథముగఁ దెనుంగున కే ననువదింతున్. 14

తెలుఁ గి దంచును బెడమొగము నిడఁ
దలఁచు పెద్దల కళికి పలికెదఁ
దెలుఁగు నీటగు తేటమాటల తేనెయూట సుఁడీ!
కలుగు నుపనిషదర్థముఁ నె సేఁ
దెలుఁగుపలుకుల నంటి నింతియు,
కలుగునే యొకకొఱఁత చూడ్కిని ఘనత కొఱవడదే? 15

ఒలువఁబడిన యనంటిపండటు
తొలువ త్వక్కును నిలుచుచెఱకటు,
కలఁచునుడుకులఁ దొలఁగి కమ్మనఁ గ్రమ్ము పాలటులన్
తెలుఁగుతీవులసుళువు పలుకులఁ
దెలిసి తనలోఁదన్ను ముక్తికిఁ
నలవఱచుకొనరాదె సంస్కృత మందు నింకేమి? 16

శ్రీ

# అనుభవామృతము

## ప్రథమాధ్యాయము

## అధికార నిర్ణయ ప్రకరణము

---

శ్రీకలితశుభపాద! భవ్య
లోకనాశ్రితవరద! సన్ముని
లోకవంద్య! ప్రభూ! నిగమతతి లోల! గుణశీలా!
లోకపాలన దక్ష! సజ్జన
శోకహర! అవధారు శుభది
వ్యాకృతిజితానంగ! వేపలపర్తి శ్రీరంగా! 1

వినయగరిమను మ్రొక్కి తండ్రినిఁ
గనుగొనుచుఁ బ్రార్థించె శ్రీశుక
ముని "జనక? బ్రహ్మంబదెట్టిది? పొలుచు నేరీతిఁ ?
గనఁగఫల మే మబ్బుఁ, దెలియఁగ
మనసు కలిగెను వినఁగవలె నే"
ననిన, వ్యాసుఁ డాదరమ్మున నాడు సుతుతోడన్. 2

వినుము బ్రహ్మముకంటె ఘన మిం
కనఁగ లేదు, తనంతఁ దాఁ దను
గనఁబఱచు, నది స్వప్రకాశముఁ గాంచ నేకమునై
చనును, నద్వయ, మప్రతర్క్యం
బనెద, రది శ్రుతిగురుముఖోక్తులఁ
గనఁగ నగు స్వానుభవవేద్యము గాఁగ, తనుజాత. 3

శ్రుతిగురూక్త్యుపదేశమునఁ దన
మతి నెఱింగి తనంత దానిని
సతత మననాభ్యాసవశమునఁ జక్కఁబఱచినచో,
నతిశయజ్ఞానాపరోక్ష
స్థితి యనందగు ననుభవంబగు
గతి లభించును, యోగసహజ సుఖంబె తత్ఫలమౌ. 4

అనుభవామృతమందుఁ జెప్పెద
విను, తొలుత నధికారలక్షణ
ము, నిహపరఫలభోగవిరతియు, మొదలుతుదవఱకున్
తనయ! "త్వం త" త్పదము లవి శో
ధనవిధానము, నసిపదమునం
దున సమైక్యము, భూమికలఁ దగ దొరకొనెడివిధముల్. 5

శ్రవణమననాదుల తెఱంగును,
నవల సుసమాధుల విభేదము,
వివరముగఁ బరమాత్మపదము, నభేదవాదంబుల్,
భవరహిత యోగుల చరిత్రల
నవిరళపు జీవత్రయంబును,
సవిమలంబగు నిర్గుణోపాసన వినిర్ణయముల్. 6

తెలియ బ్రహ్మముఁ దొలుత నధికా
రుల నెఱుంగఁగవలయు, విత్తన
ములను సుక్షేత్రమున విత్తినఁ బూర్ణఫల మిచ్చున్,
దలఁపఁగా నూషరపుభూమిని
ఫల మిడునె నాటంగ బీజము?
వలదు తత్త్వం బనధికారికి వత్స, తెలపంగన్. 7

జ్ఞానధర్మదయాన్వితులు, ని
ర్మానమదమత్సరులు, విహితులు,
మౌనమే మొదలైనవిధులను మనఁగలుగు ఘనులున్,
జ్ఞానసాధన శమదమాది వి
ధాననిరతులు, దంభదర్పము
లూన నొల్లనిజనులు, తత్త్వార్హులు తనూజాతా. 8

సత్యశౌచాచారనిరతులు,
నిత్యనిర్మలనిస్పృహత్వముఁ
బ్రత్యహముఁ గలవార, లాశా పాశవర్జితులున్
అత్యధికగురుభక్తితత్పర
భృత్యమానసు, లనఘ! సుజన
స్తుత్యులే తత్త్వాధికారులు చూడఁగాఁ దనయా! 9

నిత్యనైమిత్తికములు విడిన
ప్రత్యవాయములకును విడకే,
సత్ప్రాయశ్చిత్తముల నిడి జపములఁ దపముల
నిత్యకామ్యనిషిద్ధములను బ
రిత్యజించుచు భక్తినీశ్వరుఁ
బ్రత్యహముఁ గనఁ గోరు, సుమి! తత్త్వాధికారి కనన్ 10

అష్టమదముల నడఁచి, క్లేశా
దిష్టముల దిగఁదుడిచి, మది ని
ర్దుష్ట మొనరిచి, శత్రులార్గురఁ దునిమి పరమపదా
భీష్టదంబగు గురునికరుణా
దృష్టిపాత్రులు, బ్రహ్మనిష్ఠా
పుష్టులే తత్త్వాధికారులు పుత్ర! పరికింపన్ 11

తనమనోవాక్తనువుల నఘము
గనఁడు, పలుకఁడు, చేయఁ, డన్యులు
తనకు నపకృతి సలుపఁ బ్రతికృతిఁ దలఁపఁ డెయ్యెడలన్,
జనులభూషణదూషణల విని
మొనసి యుబ్బఁడు, డిందునొందఁడు
తను సమత సర్వంబు మోక్షకాంక్షి విను, తనయా. 12

కనఁగ సుఖదుఃఖముల నొకగతి
మనసు కలఁగక, సతము ధైర్యముఁ
గనును, సర్వము నీశ్వరాజ్ఞాక్రమ మనుచుఁ దలఁచున్
గొనును మతి నతిదృఢవిరక్తిని,
గనక భోగభ్రాంతి, మోక్షం
బని తపించు ముముక్షు వెల్లపు డరయు మోపుత్రా! 13

జ్ఞానులను నర్థించు, శాస్త్రము
లోనిసార మెఱుంగు, సాధుల
లోన మెలఁగును, వారివర్తన లోనెఱిఁగి నడచున్.
మానకయె సద్భావనల మన
మూని యభ్యసనం బొనర్చెడు
మానితుండే సుమీ ముముక్షువు, మదిఁ గనుము తనయా 14

అరయ బహుజన్మకృతసుకృతా
కరము నగు నరజన్మ మిదికనుం
దెఱుఁగ నేగతిగలుగునో యని యేమఱక మదిలో
మరగి ధృతియుతుఁ డగుచు, సద్గురు
కరుణఁ దను దా నెఱిఁగి, నిజసుఖ
మరయు వాఁడె ముముక్షు వనఁబడు నరయు మోపుత్రా. 15

కపటకల్మషములు గనక, మది
చపలతయు దుశ్చేష్టలే, కతి
కృపణతయు నాటోపకోపముఁ గీడ్పఱచి, సతమున్
శ్వపచజనముల గోష్ఠి నొల్లక,
యుపనిషద్వాక్యార్థమును గురు
కృప నెఱుంగు, ముముక్షు వనయము కేవలము తనయా. 16

కామినులు కనులెదుట నుండిన
నేమి? చూడఁడు గ్రుడ్డికైవడి!
తామసులు నిందింప వీనులఁ దాఁకనీయఁ డొగిన్;
ప్రేమఁ బరధనముల గ్రహింపఁడు!
ఏ మనఁడు పరు లెంతదూఱిన
నామహామహుఁడే ముముక్షువునై పరఁగుఁ దనయా! 17

ఎడరునం దెదగుఁది కందక,
పుడమి కధిపతియైన నుబ్బక,
యడలు నూనక లేమి, కైశ్వర్యమున మత్తిలక,
పడఁతిగొడుకుల పరజనంబుల
గొడవలో మదిఁ దవులనీయక
పడి విరక్తిని మను, ముముక్షువు బాలకా, తెలియన్. 18

తనయ! సత మధ్యాత్మవాసన,
యానయమును శాస్త్రార్థచింతన,
విను సుబుద్ధి, విరక్తి, సద్గుణ వృత్తి సత్సంగం,
బనఘుగురుశుశ్రూష మొదలగు
ఘనప్రవర్తనముల మెలంగెడు
మనుజుఁడే తత్త్వాధికారి, కుమార, పరికింపన్. 19

వేదశాస్త్రార్థముల నెఱుఁగక
భేదవాదము లాడి పాషం
డాదిమతముల నడచి కదుదంభాచరణపరుఁడై
సాదరత సంసారమును ఘన
మోద మనియెదుకొంత కాత్మవి
వాద మెందుకు? రత్నహార మెం వానరము మెడకున్ ? 20

కాయసుఖమును గోరి, ధన మతి
హేయగతి నార్జించి, వంచక
గాయకస్తావక ముఖస్తుతి గాంచి, పరమపద
ధ్యేయముల్ గను ఘనులపై న
న్యాయముగఁబడి, మొఱఁగు కుక్కకుఁ
బోయఁ దత్త్వసుధారసంబును బోలునే తనయా! 21

మనసు రాగద్వేషముల, మతి
యనఁగ దుర్వ్యసనముల, దేహము
వనితలెడ కూటముల, వాంఛ లపారభోగములన్ ,
మునుఁగఁగా, సంతతము మాయా
జనితదుర్వాసనల మరగెడు
జనునకున్ దొరకొనునె తత్త్వజ్ఞానచింతనముల్ 22

కలలసైతము జాగ్రతుల భ్రాం
తులె కదుం దోఁచెడిని మనసును
దొలఁగ వతిదుర్వాసనాతతి తోంటిజన్మములం
దలవడిన పెనువాసనలచేఁ
గలిగె నీసంసారలంపట,
ఫలము లే దనిపింప దెంతటి పండితునకైనన్. 23

కాలిసంకెల లుండ గొంతున
గాలమును గ్రుచ్చినవిధంబున,
జాలవిధములఁగలుగు సంసృతి సమితి బంధింపఁ ,
లీల విషయాసక్తుఁడగునరు
నేల చెప్పఁగ? మోక్షశాస్త్రపు
గాలిసోఁకినన్నైన సైపఁడు కాంచఁగాఁ దనయా. 24

మొదటనే మర్కటము, మద్యపు
మద మెదను గదియంగ వృశ్చిక
మొదగి కుట్టిన నెగిరిపడుగతి నురుతరభ్రమచే
మదము, ధన, మెలప్రాయమును, జెం
పొదవఁ గాంతాసంగతులమది
చెదరుకూళల కెల్ల తత్త్వము చేఁమహో తనయా! 25

పిచ్చివాఁ డుమ్మెత్తకాయల
నిచ్చమెయిఁ దినినటుల, మాయను
మెచ్చి మది మైమఱచి మూర్ఖత మెలఁగి భ్రాంతిదమె
పెచ్చుపెరిగిన విషయసుఖములఁ
జొచ్చి నిచ్చలు పేఁడపురుగుల
మచ్చఁ జను మనుజులకుఁ దత్త్వపు మార్గ మెటులొదవుఁ? 26

రోటఁ దలనిడువాఁడు రోఁకటి
పోటు తినకయె పోవు నెటు? లటె
వాటమగు సుఖదుఃఖసంసృతి వనధిఁ బడ మఱి యే
నాఁటి కగు పరిహార మాతని
కేటిగతి విన్మృతిజరాదుల
కూట మగుపుట్టుకల చావుల గోలఁ బడఁడె శుకా? 27

మెడను జుట్టినపాము కఱవక
విడుచునే? మాయావిమోహిత
జడుని భవబంధనము పాయునె? చనుచుఁ గనుఁగనకే
పడి యగాధకూపమున నో
ర్విడుచునంధునివలె వివేకము
నుడిగి భవమునఁ బొరలువాఁ డెటు పొందు మోక్షంబున్ 28

అర్ధమా యంధునకు? గానుఁగ
యెద్దునకుఁ జెఱుఁగజ్జె? గోనెకు
నద్దకం గాసెనయొ? నక్కకు నహహా! నాకంబె?
ముద్దుగుమ్మ పుంసకునకే?
మొద్దుగొరవల కమరభాషయు?
అద్దిరా! నిర్వాణమే విషయాభిలోలురకుఁ? 29

ఎద్దు మోయు పదార్థ మెఱుఁగునె?
బద్దునకు సత్యవ్రతంబే?
గద్దశిఖరంబునకు గస్తూరిగమగమయె? ధరలో
నద్దిరా! దత్తకున కెప్పుడ
కద్దురా పితృభక్తి? వాంఛల
వద్దుమీఱినవానికా, పరమాత్మచింతనము! 30

పురము నక్కలు చేరునే? భా
స్కరునివద్దను దివాంధసంఘము
తిరుగునే? చోరులకు వెన్నెల తెరవు ప్రియ మగునే?
సరసకవితలు పసులకావరి
కరుసమే? కన దుర్వ్యసనముల
కరుగు దుర్మార్గునకు నిశ్శ్రేయసవిచింతనమే? 31

పసరమున కాకముద్ర వేసిన
బసవ డఁదురు; గార్ధభమ్మును
బొసఁగునే బసవండనంగా ముద్ర లెన్నిడినన్?
అసమనియతికి గాక మతిదు
ర్వ్యసనపరునకుఁ బరమనిశ్రే
యసవిచారము తగదు తెలుపఁగ నదివృథాశ్రమయా. 32

చెప్పు కొఱికెడికుక్క గవ్యము
నొప్పునే? కామ్యార్థములఁ గోనఁ
దెప్పలాడెడు కర్మదాసుఁడు తెలిసికొనఁగలఁడే
యొప్పిదం బగుబ్రహ్మవిద్యను?
తప్పుత్రోవలఁ దుష్టసుఖముల
నెప్పుడును మదిమరగి తిరిగెడు హీనుఁడది కనునే? 33

జ్ఞాన మభ్యసనం బొనర్పని
యానరుండే వానరుఁడురా
తానె బ్రహ్మ మటంచు నెఱుఁగనత్రాడె పాముగుఁడు!
స్వానుభవ మఱుమానవుండే
దానవుం డగు! గురుపదాబ్జ
ధ్యానచిత్తుఁడు గానిమర్త్యుఁడె తలఁప వ్యర్థుఁడగున్! 34

ఏమినేర్చిన నేమి? యత్నము
లేమిసల్పిన నేమి? కానక
సీమఁ బడు వెన్నెలలచాడ్పున ఛీ! నిరర్థకమౌ
ఆమహాజ్ఞానానుభవ మే
మేమి లేకయె బ్రదుకునరునిది
భూమి శునకవరాహములగతి పొట్టకొఱకె యగున్! 35

వేదముల బ్రాహ్మణుడు, ప్రాణము
మేదినీశుఁడు, వైశ్యుఁడు వస్తువు,
పాదజుఁడు పరిచర్య, భోగము పశుచు దేహంబుల్;
ఆదితేయులు స్వపరిభావము,
గా దనక యమ్ముదు రహహా! శి
శ్నోదరపరాయణత నజ్ఞత నుర్విలోఁ దనయా! 36

కొంద ఱాజపతపములను, మఱి
కొంద ఱెన్నఁగ విహితనిష్ఠలఁ
గొంద ఱాయాగముల, ఫలమును గోరి విషయసుఖా
నందమతులై దానధర్మము
లందఁ గనుదురు నిత్యసుఖమును
బొంద సులభపథంబుఁ దెలియక బోధవిరహితులై. 37

మీను నీటనె యున్ననే? మిఁక
ధ్యానమున బక మున్ననే? మది
కాననాంతరమునఁ దపించిన కపికి ఫల మేమీ?
మౌనముద్రను గోయిలల కే
మైనఫలమే? జ్ఞానరహిత
స్నానసంధ్యలు నిష్ఫలంబులు, జగతిఁ దలపోయఁగ 38

పుట్టఁ గొట్టిన పాము చచ్చునె?
గట్టియుపవాసాదివ్రతములఁ
బట్టి దేహము బడలఁజేసినఁ బడయునే ముక్తిన్?
దిట్టముగ శమదమవిరక్తుల
నట్టె మది గని, గురుపదంబులఁ
బట్టనొల్లని కామ్యకర్మ ప్రవర్తకుం డరయఁగ. 36

మనుజులకుఁ బశువులకు భేదము
గనఁగ రా దాహార భయ మై
థునవిహార విలాస, నిద్రలు తుల్యములె యగుటన్,
దనువు లస్థిరములు తనంతట
మనసునను విషయేచ్ఛ వీడిన
మనుజుఁడే పశుపతి యనందగు మదిని దలపోయన్. 40

ముసురుకొన విషయములు భవదు
ర్వ్యసనమునఁ బడుజీవకోటులు
పసు లనఁబడుదు రీశ్వరాజ్ఞా పాశబంధనులై,
ఎసఁగి కర్మముఁ జేసి యొడయని
వసమునం గలబొంట్లవలె ద్వం
ద్వసుఖదుఃఖములెసఁగఁ గందురు స్వర్గనరకములన్. 41

అది నిమిత్తం బాత్మచింతన
మదిఁ దగుల మెలఁగెదు నకల్మష
హృదయులకు నీయనుభవామృత మెపుడుఁ దెల్పనగున్,
మదకలితులకు, మలిన హృదయుల,
కిది వచింపకు, ముక్తిమార్గా
స్పదము, తత్త్వవిచార మతిగోప్యంబు కను మనియెన్. 42

నిత్య! నిర్గుణ! సురనికరసం
స్తుత్య! నిర్మల తేజ! భవహార!
సత్య! పూర్ణ! ప్రమాణ! సత్త్వరజస్తమోతీత!
అత్యధిక! పరమాణుభరితా!
దైత్యహార! కరుణాప్రపూర్ణా!
ప్రత్యయా! పరమాత్మ! వేపలవర్తి శ్రీధామా! 43

అధికారనిర్ణయ ప్రకరణము,
సమాప్తము.

శ్రీ

# అనుభవామృతము

---

## వైరాగ్యప్రకరణము

### రెండవ అధ్యాయము.

---

శ్రీశ! సద్గుణభూష! సకలా
ధీశ! ఖండితఘోరతరభవ
పాశ! దివ్యశుభాంగ! వేపలపర్తి శ్రీరంగా!
ఈశ! దాసజనౌఘదురితవి
నాశనా! అవధారు శ్రీపర
మేశసన్నిభుఁడైనవ్యాసుం డిటుపలికె శుకుతోఁ. 1

బండలకు, బహుభాషణులకుఁ బ్ర
చండులకు, నిజసతుల విడిచిన
ముండరులకును, దుండగీండ్రకు మూర్ఖులకు మఱియుఁ
గుండగోళకులకును, ఘనపా
షండులకుఁ గలపాపియులకును,
మొండరుల కీయనుభవామృతమును దగదు తెలుపఁ. 2

సతము సత్య వ్రతపవిత్ర
సితుల, కమలవిరక్తులకు, సమ
మతిని సుఖదుఃఖముల మెలఁగెడు మానిరాత్మలకున్,
హితము నెల్లెడఁ దలఁచుసద్గుణ
యుతుల, కుత్తమతత్త్వచింతా
యతమతులకే యనుభవామృత మరయ యోగ్యమగున్. 3

ఆలకింపుము తనయ, సంసృతి
జాలవిఫలాయాసములచే
మేలుగలుగదు, ఘోరమది, సుఖమే? తిరంబగునే?
ఆలుబిడ్డలు, గృహధనంబులు
గాలిఁ బెట్టినదీపకళికలు,
కాలవశమునఁ గలుగుఁ దొలఁగును గావునిత్యంబుల్. 4

ఏరు దాఁటఁగలారు కారా
గార మటు లేపారుఘోరా
కార మగు సంసారమును? గనఁగాఁ జరాచరముల్,
దూఱి స్వర్గముఁ, దారినరకము
జేరి ధారణి, సుకృతదుష్కృత
కారణముగా సుఖము దుఃఖము గంద్రు మనుజులోగీ. 5

వినుము, గృహధనము లని, సతిసుతు
లనుచు, సంసృతిసంభ్రమంబుల
మనసు మోహావేశపరమై మరగువా రకటా!
ఘనఫలం బేమందు? క్షణమున
మునిఁగిపోవును, మాయ మగు నిది
గనఁగ దుఃఖానుభవ మొకటే గతి యగును, దనయా. 6

కని కనక, సంసృతియె సుఖదం
బనియు, నాచంద్రార్క మనియును,
ఘనత కలదని, బ్రహ్మపట్టము గట్టుకొన్నటులన్,
తనియఁ డెంతటి సిరి లభించినఁ
గనఁడు శాంతి రవంత మృత్యువు
వెనుదగిలి కబళించు టెఱుఁగఁడు వికలమతి యగుచున్. 7

ప్రీతి సతియన, నన్యరేతో
జాత! ఆ సతి పతుల మలముల
జాతుఁడా సుతుఁ! డిల్లె వంశమెనంగ బహుముఖనై
రీతిచెడి మలకూపమునఁ గ్రిమి
జాతివలె నుత్పన్నమయి క్రీ
డాతిశయములఁ గందు రహాహా! యద్భుతం బరయన్. 8

తనహితము దాఁ దెలియఁడున్మదుఁ
డన ననర్థంబైన కాంతా
కనకరూపపుగాల మది తనకంఠమ్మునఁ గాఁడన్,
పెను వెతల దరిగాన నేరఁడు
జననమరణజరాదిదుఃఖము
లను బడును పం డనుచు నగ్ని శలభ ములుఱుకుగతిన్. 9

చచ్చువారల, దుఃఖమునఁ గడు
నొచ్చువారల జూచి, తాపం
బెచ్చి ఛీ! యనిరోసి, క్షణమున నెంతో శ్రాంతుండై,
చచ్చినను సతి, విత్తమెల్లను
వెచ్చపడినను, దావుచెడినను,
దెచ్చుకొనఁ గష్టించు మఱి యవి తిఱురాని వనున్. 10

సతి యదేటికి? సుతులు నేటికి?
నతిశయంబగు భాగ్యమేటికి?
హితులు బాంధవు లెంద ఱుండిన నేమి? యమదూతల్
వెతకి పాశముఁ జుట్టికొనిదన
వెత నుడిపి విడిపింపఁగాఁగల
హితులు గలరే? యెవ్వ రుండిన నేమిఫల మవనిన్? 11

ఏలగృహాకృత్యము, గృహము, సుతుఁ
డేల? సతిగూడ వేల? సంసృతి
గోల నమ్మఁగరా, ధనత్వము కూడ దెవ్వరికిన్,
జాలుఁజాలును మాకు నిఁక మీ
పాలపై పై తేనె యని తల
వ్రేలవేసియు విడువ రకటా! వింతయగుఁ గనఁగన్ 12

కడు నఘం బగుజన్మ మని, విడి
వడు నుపాయం బరయ కుండిన
జడుఁడు నరుఁడై పుట్టియును నిష్ఫలము, కాల్పనే యా
యొడలు? నతిశయదుఃఖమయ మగు
కడలిలోఁ బడి మునిఁగి తేలుచు
బడలి దరిగానక తపించును భ్రాంతమానసుఁడై! 13

పుట్టునప్పుడు తా నొకఁడు, తుద
గిట్టునప్పు డొకండు, చోద్యము
నట్టనడుమను నింతబలగము నాటె నేగతినో?
చెట్టయగుసంసార మిదియని
గట్టిగా మదిఁ దెలిసి మఱి యా
తట్టు తలపెట్టనినరుండే తలఁపశిష్ణుఁడగున్! 14

దారినడచుచు దాహ మెత్తినఁ
జేరి చలిపందిరిని నలసటఁ
దేఱి, నిమిషం బెవరి నెవరినో తెలిసి, కలసి మఱల
వేఱువేఱుగ వారు తమతమ
దారి వట్టెడురీతి సతిసుతు
లేరి కేరు ఋణానుబంధం బింత తీఱు నెడల? 15

ఒక్కచెట్టునఁ బక్షు లఱచుచు
నొక్కనిమిషంబుండి యటుపై
దిక్కుదిక్కుల కేగు కైవడిఁ దెలియుమీ క్షితిపై
అక్కసెల్లెండ్రన్నదమ్ములు
నొక్కపరి గనుపట్టి పిమ్మట
నెక్కడికో పోయెదరు ఋణ మది యింత తీఱు నెడల 16

బుద్ధిమెయిఁ దాఁ గూర్చువిత్తం
బద్ది నిలఁబడ, దిసుకదిబ్బకు
నుద్దవిడి నీ రెత్తి పోసెడు నోజ సతిసుతులఁ
ముద్దుగాఁ బోషింపఁ దనతో
నొద్ది కగుదురె యమపురికి రా?
గ్రద్దలకుఁ గాకులకుఁ గాకీ కాయ మేరి కగుఁ 17

విద్దె నేర్వఁగ నేమిఫల మగు?
దద్ద యుద్యోగమున ధనమును
బెద్దగా నార్జింప నేమగు పిచ్చివానివలెఁ
ముద్దియను జేపట్టి ఫలమే
మిద్ది దేహము మన్నుఁ గలసిన
ప్రొద్దునను యువి యెవరివశమై పోవునో తలఁపఁ 18

విను తనయ! బాల్యమున జననియు
జనకుఁడును రక్షకులు, యౌవన
మున స్వతంత్రుఁడు కొన్ని కార్యంబులను, దనముదిమిన్
దనయులును బంధుగులు ప్రోతురు,
కొనకు బ్రాణం బేగఁగా నీ
తను వదేటిది? చితి నిడఁగఁబడి దగ్ధమైపోదే. 19

నీరుబుగ్గను లింగ మని యవి
చారమున సంపుటముఁ జేర్పఁగఁ
గోరుమూర్ఖునిపగిదిఁ గంటికి గోచరం బగుచున్
మాఱిపోయెడు మించుకరణి శ
రీరంబిది యని తెలియనేరని
వారికన్నను బుద్ధిహీనులు వసుధపైఁ గలరే? 20

మగఁడు తనయుని ముద్దిడం గని
నగెడిజారిణిగతిని, దనువును
సొగసుచేయుచు మమతతో దాసుండు తా నగుచున్
దగినపోషణ మెంతచేసిన
నగుచు మృత్యువు కౌఁగిలించును;
జగతిఁ బ్రాణం బెవరికైనను శాశ్వతం బగునే? 21

బలి యొసఁగఁ దేఁబడిన గొఱ్ఱియు
తెలియ దకటా! తనకుఁ జావని,
తలిరు మేయఁగఁ దోరణాగ్రము దాఁకఁగా నెగురున్,
దలఁప నరుఁ డను గొఱ్ఱె మరణము
దెలియకయె సంసరణదుఃఖము
వలచు సుఖమని, కడకు విడుచును వగచుచును దనువున్ 22

ఎప్పు డెయ్యెడ నేవిధంబున
ముప్పు లడరునో తమకు, నయ్యది
చెప్పరాదు సురాసురులకనఁ జెనటిమానవులన్
జెప్ప నేటికి? మరణ మనునది
తప్ప దెవ్వరి కైన నని మదిఁ
దెప్పరిల కతిభ్రాంతి నరుఁ డిట దేవులాడుఁ జుమీ. 23

బ్రొమ్మ మొదలు పిపీలికాంత, మ
హామ్మృత్యోఁ జెడిపోదు రకటా!
నమ్మి నశ్వరమైన బ్రదుకును నాదె యిది యనుచున్,
దమ్ముఁ దామే మఱచినను, మర
ణమ్ము త మ్మేమఱక గొనియె
క్కుమ్మడిని జనుఁ, దెలియ రాకటి నుర్విలోఁ దనయా. 24

పామునోటం బడినకప్పయుఁ
బ్రేమ నీఁగలఁ దినఁగఁ జను నను
సామెతగ, మానవుఁడు కాలవశంబు దా నగుచున్,
దామసత మదమెక్కి దర్పము
తో మెలఁగఁ గని వాని పెడతల
నేమరక తటేఁగాచు నవ్వుచు మృత్యు వెల్లపుడున్. 25

సిరి గలుగ సతిసుతులు బంధులు
కర మలరి ప్రేమింతు రాతని,
సిరి తొలఁగ వా రపుడె విడుతురు చేర రా రతనిన్,
సురభి పాలిడ దూడ చెంతకు
నరుగు, పొదు గది ఎడసినన్ మఱి
దఱియు, దెవ్వరి కెవ్వరో మదిఁ దలఁపఁ జెడువేళన్ 26

కొదవ లేనటు కూర్చిపెట్టినఁ
గొదవనే కనిపెట్టి యిడియది
కొదవ యని పోట్లాడుదురు తన కొడుకు లిల్లాండ్రు
అదిర! వారలవలన సౌఖ్యం
బొదవనేరదు, దుఃఖ మొకటే
విదిత మిది, మదిఁ దెలియనేరక వెతలఁబడు నరుఁడు. 27

పంచుకొనఁ బిత్రార్జితము మది
నెంచి తత్సుతు లందఱును గల
హించి న్యాయస్థానమున నిడ నింత లింతలుగాఁ,
బంచి యియ్యక యధిపతులు దమ
కంచు బొంచి గ్రహించి వీరికిఁ
బంచపాత్ర ననుగ్రహింతురు బ్రదుక భిక్షముచే. 28

జనని జనకునిఁ బాసి, భార్యను
గొని నితాంతప్రమమత, నితరుల
ధనము వంచనఁ దెచ్చి సుతులకు ధారవోయుటకై,
అనయ మన్యాయమునె న్యాయం
బనుచు స్థిరమతి నున్నలుబ్ధుఁడు
కను మహానరకంబు; మోక్షముఁ గాంచనేరుచునే. 29

కానిపోని వృథాభ్రమలకుఁ
లోనగుచు బహువిధప్రయత్నము
లూని క్లేశములొంది కుందుచు నొచ్చి మఱిమఱి భో
గానులాలసమానసము, దుః
ఖానుతాపసముద్రమునఁ బడ,
మేను విడుత్తురు మతివిహీనులు మేలు లే దరయన్ 30

అగ్గలం బగు దుఃఖ మొదవిసఁ
దగ్గదరు దైన్యమున! సుఖమున
నిగ్గుపడుదురు, నరసురాదిక నిచయమాదిగ నా
వెగ్గలం బగుమాయలోఁ బడి,
తగ్గి నిగ్గుచు జెగ్గడిలి, తుది
నుగ్గునూచై పోదు రిదియె వినోద మీ జగతిన్. 31

ఇంతదుఃఖము లేని సౌఖ్యం
బెంతవారల కైన దొరకునె?
వింతగా మర్కటము కీలును బెరికినటు; మధు వా
క్రింత పూసినకత్తి మొన బల్
భ్రాంతిమెయి నాకంగ నాలుక
క్రంతులగునటు; విషయసుఖములు గాంచదుఃఖవతుల్ 32

సుకము దుఃఖము లీశ్వరాజ్ఞను
సుకృతదుష్కృతఫలితములుగాఁ
బ్రకటితములగుఁ బ్రాణివితతికి ఫాలతలలిపి వ్రా
యకయె యుండినయెడల దాని నె
మకఁ గడంగిన లభ్యమగు నే?
వికృతికారణవిధివిధానము వేఱుకా దెవ్వరున్. 33

నొసటివ్రాఁతను మీఱ బ్రహ్మకు
వసముగా దన మానవుం డను
పసరమున కద్దానిఁ ద్రోయఁగవచ్చునే? తలఁపన్
ఎసఁగు పూర్వకృతం బదేకి
వసము త్రోయఁగఁ గుడిచితీరక,
తసుకుమిసుకుల తప్పరా దవి తనయ! నిజ మిదియున్ 34

బాలకా! సచరాచరంబులు
కాలకర్మాధీనములు; త
త్కాలకర్మము లీశ్వరాజ్ఞా క్రమవినియమము లౌ;
పోలునే దాటంగ వాసిని
కాలిసంకెల లగుసతీసుత
మూలసంసృతిబద్ధులకు నిహభోగ భ్రాంతులకున్? 35

కాయసిద్ధిని గన్నపెద్దలు,
మాయ గడచు మహానుభావు, ల
మేయమగు నష్టాంగయోగము మెఱయు సాహసులున్,
ఆయతులు, నా వ్రతులు చావని
న్యాయ మెఱింగి మనంగఁజాలిరె?
ధీయుతా! యందఱును గాలాధీనులే తలఁపన్. 36

వాద, వశ్య, వయోనిరోధా
పాదనం, బంజన, మదృశ్యం
బాది మణిమంత్రౌషధంబులు యంత్ర తంత్రములున్
సాదరత సాధించు ఘుటికా
పాదుకాబద్ధులను బడసిన
సాధులే మొదలెల్లవారలు చావరే తనయా? 37

వేదశాస్త్ర పురాణగాథల
మోదమున విని, నియమవ్రతముల
చేఁ దవిలి, పితృదేవతాతిథి సేవ సల్పి, ధరన్
లే దనక యిడువారు, హాయమే
ధాదినానాయజ్ఞఫలసం
పాదకులుఁ గాలంబు దఱిసినఁ బాయరె యసువుల్? 38

కనఁగ దుస్తరకృచ్ఛ్రచాంద్రా
యణము లను పంచాగ్నిమధ్యం
బున నిలిచి వాతాతపంబులఁ బొక్కి నిశ్చలతన్,
అనుదినము నాహారపానము
లను వదలి యూపిరులఁ బట్టిన
ఘనులు మునిపుంగవులు సైతము కాలవశులెకదా! 39

సురనరోరగ యక్షకిన్నర
గరుడగంధర్వులును, సిద్ధా
ప్సరలు, రుద్రాశ్వినులు, నసుగాలు వసులు, తాపసులున్
హరిహర బ్రహ్మాది, లోకాం
తరము నొందిన సుకృతులును, శశి,
తరణి, భువి, దివి, మొదలు కాలముఁ దప్పలే వరయన్ 40

మండువేసఁగిలోన, వీచు ప్ర
చండమారుతమందు, జోరను
చుండువర్షమునందు, చలిమంచునను, శైత్యమునం
దుండి ఘోరతపంబు సలుపుచు
మెండుశ్రమ పడుచుండువారును
ఖండితముగా నెల్లవారును కాలవశులె సుమా. 41

తల్లికడుపున నడఁగుదుఃఖము,
పిల్లతనమునఁ గలుగుదుఃఖము,
చెల్లుయావనమందు విషయవిశ్లేషదుఃఖంబుల్;
అల్ల దేహము ముదిసిచిక్కుట
వల్ల రోగమువల్ల జీవులు
నెల్ల దుఃఖమె గర్భదుఃఖాలము నేరి కగు మీఁఅన్? 42

చక్రవర్తులు నార్గు రీభూ
చక్ర మేకచ్ఛత్రముగ భుజ
విక్రమాటోపమున నేలిరి విశ్వ మరు దనఁగన్;
చక్రి చక్రము వశముగొనిన ప
రాక్రమాచింతులెల్లఁ గాలుని
చక్రమునకు నధీనులై మఱి చచ్చి రేమనఁగన్! 43

ఎట్టికర్మముఁ బట్టి రవి తా
నట్టి దినదినమందు మేరువుఁ
జుట్టు నిలకడఁగనక, యెవ్వడు చూడ నాపగిదిన్
బుట్టి గ్రహతారకలు మొదలుగఁ
జుట్టు ననిశంబింత నిలువక
యట్టిగతి కవి కర్మబద్ధము లగుటె కారణమౌ. 44

అహిపతికి నేప్రొద్దు దప్పమ
మహిని మోసెడుకర్మ! మట్టులె
నహజమయ్యెను కూర్మదిగ్గజసమితి కెయ్యెడలన్,
ద్రుహిణుఁ డట్టుల సృష్టినిన్, ని
ర్వహణమును విష్ణుండు, లయమును
నహిధరుండును గనిరి, కర్మమునందు జిక్కుటచే. 45

హరిహయుఁడు కాలమున వర్షముఁ
గురియఁజేయుట కర్మఫల మగు;
శరధి మేర నతిక్రమింపనిసరణి కర్మ మగున్!
అరయ దిక్పాలకులు, మను మును,
లురుకులాద్రు లవెల్ల, నాయా
కరణి పనులొనరింపఁ గర్మమె కారణము తనయా! 46

ఇట్టులందఱు నీశ్వరాజ్ఞను
బట్టి మెలఁగుచునుండ, మనుజుల
కెట్టు సాధ్యము మీఱ? భ్రమచే నెపుడు భవజలధిన్
గట్టుగానక మునిఁగి తేలుచు
వట్టిదుఃఖము గందు, రాలో
గుట్టు నెఱుఁగక యీశ్వరునిదయ గూడికొనుదాఁకన్. 47

కాలకర్మాధీన మని, విధి
లీల యిది యని, గ్రహగతులఫల
జాల మని, ప్రారబ్ధ మని భువి జనులు పలుగతులన్
ఫాలలిఖితంబనుచుఁ బ్రాప్తికి
మూలమనుచు, నదృష్ట మనుచును
నాలకింతురు ప్రాజ్ఞులీశ్వరునాజ్ఞ బహువిధులన్. 48

ఇదియెఱుంగక మది సురాసురు
లదయు లయి మోహాంధకారముఁ
గదిసి, మదమాత్సర్యదురహంకారవారములన్
బొదలి, కులబలరూపయౌవన,
మదవతీసువిలాససుఖముల
నుదిఁ దవిలి మైమఱచి చెడిరి సుమా! యనిరి మహాని. 49

పొదవి కులబలవిత్తయౌవన
మదవతీరాజ్యాన్నరూపో
న్మదము లాయాయదనులందున మహిని మానవులిన్
గదియు! నం దొండొండె చెఱుచును!
బదిలముగ నన్నియును జేరిన
బ్రదుకనిచ్చునె నరుని సుఖముగ బాలకా! జగతిః ? 50

తనభుజములనె చూచుగాను, మఱి
కనులసన్నలసేయు, బరహే
ళనలసలుపును, మీసములకొనలను మెలికవెట్టుచున్,
జనుచు సన్ననిరాగ మను, గో
ళ్లను జికురముల దువ్వుఁ, గనుఁ గ్రీఁ
గనుల యౌవనసన్నిపాతవికారి నరుఁ డరయన్, 51

కనఁగ, నణఁగం డేరికిని, స
జ్జనులఁ దృణమటుచూచుఁ, బెద్దలఁ
గనిన లక్ష్యముసేయ కెంతయు గర్వమతి యగుచున్
జెనకు సాధుల బీదజనముల
ఘనుల నెక్కసమాడు నిజయౌ
వనమదాంధత, నరుఁడు వర్తిలు వానరుం డగుచున్, 52

అక్కజంబుగ నంతకంతకు
రక్కసుం డగు, కర్కశుం డగు,
నిక్కి నీల్గును న్యాయ మింతేనియుఁ దలంపక; తా
ధిక్కరించును కోపగించును
కుక్కరీతిని గుఱ్ఱుమను మద
మెక్కి చొక్కుచు యౌవనంబున నేమికాన నగున్? 53

వినుము విద్యోన్మాదమున నను
దినముఁ దర్కము సల్పు, తనసరి
ఘనులు లే రని, పండితుఁడ నని కనులు నెత్తికి నె
క్కినపగిది వర్తిలును, తనప్ర
జ్ఞను దనంతనె మెచ్చు, సర్వ
జ్ఞునిగ, విద్యామదము చెఱుచును సుగుణసంతతులన్. 54

తాను సత్కులజాతుఁ డను, వి
జ్ఞానయుతవంశజుఁడ నను, స
న్మాన మిడఁదగు నను నను దన కభిమానమానసుఁడై
హీనవర్ణజు లితరజను లనుఁ,
దానువారలఁ దాఁకనను, న
జ్ఞానపరవశుఁ డగుచుఁ గులమద చపలచేష్టితుఁడై. 55

యోగసిద్ధిఁ బ్రసిద్ధరాజ్య
శ్రీ రిమ భోగించి యమితము
గాఁగ భుజవిక్రమముచే నవ ఖండముల నేలం
గాఁ గనిన యా కార్తవీర్యుఁడు
సీగె బాహుసహస్రముల నన,
భోగమదమునఁ జెడుట రెంతటి పుణ్యధను లైనన్. 56

సురపతినె గని కనలి శాపము
నురలఁ బెట్టినయుగ్రతాపస
వరుఁడు దుర్వాసుండు శ్రీహరి భక్తుఁ డెగనాడన్
ధర సమస్తము చుట్టినను విడ
కరిగి విష్ణుని చక్ర మామునిఁ
జఱపదే? గర్వంబు నరున కపాయకరము సుమా. 57

దక్షుఁ డగుదక్షుండు సెడె; నిట
లాక్షుచే దర్పకుఁడు పడె; రణ
దక్షుఁడగు భార్గవుని మానము తరిగె రఘుపతిచే;
కక్ష గజకూర్మములు మడిసెను;
పక్షములఁ గోల్పడెఁ గులాద్రులు;
రక్ష గా వరయంగ శ్రీ, కుల రాజ్య, బల మదముల్. 58

మచ్చరము తన్నే దహించును,
హెచ్చుతాపము గూర్చు, సాధుల
నొచ్చుకొనఁగాఁ జేయు, మదిఁ దన్నుఁ మఱవఁ జేయున్;
వచ్చునడి లెక్కింపనీయదు,
తెచ్చు నాశముఁ డెంద మంటిన
చిచ్చునై సైరణను గాల్చి చెఱచు మానవునిన్. 59

సొంపునై సర్వేంద్రియంబుల
కింపునై కడుమించి, కాలప
రంపరాగత మైన యాచారంబునై దృఢమై
పెంపుమీఱిన దంపతిగ్రా
మ్యాంపులంపట మది గణింపఁగ
అంపమే యగు మోక్షసుఖసామ్రాజ్యతరువునకున్. 60

హరుఁడు చిచ్చఱకంటి మంటను
మరునితనువును గాల్చికూల్చిన,
మఱల మనసిజుఁ డగుచుఁ బ్రాణులమతులఁ గలఁపంగాఁ
బఱచు నాతుంటరి శరంబుల
హరిహరబ్రహ్మాదులును మది
గఱఁదోలఁగి కాంతలకు జిక్కరె గుహ్యలంపటులై? 61

మునిఁగి నీళుల మూఁడువేళల,
సినుప కచ్చడముల బిగించుచుఁ,
దినుచుఁ గూరలఁ గాయలను, ననుదినము నియతిమెయిన్
వనములను వాతాతపంబులఁ
దనువు డయ్యఁగ ఘోరతపములఁ
దనరుమునులును మదవతుల పదదాసులైరి సుమా! 62

ఏరు లేనివనంబులోఁ, జా
ఱారి "గొఱ్ఱుమాను" నఁ దగుల్వడి
దారిఁ బోయెడివారిఁ జీఱువిధంబు దోఁపఁగ, సం
సార మనుకాంతారసీమను
మాఱుఁ డనెడుకిరాతుఁ దొడ్డిన
నారి యనువలఁ బడిననరులకు నాస్తిసూ! ముక్తుల్. 63

గాలమునఁ దపియించుమత్స్యము
లీల, బోనునఁ బడినకొక్కును
జాలి, మన్మథవేదనల వ్యథఁబొంది, మతిలేకా
ఱాలికల వాల్చూపులకు మది
సోలి ఱెక్కలు తెగినపులుఁగనఁ
జాలి నరుఁ డడ లందికుందుచుఁ జచ్చు టెఱుఁగఁడిలన్. 64

కరి, తురగ, పశు, పక్షి, మృగ, సూ
కర, శునక, మార్జాల, మర్కట
సరట, శలభ, సృగాల, కుక్కుట, సర్ప, క్రిమితతులున్,
ఖర, గగన, జల, వనచరాదులు
సుర, నరో రగు లరయ విషసీ
కరణమునఁ బడి గుహ్యాంగోలతఁ గని రిఁకేమనఁగన్ ? 65

స్త్రీపురుషభేదమున బహువిధ
రూపములఁ గల్పించి, సురతపుఁ
దీప్తి మది కెక్కించి, సఖ్యము తీఱరానిగతిన్
జూపి, తత్ఫలితంబు సంతతి
రూపమునఁ గల్పింపఁజేసిన
యాపరాత్పరులీల నెన్నఁగ నద్భుతము గాదే? 66

స్త్రీలకును బురుషేచ్ఛ, పురుషుల
కో, లలనలం దిచ్ఛ, సృష్టికి
మూల మగుచు, ననాదినుండియు మోహవారాశిన్
గూలఁ ద్రోసి, యజాదులను, గ
గ్గోలుపఱచెడుమాయఁ జెప్పఁగ
నేల? యెంతటివారినైనను నేఁచుఁబో, తనయా! 67

సుందరుం డగునెవనిఁ గన్నను
డెందమున సుందరి భ్రమించును!
సుందరిన్ గని యట్లె పురుషుఁడు సుడివడును! మఱికల్
గ్రందుకొన నన్యోన్యవీక్షణ
మందు నురువడి మోహవిభ్రమ
మొందఁ బొందికఁ జేయుమాయ దురూహ్యమెవ్వరికిన్, 68

స్త్రీపురుషులకు మృదుసరసస
ల్లాపముల, సమరసముచేకూఱు,
నా పిదప సంయోగ మేర్పడు; నటు వియోగంబున్
దోఁపఁగా, నవ్వారు కడుసం
తాపభరమునఁ బొక్కి పడుదురు;
బాపురే! మాయావిలాసముఁ బలుక సాధ్యంబే? 69

మాయ యన విను! హీనవిషయని
కాయలోలత; అందుఁ బడి సతి
కాయసంగకటాక్ష వీక్షణ గలిగి దరి మెలఁగన్;
కాయజునిసాయకముచే బలు
గాయములఁబడి నోరు తెఱచుట
మాయ యనఁబడు, దానికిం గలమహిమ నే మందున్? 70

కురులచందము, చెక్కులందము,
సురచిరాధర, ముకులరదములు,
మెఱుఁగుఁగన్నులు, ముద్దునాసిక మేలిఫాలంబుల్
పరమసౌఖ్యప్రదము లని మది
మురుగుదురు కామినుల శ్లేష్మ
కరముఖద్వారమును గనుగొని కాముకులు నరుల. 71

పిచ్చియెత్తినకాముకాళికి
హెచ్చుమోహము, గాంచినంతనె
కచ్చుపచ్చడములను దాఁచిన కల్మషపుఁదనువుల్;
నిచ్చలును నీరెత్తి కడుగుచు
నచ్చుపఱచినఁగాని దగ్గఱ
వచ్చునే? చెడుకంపుఁగొంపది వలదు కుక్కలకున్. 72

బండ లంగనయంగములఁ గను
పండువుగ భ్రమియింత్రు, మూత్రపు
గండి యిది యోని యని యెఱుఁగ రఖండమోహమునన్;
చెండులన బిగినెగయు మాంసపు
పిండములు చనుగుబ్బ; లెప్పుడు
సిండుశ్లేష్మపు గుండ మాస్యము నిక్కమిది తనయా! 73

నరము, లెముకలు, త్వక్కు, మాంసము,
మఱుగుదుర్గంధములమూలము
తరుణిరూపము శ్లేష్మమలమూత్రములకూపంబుల్,
దఱిసి మరులగునరుల తెఱఁగది
మఱఁగు దొడ్డిని దిరుగ నేరిచి
మెఱుఁగుకుక్కలవిధమె యగుఁబో! మోహ మే మనఁగన్? 74

మెచ్చువారికి చావు సుఖమని
యుచ్చరించిరి బుధులు, మూత్రము
వచ్చు బిలమది తెలిసి తెలియక వాంఛ చేయుదురే?
విచ్చి చెప్పఁగనేల, యది యొక
పిచ్చియే సరి, తలఁప వమనముఁ
దెచ్చు చిహ్నము కాదె? సుఖ మా దేవుఁడే యెఱుఁగున్. 75

స్త్రీపురుష సంయోగ మనునది
కాపథము కడునల్పసుఖదము,
రూపఱును క్షణమందె లజ్జాస్పదమ్మది యగున్,
గోపనం బేకాంతవర్తన,
పాపమూలము, గ్రామ్యధర్మము,
సేవగిది సౌఖ్యావహం బని యెంతురో భ్రాంతుల్? 76

కనఁగ బాల్యమునందు, వార్ధక
మునఁ గనంబడ; దరయ యౌవన
మున నె తోఁచెడు మూఁడుదినముల ముచ్చటగ నడుమన్;
తనువు సౌందర్యంబు నిమిషం
బున నశించును, సర్వకోవిద
మనసులను బంధించు మాయా మహిమ యెంతటిదో? 77

అల, మనోధర్మముగ బ్రహ్మా
దులును దామే బ్రహ్మలుగఁ, జ
ర్యలు తమవి సచ్చరితములుగఁ దలంతు భ్రాంతిమెయిన్;
బలుకుదురు బ్రహ్మంబుఁ బరులకుఁ;
దలఁచువారు స్వధర్మముగఁ దమ
సలుపు చర్యల; మాయ గెలువ నసాధ్య మెవ్వరికిన్ 78

మీలు జిహ్వాపేక్ష; కరి కరి
ణీలసత్ స్పర్శేచ్ఛ; శలభము
గ్రాలు నేత్రాపేక్ష; శ్రుతి భుజగంబు; ఘ్రాణేచ్ఛా
లీల భ్రమరం, బిట్టు లొక్కొక
టొలి విషయేచ్ఛఁ జెడె ననఁ, జెడఁ
డేల తనయా! పంచవిధ విషయేచ్ఛ గలనరుఁడు? 79

రంభ మొదలగు నప్సర స్త్రీ
కుంభకుచపరిరంభ ఘనసం
రంభసంభోగములఁ దనియక బ్రాహ్మణి నహల్యన్
జంభవైరి రమించి యోనుల
సంభరితమై యొడలు చెడ, నం
రంభమీగఁడె? కాము గెలువగరా ద దెవ్వరికిన్. 80

అరయ స్వాహాసతికై నగ్నియు,
సురగురునిసతిపై మమత శశి,
మరగి దుర్దశ గనరె, యంతటిమహిమ గలవారే!
దురితమతి రావణుఁడు సీతకు
మరులువడి, కీచకుఁడు ద్రౌపది
ని రమియింపఁగ సాహసము గని నీల్గరే తుదకున్? 81

ఎంతవాఁడును మోహనాంగుల
వింతచెలువము హావభావము
లంతకని యేకాంతమున ధృతినలరి, తాదాత్మ్య
భ్రాంతి నుంతయుఁ బొందఁ, కతి ని
శ్చింత నుండెడుధన్యునకు, న
ర్చింతు సాష్టాంగము నతండే విశ్వగురుఁ డనుచున్. 82

విదితముగ నామాయయే యిటు
సుదతిరూపముఁ దాల్చి, మనుజుల
మదిఁ గలంచెను, త్రోయ సాధ్యమె మహితులకు నైనన్ ?
అదిర! చిఱునగ, వాబెళుకు కను,
లెద నిగుడుచన్గవపటుత్వము,
మదిఁ దవిలి మరు లగుటవింతలె మనుజమాత్రులకున్ ? 83

సప్తతంతు వొనర్చిన నసం
క్షిప్తగతి సుక్షేత్ర తీర్థ
ప్రాప్తి గని సేవించినను, భూస్వర్ణకన్యకలన్
గుప్తదానము లిచ్చిన, ఫలా
వాప్తి నరుఁ డమరాంగనారతి
తృప్తిఁ గని కనకుండ పుణ్యముతీఱి భువిఁ జేరున్ 84

శైవవైష్ణవ మాదియగు బహు
భావభేదములైన తత్త
ద్దేవతారాధనలక్రమగతి దెలిసి ముద మొదవన్
భావపరిశుద్ధిమెయి సలిపిన
జీవి లోకాంతరవుఘనసుఖ
భావరుచి గని మఱి తనువుగాని వసుధకే మరలున్. 85

యాగముల నొనరించువారు, వి
రాగులై వని నుండువారును,
ఆగమాంచితదానధర్మము లాచరించుఘనుల్,
యోగులును, ద్యాగులును స్వర్గపు
భోగములఁ జవిచూచి పున్నెము
నీఁగి, పిమ్మట భువి జనింతురు నిశ్చయముఁ బిదియున్. 86

అదినిమిత్తము తనయ! విషయము
లఁ దగులువడుచుఁ గామ్యకర్మల
గడిసి, నియమవ్రతచరితులయి కష్టపడి తనువుల్
వదలి, స్వర్గసుఖంబులనుగని,
తుదకు పుణ్యము తీఱి తీఱక
యుదయ మొందుచుఁ గష్టసుఖముల నొందు జీవతతుల్. 87

చాలస్వల్పసుఖంబు గోరి, వి
శాలయత్నముఁ జేసి, కించి
త్కాలసుఖనశ్వరపదవులకుఁ దవిలి మది, భ్రాంతిఁ
బిల బహుకష్టమగుస్వర్ణర
కాల నడయాడెదరు, మాయా
జాలమునఁ బడి తెన్ను దెలియక చావుపుట్టుకలఁ. 88

తెలియలేక తిరస్కరింతురు
పలువు రజ్ఞులు బ్రహ్మవిద్యను,
గలుగ దన్యఃథం బనెడుశ్రుతికలుగ, నావిధముఁ గ
దొలఁగు మ్మార్గము లెన్న బహుయో
నులను ద్రిప్పుచుఁగాక వేఱొక
ఫలము నిచ్చునె? మోక్షసంపద వానికిన్ గలదే? 89

బహుప్రయాసార్జితముగా నగు
బహుసుకృతఫలరూప మనఁబడు
నిహపరంబుల నరసుఖాంగము లెత్తి సతముఁ సుఖా
స్పృహఁ జరించెడుజీవి సంసృతి
యహిత మని గురుతింప నేరఁడు
మహిమ యెంతబలాన్వితంబో మాయ కెన్నంగన్! 90

కన్నబిడ్డఁడుఁగాక, ధనమిడు
చున్నవిటునకుఁగాక, యటునిటు
'లన్నడచు 'బాలెంతలంజ' విలాసచేష్టగతిన్,
అన్నరుఁడు చెడు నిహపరంబుల,
నెన్న జీవన్ముక్తి నొందక
సున్న యగు సంసారసౌఖ్యము చూడఁ డెద్దరినిన్. 91

ధరణి, స్వర్నరకముల మఱిమఱిఁ
దిరుగుచును, దను వెత్తి తొలఁగుచు,
పరిపరిగఁ బలుగతుల ద్వంద్వావర్తమునఁ బడుచున్,
మఱల జననము, మఱల మరణము,
మఱియు మఱియును గోట్లకొలఁదిగ
పురువు లనఁ దగి పుట్టుగిట్టులఁ బొరయుదురు మూర్ఖుల్. 92

కనఁగ నీగతి నిహపరంబుల,
ఘనతరంబుగ దుఃఖమొకటే
అనుభవం బగుఁగాని నిజసుఖ మానరా దగుటన్,
తనసుకృతఫలభాగ్యవశమున
జనుఁడు నిజవైరాగ్య మొందిన,
జననమరణము లేనిగతి నిశ్చయముగాఁ బడయున్. 93

కాలకర్మాతీత! సుగుణవి
శాల! మునిజనలోల! కరుణా
శీల! శ్రీకరనామ! పరతరశ్రీపరంధామా!
నీలమేఘశ్యామ! లక్ష్మీ
లోల మంగళమూర్తి త్రిభువన
పాల, నిర్మల ప్రేమ! వేపలపర్తిశ్రీధామా! 94

వైరాగ్య ప్రకరణము
సమాప్తము

శ్రీ

# అనుభవామృతము

## మూఁడవ అధ్యాయము

## త్వం పదార్థశోధనము

శ్రీసమున్నతవిభవ! దివ్యప్ర
భాసముజ్వల దేవ! శశ్వ
ద్భాస! గరుడతురంగ! వేపలపర్తి శ్రీరంగా!
వాసవార్చితపాద! మునిహృ
ద్భాసకా! అవధారు మఱి నా
వ్యాసమౌనీంద్రుండు శుకునకు వాకొనియె నిటులన్. 1

దుర్మతులకు, దురాత్ములకు, దు
ష్కర్ములకు, ధూర్తులకు, నిజకుల
ధర్మమును విడి యన్యధర్మముఁ దగులుకుమతులకున్,
పేర్మి నాత్మస్తుతిపరులు నగు
దుర్మదాంధుల, కనుభవామృత
మర్మ మేమియుఁ దెల్పఁ బోవకుమా తనూజాత. 2

నిత్యమాత్మ, సమస్త మితర మ
నిత్య మని, యిహాపరము లొల్లక,
ప్రత్యహంబు శమాదిషట్కముఁ బడసి, మోక్షంబే,
స్తుత్య మని సాధనచతుష్టయ
సత్యసంపద గల్గునిర్మల
గత్యనన్యున కనుభవామృతగతిని దెల్పందగున్. 3

పుట్టినా మఱి చావునెఱుఁగని
గుట్టు నేర్వఁగవలెఁ జుమీ! ఆ
పట్టు దొరకొనదేని స్మృతి చెప్పెడినపిదప మఱ్ఱి.
పుట్టు వెఱుఁగని నేరుపైనను
బట్టుకొనవలె! రెంటుగానని
పొట్టకూళులచదువు చదువఁగఁ బురుషునకుఁ దగునే? 4

వేదశాస్త్రము లెన్ని చదివిన
లేదు ఫల, మవ్వానిసారము
లోఁ దవులఫల మబ్బు! నాఁకట రోసి, గ్రాసముకై
లోఁ దెలియకయె 'పరుసవేది' ని
గా దనుచుఁ దాకట్టునిడుగతి
వేదవిద్య నిజోదరార్థము విక్రయింతు ఖలుల్. 5

ఎఱుఁగనేరరు తత్త్వ మించుక,
మరులుగొని మమకారమున శ్రుతి
నరసి సత్యము 'బ్రహ్మవిద్బ్రహ్మైవ' యనుసూక్తిఁ;
మరగి కర్మను సతము జన్మాం
తరజరామరణాదికంబుల
నిరతదుఃఖాంబునిధిఁ బడుదురు నిజముగాఁ దనయా! 6

వింత యగు విను 'మాత్మవి చ్ఛో
కం తరతి' యనువేదవాక్యము
వింత తెలియని విషయలంపటు లెంతదౌర్భాగ్యుల్?
స్వాంత మలరఁగ మేఁక, యాకుల
వింతపడి తిను, చెఱకుపాలు, ర
వంత చవిఁగనఁ బోల నేరని నైఖరినిఁ దనయా! 7

దానమును సత్పాత్రమున; సం
తానమును నిజసతిని; యజ్ఞవి
ధానమును సాంతముగ సల్పిన దాన స్వర్గ మగున్!
స్వానుభవసంసిద్ధ మగు, సు
జ్ఞానమున నేముక్తి గలదో
మానవిధి! వేఱొంట దొరకదు మానిసికి నెందున్. 8

టక్కునాణెము లరయఁ గర్మలు!
చిక్కుదారులు ధర్మములు, కడు
చొక్క మగునపరంజి జ్ఞానము 'సోహమస్మి' యనన్
నిక్కమగు బ్రహ్మంబు తా నను
టొక్కటే నిజముద్ర! శ్రుతిహిత
మిక్కరణి లోకాభిమత మగు నింతగుహ్య మగున్. 9

తన్నుఁ దా గుఱుతించి లోఁగను
టన్న సామాన్యంబె? సుకృతం
బున్నవారికిఁగాక యితరుల కొప్పునే యదియున్?
మున్ను వినవే కషసాధ్యం
బన్నిటికినిన్ బ్రహ్మవిద్యయ
టన్నయాలోకోక్తి తథ్యం బరయు మోపుత్రా! 10

నోటిమాటల బ్రహ్మనిష్ఠా
పాటవం బలవడునే? దొరకునె
తేటసౌఖ్యము? చీకటింటను దివ్వెఁ బేర్కొన్నన్
నాటుకొన్న మహాంధకారము
మాటుపడి వెలుఁ గౌనె? మఱిమఱి
మాట లేల, నిజానుభవమే మానసీయ మగున్. 11

క్లేశపంచకమును నడంపక,
పాశముల నెన్నిదిని ద్రుంపక,
యోశివుఁడ నేఁబ్రహ్మమనఁగా నేమిఫల మబ్బుఁ?
ఆశివుఁడుఁ జెఱఁబడినచోరయటు
లాశచెడి పరతంత్రుఁడై సుఖ
లేశ మెఱుఁగక యుండు మోక్షము లేక ప్రత్యహముఁ 12

"విను ధనంజయా! సర్వధర్మము
లను విడిచి నన్నే భజింపుము,
నిను బవిత్రునొనర్తు, మోక్షము నీకు లభ్య మగుఁ!
గనినమాకులకెల్లఁ బ్రాఁకక
మనము స్థిరమతి నొక్కనెలవున"
ననఁడె గీతాంతమునఁ గృష్ణుం డర్జునునితోడఁ? 13

మతము లనునవి ముక్తికై బహు
గతులఁ జెప్పెడు! నిష్ఫలము లవి!
క్షితిజ జిల్లెడు జెముడుపాలు నిషేవ్యమై సుఖమై
హితము గూర్చునె, ధేనుదుగ్ధము
గతిని? వరసాయుజ్యముక్తికి
నితరగతు, లవి సాటి యగునే యెంచిచూడంగఁ? 14

స్వానుభవ, గురువాక్య, శాస్త్ర
జ్ఞానముల నొక్కటిగ నెఱిఁగి, ని
ధాననిశ్చలమతిని నిర్గుణతత్త్వనిజపదముఁ,
ధ్యాన మొనరించుచు సమాధిని
మౌనముద్ర ధరించి మెలఁగెడు
మానితుఁడె మదనారి యనఁదగు మర్త్యుఁ డతఁ డగునే? 15

కనఁగ బాల్యమునందు, వార్ధక
మున స్వతంత్రత లేదు, మఱి యౌ
వనమునం గలయాస్వతంత్రత వ్యర్థసంసృతిలోఁ
జనఁగనీయక విమలమతివై
ఘనదయామయుఁ డైనగురుకృపఁ
గనుచుఁ, దనుఁ దా నెఱుఁగ నేర్చిన ఘనుఁడు ముక్తుఁ డగున్! 16

అది నిమిత్తము తనయ! సద్గురు
పదపయోజముచేరి శాస్త్రో
ద్గతిత మార్గముపట్టి యనుభవ గరిమఁ బ్రశ్నములన్
ముదమొదవ వినయోక్తి వేఁడఁగ
నదె సుమీ! యనుకూలతర్కము,
నదమలాత్మజ్ఞానసిద్ధికి సరణి యదియె యగున్. 17

వినుము శుక! దృగ్దృశ్యభేదము
లను, మఱియు క్షేత్రజ్ఞక్షేత్రము
లనువిభాగవిధంబు, కోశములను విశదపఱుతున్!
గనుము దుర్మతఖండనంబుల;
వినిచెదను స్థూలాదిదేహము
ల, నటు త్వంపదలక్ష్యచిత్సుఖ లక్షణము లెల్లన్. 18

అనఁగ, శుకుఁ డీయాత్మ బ్రహ్మం
బనెద రేమది? వాచ్యలక్ష్యా
ర్థనిరూపం బన నేమి? లక్షణధర్మ మెట్టిది? యో
యనువుచే నైక్యంబు పొసఁగును?
కనఁగ ద్వయ మద్వయము నెటులగు?
విన విచిత్రము తద్రహస్యము వేడ్కఁ దెలుపఁ దగున్. 19

సచ్చిదానందైకరసమే
యిచ్చమెయి ద్వయమైనయెంతని
హెచ్చుతగ్గులు లెక్కలేనటు లెట్లు లేర్పడెనో!
అచ్చెరువుగాఁ దెలుపఁదగు నిది
సచ్చరిత! యన, మునికులేంద్రుఁడు
మెచ్చి మది సుతుపల్కులకు మెలమెల్ల నిటు లనియెన్. 20

జీవుఁ డెవ్వం డన 'అహ' మ్మను
భావ మున్నతఁ; డీశ్వరుఁడు మా
యావిలాసవిచిత్రరూపుం డయ్యె వాచ్యములం;
దీవిరోధాంశములఁ ద్రోయఁగఁ
బోవ శేషమె లక్షణంబు; ని
జావబోధము రెండునొకటే యనుట లక్ష్యంబౌ. 21

వినుము! వాచ్యార్థము విరోధము
గనఁగఁబడుచెడు "తత్త్వమసి" తోఁ
గనుచు మిథ్యను ద్రోయ పదముల గణన సేయు నెడన్.
మినుకు నిజలక్ష్యార్థమును మదిఁ
గనుఁగొనఁగ సత్త్వైకదృక్కన
వనువుపడును బరాత్మజీవాత్మైక్యసిద్ధి సుతా! 22

అందు గంగాతటిని వటుఁడని,
యిందుఁ దుంగాతటిని యతియని,
బొందిమాత్రచేత నొకఁ డని పోల్చుకొనురీతిన్;
అందు నిం దను రెండువిగ్రహముల
నొందుపదముల విడ, నిలుచునదె
యొం దఖండాద్వైతనిజసుఖ మిదియ లక్ష్య మగున్. 23

పదయుగము శోధించి చూచిన
దుదకు సత్యము నిలుచు; మది ముద
మొదవ హంసము క్షీరమును గొని యుదకము విడుగలిగ్,
మొదట లక్ష్యము సాధనార్థము,
పిదప నైక్యము తెలిసి గలిగిన,
దుదకుఁ బరమానందపద మది దొరకును చిరముగర్. 24

త్వంపదము లక్ష్యార్థమును సా
ధింపఁగలదృగ్దృశ్యభేదప
రంపరల నీక్షించువిధ మేర్పడఁగ వివరింతుర్,
సొంపునగు తనుకరణతతి యా
లింపు, దృశ్యము; లందు వెలిఁగెడి
పెం పలరుతత్సాక్షి దృక్కగుఁ బేర్మిఁ గను మిటులర్! 25

గోచరించెడి దెల్ల దృశ్యము,
చూచునది భావించికను టా
లోచనము సేయంగ దృక్కగు రూఢిమై గనుమీ!
యీచెలువునన్ దనువులోఁ దగు
యోచనల, దృగ్దృశ్యములను వి
వేచనము సేయుచును బ్రత్యగ్విధము తెలియ దగుర్. 26

చాలనగురూపములు దృశ్యము;
లోలిఁ గనుఁగొనునక్షి దృక్కు; వి
శాలనేత్రము దృశ్య మగు! మతి సరణి దృక్కవగుర్!
బోలు మతి దృశ్యంబు; నిది యవ
లీల నెల్ల నెఱుంగుసాక్షియె
మూలదృక్కగు; దృక్కు దానికిఁ బొసఁగ దటుమీదర్. 27

నీల, పీత, శ్వేత, రక్త,
స్థూల సూక్ష్మ కృశోచ్చ, నీచ, వి
శాల, బహువిధరూపములు దృశ్యములు వివరింపఁ
జాలరూపులయందు మెంచుచు
లీల వీక్షణ సేయు నేత్రము
పోల దృక్కని చెప్పఁబడియెడుఁ బుత్ర! పరికింపఁ. 28

మంద మంథము పటువనెడు తెగ
లొందు పొల్చెడునక్షి దృశ్యము;
డెంద మక్షికి దృక్కగును, నిక్కే తెలియు నోపుత్ర!
కుందు, కోపము, హర్ష, రోగము,
లోఁది కామాదులకు గుఱియగు
డెంద మగుదృశ్యంబు! తెలివొక్కటే కనెడుదృక్కు! 29

మనసు బుద్ధి యనంగ ద్వివిధం
బ నగుకరణ మొకండె! బుద్ధి య
గును నమలముగఁ జూడ గల్మష గుణము నగు మనసుఁ
మనసు మఱచుట; బుద్ధి తెలియుట
తనరు మఱి పెఱుకలస్వరూపముఁ
గనెడు నిజమగు తెలివి దృక్కగుఁ గాంచఁగాఁ దనయా! 30

తలఁప, దేహముకంటె నింద్రియ
ములు ఘనంబులు; నరయ నింద్రియ
ములకు మేలు మనంబు; మదికిని బుద్ధి యుత్తమమౌ;
తెలియ బుద్ధిని తెలియు సాక్షిగ
నిలుచునది "సోహం" బనుచు, ని
ష్కలుషుఁ డగు నా ప్రత్యగాత్మకుఁ గలుగఁ డొరుఁ డింకఁ. 31

భూతపంచక, బుద్ధ్యహంతలు
సాతిశయ మగుదశవిధేంద్రియ
జాతమును, మఱి ప్రాణమాదిగసకలవాయువులున్
చేతనా, దృతి, దుఃఖ, సుఖ, సం
ఘాత, మిచ్ఛాద్వేషములఁ బ్ర
జ్ఞాతిశయములఁ జేర్చి క్షేత్రమటంద్రు విజ్ఞులోగిన్ 32

ఈవిధంబగుక్షేత్రమెఱుఁగున్
గావునన్ క్షేత్రజ్ఞుఁ డనఁబడు,
దేవతిర్యఙ్నరచరాచర దివ్యవిశ్వమునన్
జీవభూతుఁడు ప్రత్యగాత్మయు,
కేవల చిదానందమయు స
ద్భావసహజాద్వైత మదె సత్యంబు సహజంబున్. 33

తనువునన్ ప్రాణంబు, ప్రాణము
నను మనసు, మనసునను గర్త్తయుఁ,
గనఁగ నాతనియందు. భోక్త్తయుఁ గాంచ నాతనియం
దెనయుసాక్షిని ప్రత్యగాత్మను
గన, ననాత్మల కన్య మయి మఱి
తనర నిలుచును వస్తుచిన్మాత్రంబు విను తనయా! 34

సావయవ మీతనువు, జడదృ
శ్యావలంబన, మన్నమయమై
భావవికృతుల నాఱిటినిఁగని, బాల్యముఖ్యదశా
భావితంబగుఁ; దలఁప శకటము
కైవడిని ప్రేరకునధీనము,
భావ మెంచఁగ భౌతికం బి దపాత్ర మగుఁ దనయా! 35

నిదురతతిఁ బడియుండు, మెలకువ
నొదవ నడచెడు, నింత ప్రాణం
బది తొలంగఁగ వట్టికట్టియ యట్లు నిష్ఫలమౌ;
పొదుగువడు మాంసాస్థిచర్మము
కుదురుదుర్గంధముల కిరవనఁ
బొదలు దేహం బధ్రువము సూ! పుత్ర! పరికింపన్. 36

తెలియ నరములు నెమ్ములుం బిత్త
మలము ఫలమగు; రక్తమాంసము
చెలఁగుచర్మముఁ దల్లిరుధిరము చేతఁ గలిగెఁ; గనన్
లలన పురుషుం డనువిభేదము
తలఁపు నవయవభేద మంతియె;
మలభరితతను వాత్మ యగునే! మంటిబొమ్మ యగున్. 37

తెలిసి భ్రమగొననేల, జనకుని
మలమె కా, మమకార మేటికి?
ఫల మగునె తా ననఁగ, చెడిపడు పాడు దేహంబున్;
చెలఁగెఁ దను విధి మాతృ గర్భము
వెలువడక శోణితము నిలువఁగ;
నెల నెలకు నభివృద్ధి నొందుచు నిక్కముగఁ దనయా! 38

ఇన్నిరీతుల గనఁగ తనువును
గన్నుగానక తానె యనుకొని
జన్మములఁబడి చెడితినే యను వ్యథలచేఁ గుందున్;
మున్నుమున్నే తెలివిగొని భ్రమ
లన్ని వీడి నిజానుభవసం
పన్నమతి బ్రహ్మంబు గనునభ్యాసమే యొప్పున్. 39

మేనఁ బ్రాణములు బహుగతులఁగఁ
గానఁబడియెడు ప్రాణములో యివి
మేనిచేష్టలకొఱకు నాడుల మెలఁగి వలగొనుచున్;
బూని కర్మఁదిత్తి యూఁదువి
ధానఁ దోఁచెడు నీశరీరము
లోనియూర్పులు నీవు గా వాలోచనము సేయన్. 40

మేనఁ బ్రాణము హృదయమందు; న
పానమో గుదమందు; నాభిస
మానమును, గ్రీవాస్థలంబున; మఱియుదానంబున్;
వ్యాన మది సర్వాంగములయం;
దీనియమమునఁ బంచవిధసం
స్థానములఁ దమపనుల విడువక తగిలియుండుఁజుమీ; 41

చేతనతఁ గని యాత్మచే మఱి
భూతతనుకరణేంద్రియములకు
హేతు వనఁబడి క్షుత్పిపాసల నేపుసెఱి, భ్రాంతిన్
బ్రీతిఁ దనరుచు లింగదేహస
మేతముగ గమనాగమనముల;
నీ తెఱఁగు విహరించు ప్రాణము లీవు గా వరయన్. 42

జడము ప్రాణము; లాత్మ యజడము;
చెడును ప్రాణము, లాత్మ నిత్యము;
కడుచలితములు దృశ్యసాధన గతులు ప్రాణంబుల్;
వడుగ! జ్ఞానమయంబు, స్థాణువు,
కడునిజం, బచలంబు, పూర్ణము
కొడుక! చైతన్యాత్మసాక్షిగ కొప్పరించుఁ జుమీ! 43

లింగదేహముఁ గూడిఁ జన్మము
లం గనుచుఁ గష్టములఁ బొందుచు,
భంగమగుప్రాణముల, నాత్మగ భ్రాంతిమెయిఁ గనుచున్
లింగలీనత నాత్మ చచ్చెన
నంగ దోషారోపణము, ని
స్సంగుఁ డగునాత్మకు ననర్థము సత్య మిది తనయా! 44

ఇన్నిగతులుగ నున్నప్రాణము
లన్ని యాత్మలు గా ననుచు మది
నెన్ని భ్రాంతిని గనక మమతల నిడక వానివయిన్;
తన్నిమిత్తనిధానముగ లో
నున్ననిజచైతన్యవస్తువు
నెన్ని నీలోఁ గాంచు, మదియే యెఱుఁగు మీ వనుచున్. 45

ధ్వనిని జెవియును, గన్నురూపము,
తనువు తాఁకును, జిహ్వ రసమును,
గనఁగ నాసిక గంధమునుఁ దా గనుఁగొనెడిఁ దలపన్;
తనయ! విషయము లొక్కటొకటికి
ననువు లీశ్రోత్రాదు లంతయె;
యనయమును సర్వత్రసాక్షిగ నాత్మయేయొప్పున్. 46

వేఱువేఱుగ వానికార్యము
లేరి యువియువి కనుట యింద్రియ
వార మాత్మలు గావు, నిజరూపములు గా వివియున్;
ఆరయఁగఁ జైతన్యవస్త్వా
ధారమునఁ దృశ్యాన్యసాధన
కారణములై చేష్ట సలిపెడుగా దనూజాత! 47

మనము సంశయమూర్తి; నిజచిం
తనము బుద్ధికి రూప; మేత
న్మనమొ బహుకాలానుభవ సంస్మరణరూపము నై
తనువునఁ బ్రాణేంద్రియాదుల
ననిశముఁ దా ననునహంకృతి
గనును, గావున నాత్మ యదియును గాదు తలపోయన్. 48

బుద్ధి సుఖ, దుఃఖేచ్ఛ మొదలగు
సిద్ధగుణములఁ గల్గి గుణియై,
ఇద్ధకర్తృత్వాభిమానత నిహపరావృత్తిన్
శ్రద్ధగొను; మద్దెలను దాను ని
బద్ధమై మూషికము వర్తిలు
పద్ధతిని నడయాడుఁ; దగునే వాని నాత్మ యనన్? 49

అరయ నీసకలేంద్రియంబులు
కరము నిద్ర నడంగ, నాత్మని
పరమసహజసుఖం బవిద్యను భాసిమై చెలఁగున్;
మఱియు జాగ్రదవస్థ నది గుఱు
తెఱుఁగరా కుండెడు శతంబున
నిరతిశయనిజనిత్యసుఖ మనసేరఁ బడ దదియున్.

ఈశరీరము మొదలుగాఁగల
కోశపంచక మాత్మ గా దది;
ఈశరీరమునందు నాత్మను నెఱుఁగు తెఱఁగు భ్రమా
వేశసకలావరణముల శవ
కాశ మొసగెడునాత్మ తేజో
రాశి యగును "గుహాహితపరబ్రహ్మ" మన వినవే 51

కాంచ పదరము లైదు కలిగిన
సంచి నుండెడురత్న మట్టు, భా
వించ సూక్ష్మాదు లన నైదుగ వెలయు కోశములన్
మించి తన్మయుఁడగుచు నిజతే
జోంచితుం డగుప్రత్యగాత్మఁడె
యెంచఁబడు సచ్చిత్సుఖైకపరేశబ్రహ్మ మనన్.

తనుమనఃప్రాణేంద్రియాదులు
గనఁగ నాత్మేతరము లన్శ్రు
త్యనుభవోక్తులు దిరము లయ్యును నాత్మ కీగుణముల్
ఘనత నారోపణ మొనర్తురు
కనఁగ దుర్బలశ్రుతిపరాయణు
లనఘ! దేహాద్యఖిలకోశము లాత్మ కాదరయన్. ౫౩

పాము గానటువంటి త్రాటినిఁ
బా మనుచు మది భ్రాంతిచేఁగను
సామెతగ పరికల్పితము లగుసాంతము ల వెల్లన్
ఆమహాబ్రహ్మం బనఁగ నిం
కేమి టధ్యారోపణం బది,
నామమాత్రమే కాక భ్రమయును సందనా! నిజమే?

తెలియఁ బ్రాకృతులందు రాత్మను
దలఁప సుతుఁ డని పలుకు శ్రుతియని;
చెలఁగి సుతులాలించు పిత యని చెప్పఁబడు యుక్తిన్;
పొలియఁ దనయుఁడు పొలిసితిని నే
నిల ననెడియనుభవము గలుగుట
బలుకుదురు సుతు నాత్మయని దుర్బలప్రమాణములన్. ౫౫

“అన్నమయమాత్మాన” మని యను
చున్నశ్రుతిఁ గన ‘సుతుని విడి తా
నెన్నఁ బరుగిడువహ్నితమగృహ మేర్చ’ ననుయుక్తిన్
ఎన్న నే నూలుండఁ, గృశుఁడను,
అన్నయనుభవ ముండుటను సం
పన్నతను విది యాత్మ యందురు వాదు లతిభ్రాంతిన్. 56

పలువు రగుచార్వాకు “లింద్రియ
ములు కలహామాఁడె” నని శ్రుతి యనుఁ;
తలఁగ కరణము తనువు విషయముఁ దగ్గల దనుయుక్తిన్;
తెలియఁ జూడను, వినను, నడవను,
పలుక, ననుభావమున నింద్రియ
ములనె యాత్మగ నెంతు రిల నతిమోహమతు లనుచున్. 57

ఇలను గొందఱు వాదు లందురు
చెలఁగుప్రాణం బాత్మ యంచని;
తలఁప శ్రుతితా “ప్రాణమయమాత్మాన” మనియనుటన్;
తెలియఁ గరణములెల్లఁ బ్రాణము
వలన వర్తిలు యుక్తి; ప్రాణం
బలరు నశనాసక్తిభోక్తగ, ననుననుభవమునన్. 58

తనయ! కొందరు వాదులందురు
‘మనసె యాత్మ’ యటంచు, నది యె
ట్లన ‘మనోమయమాత్మ’ యని శ్రుతి యాడుచుండుటచే;
మనసు నిద్రనడంగ ప్రాణము
తనువు నెఱుఁగనియుక్తి “నేదా
నిని నెఱిఁగితిని, యెఱుఁగ” ననుభవించినయనుభవమునన్. 59

మానసము జడమగుట విను "వి
జ్ఞానమయమాత్మన" మన్న శ్రుతి;
కానఁ గర్త వినాగ మనమది కాదు సాధకము
నాఁ నెగడు బలుయుక్తి, కర్తయుఁ
దానె భోక్తయు నగు ననుభవము
నాని విజ్ఞానమునె వాదకు లాత్మ యందు రిలన్ 60

తనయ! విను 'మానంద మాత్మ' య
టనుచుఁ బలికెడి శ్రుతి "సుషుప్తినిఁ
గనఁగ బుద్ధ్యాదులు లయం బగుఁగాదె" యనుయుక్తిన్;
"కనితి నే సుఖనిద్ర; నొందును
గన" ననెడియనుభవముచేతను
ననుదు రానందమునె యాత్మ యటంచుఁ గొంద ఱిలన్ 61

వినుము "సృష్టికిఁ బూర్వమె యస
త్తైన" దనె శ్రుతితతి కన సుషు
ప్తిని గనంబడ దీసమస్తముఁ దెల్ల మనుయుక్తిన్;
గన" సుషుప్తిని లేక జాగృతిఁ
గనఁబడెడు" నను ననుభవముచే
నని, రసత్తునె యాత్మ యంచని యలరి కొంద ఱిలన్ 62

తనయ! విను ప్రాకృతులె మొదలగు
జనులు వాకొనినట్లు, శ్రుతియు
క్త్యనుభవాభాసములు నా, పుత్రాద్యనాత్మకముల్
తనతనకె పరిభవము నొందెడి
ననఘ! తమలో త్తరో త్తర
మనఁగ శ్రుతియుక్త్యనుభవాభాసాదుల్లకు లోనై" 63

స్థూలసూక్ష్మము లతఁడు గాఁ, డీఁక
నోలి నప్రాణం, బమనస,
మూలకింపుము, భోక్తకర్తయు నతఁడు కాఁ డరయన్;
బాల! "చిద్రూప మది చిత్సుఖ
మూల" మనునీప్రబలశ్రుతివా
గ్జాల మది దుర్బలము లగుశ్రుతి జాలమును నడఁచున్. 64

ఘటములోపలిదీప మెటువలె
ఘటమునకు భిన్నముగఁ దోఁచునో?
యటువలెను పుత్రాద్యనాత్మల నంటిభాసమునం
దిటమయినప్రత్యక్ప్రకాశము
కుటిల పుత్రాదుల నెపంబున
ఘటన మగు; వే అనుచుఁ దెల్పెడుఘనతరపుయుక్తిన్. 65

బ్రహ్మ నెఱిఁగినవారు స్వయముగ
బ్రహ్మ యనియెఱుఁదురపుడు తమ్మే
బ్రహ్మ రూపమునన్ దెలియు ననుభవము గానఁబడన్;
బ్రహ్మ యిటు శ్రుతియుక్త్యనుభవను
సమ్మతముగానుండ, నారో
పమ్ము లగుదుర్వాదములు నిలువంగలవె నిజమై? 66

తనయ! శ్రుతియుక్త్యనుభవంబుల,
గనఁగ నాత్మ యిదంచు స్థిరపడు
ననఁగ, దుర్బలము లగుశ్రుతియుక్త్యనుభవంబులచేఁ
గనుక, తనయాదులను నాత్మగఁ
గనుట యారోపితమె యగు; నైఁ
గనినవాదములున్ బరస్పర ఖండితంబు లగున్. 67

స్థూలసూక్ష్మపరంబు లనఁగాఁ
జాలుమూఁడగుతనువు, లరయఁగ
స్థూల మవయవమాంససహిత, మశుద్ధ మగుఁ దెలియన్,
ఆలకింపుము, తనయ! సూక్ష్మము
స్థూలమే నే ననుసహంకృతి;
ఓలి నిర్గుణవస్తువే కన నొప్పుఁ బర మనఁగన్. 68

స్థూల మది సుఖదుఃఖసంతతి
కాలయము; ఘటమటుల జడమగు,
కాలకర్మాధీన మిది యగుఁ గాన బాల్యం, బా
లిలఁ బ్రాయము, ముదిమియుం గని
సోలు నీయాహారకోశము,
కూలుఁ దుద కిది కంకగృధ్రాగ్నులకు నాహుతియై. 69

తెలియ సూక్ష్మ శరీర మది తాఁ
దలచిఁ తనువే ననుచుఁ, గర్మల
వలచి, బహుజన్మములఁ గని, క్రతువ్రతములన్ గృశమై
మెలఁగి స్వర్గముఁ, బిదప నరకముఁ
గలుగఁ దిరుగును రాట్నమున బిగు
వలరఁ గట్టినభాండమన, నా శాంతమున్ గనకే. 70

బమ్మ లెందఱు చనిన, బ్రహ్మాం
డమ్ము లెన్ని జనించినను, గ
ల్పమ్ము లెన్నైనను, నశింపక ప్రబలి లింగశరీ
రమ్ము పంచక్లేశమయపా
శమ్ము తను బిగియింప; యామపా
శమ్మునకు లోనగుచు, ముక్తికిఁ జన ది దెన్నటికిన్ 71

ఇట్టిగతి నీసూక్ష్మదేహము
చుట్టి, దుష్కృతసుకృతఫల మగు
నట్టి, సంసృతిదుఃఖములఁ బడి యవల వైరాగ్యం
బెట్టొ శ్రీహరికృపను, గురుకృపఁ
బుట్టుచో, నపవర్గమార్గముఁ
బట్టి, జీవన్ముక్తిఁ డగు సులభంబుగాఁ దనయా! 72

స్థూలసూక్ష్మము లెన్న మాయయె;
మూల మగుపరమార్థ మొక్కటె;
యాలకింపుము, సాక్షి చైతన్యాత్మకం బదియే;
బాలకా! యీ రెండుతనువులఁ
గ్రాలునభిమానంబు విడి, సుఖ
మూల మగునిత్యాత్మ మీ వన ముఖ్యలక్ష్య మగుక. 73

ప్రాణ మాదిగఁ బంచకోశ
శ్రేణి యనెడునవాద్యవిద్యా
ప్రాణితలగతలింగదేహముఁ బాపురే! తలఁపఁగ
ప్రాణులకు బంధకము, దీనిని
నేణివలెఁ గనుసాక్షి వీ, వీ
పోణిమిని గని నిజము తెలియుము బుద్ధిలోఁ దనయా! 74

తనయ! తైలముఁ దిలల; గాష్ఠం
బునను ననలము; పాల నాజ్యం
బును, మథనమునఁ బడయురీతినిఁ బోలుతత్త్వములం
గనుగొనుచు వేర్పఱచి చూడం
గను, నవన్నియుఁ బోవఁ దుది నిలు
చును, చిదాకాశంబు నీ వనుచుఁ గనుము దానిఁ. 75

లే దనుచు నాస్తికునకైనను
రాదు పలుకఁగ; నుండియును దా
లే దనంగను దానుసైతము లేకపోవుటగు౯;
లేద నెడిపలు కెట్లు చెల్లును?
భేదనఁగ భ్రమ లేద నెడునవి
భేదభావాత్మప్రబమీవని పేర్మిఁ గను తనయా! 84

సతిసుతులు మొదలైన బాంధవ
తతుల, తను, ధన, భూమి, వస్తువి
తతుల, నాత్మీయంబు లని మదిఁ దలఁచి భ్రమపడుచు౯
సతముఁ దత్ప్రియరసమున౯, మ
గ్నతఁ గనుచుఁ జెడిపోక, విమలని
రతిశయపు నిజనిరతసుఖ, మీ వనుచుఁ గను తనయా! 85

అంచితంబుగ రత్నఘటమున
మించుమణిమయ మైనదీపపు
సంచు లెంచఁగ లోనఁ బయటను జాల వెలుఁగుగతి౯;
పంచభూతాత్మకశరీరము
గాంచ నంతర్బాహ్యముల, వెలి,
గాంచుచిజ్జ్యోతిస్స్వరూపం బీవు గద, తనయా! 86

జ్ఞానశేషఖమె తా నగును, తన
లోన జ్ఞానము పూర్ణమగు, నా
జ్ఞానమున కరణములు దిరిగెడు గగనపక్షులచె
ల్వాని, తెలియందగురహస్యము
జ్ఞానము౯; రీతిఁ నేదెల్పగ
రానిచిద్గగనప్రకాశ విరాజి వీవె సుమా. 87

కాంచి వేఱసరాదు, మదిలో
నెంచి లే దనరాదు, ప్రత్యే
క్కించి పలుకఁగరాదు, మది పరికించియోచింపఁ;
మించునది సహజం బగుచుఁ దా
న్పించు స్వాత్మస్వప్రకాశం
బంచితంబుగ, నదియె నీ వగు దరయు మీఁది తనయా! 88

వివిధ మగుసంసృతిసమస్త
వ్యవహారణముల జాగృతిఁ దగు;
నవల తద్వాసనయె స్వప్నమునందు భాసించుఁ;
ఇవి యెవియుఁ దోఁపవు సుషుప్తిని;
వివర మీయన్ని టను నీయును
భవము సాక్షియె నీ వెలుఁగు వది భద్రముగ నీలోఁ 89

జాగరమున సుషుప్తి స్వప్నము
లే గనవు; జాగ్రత్సుషుప్తులు
రాఁగలుగ వాళలలలోఁ; జాగ్రతయు స్వప్నము, నా
లోఁ గలుగఁబో వ సుషుప్తిని;
నీగతి నవస్థాత్రయంబుల
భోగసాక్షిజ్ఞాన మీ వని పోల్చుకొను టొప్పుఁ. 90

మనసు రెండుమొగాలయద్దము,
కనఁగ దానికి నిద్రగవుసెన;
మనసునకు నెచ్చరిక యొకతుద మఱియొకటి కలదై
కనఁబడును; దా నిట్టిరీతుల
మనుమనోవ్యవహార మెల్లను
గనెడుఘనచిద్రూపవస్తువు గావె నీ వరయఁ? 91

తెరపి లేకున్నట్టి గృహమున
సరకు లన్నియుఁ దీయ నందం
బరము నిల్చినయట్లు, తనువునఁ బరఁగుతత్త్వములన్
దఱచి కడదీయంగఁ, గడపటఁ
బరఁగు వేర్పఱుపంగరానటు,
పరతరచిదాకాశ, మీ వన పరలు నది కనఁగన్ 76

అరయ దీపస్తంభ మీమెయి;
కరణతతి యగు ప్రమిద; ప్రాణా
ద్యురుసమీరప్రతతి తైలము; నొనరి దివ్యమునై
మెఱుగువత్తియె సూక్ష్మతను వనఁ
బరఁగు, దానన్ వెలుఁగునాత్మయె
వరపరంజ్యోతి యగు, నీ కది పరము గాదు సుమీ! 77

కనఁగ, దృశ్యము, జడము నాశము
మనసు నయనంబులును, వాక్కులు
గనుచు చేష్టల నెవనియాశ్రయ కారణముచేతన్
దినము వ్యవహారముల సలుపుచు
మనునొ, స్వవిషయములఁ దవిలి యా
ఘనతరబ్రహ్మంబు నీ వనఁ గాఁ దగుడు తనయా! 78

తనువు మొదలగుకోశతతియె
ల్లను ననాత్మ లటంచు, శ్రుతియు
క్త్యనుభవంబులఁ దెలిసి, యవి త్రోయంగ మిగులునదే
ఘనతరప్రత్యక్ప్రకాశం
బనఁగ జడకోశముల వెలిఁగెడి
తనయ! నిజసాక్షియగు; నీవది తథ్యముగఁ, గనుమా! 79

తోఁచునీదృశ్యములనెల్ల, వి
వేచనముచేఁ దెలియుజ్ఞానముఁ
ద్రోచి దృశ్యము లన్ని నిలిచినఁ దుదకు తానొకటే
తోఁచు; జ్ఞానము సాక్షిభూతం
బా చిదానందస్వరూపమె
సుచరిత! నీ వనుచుఁ దెలియుము దృఢమతిన్ దనయా! 80

ఎండమావులలోని జలమటు
లుండు నీస్వప్నప్రపంచము
నిండఁ దెలిసినవారి కియ్యు, దనిత్యమై తోఁచున్ :
ఖండితం బిది, నేతివాక్యము
నుండి మిగులు నబాధరూపము
నిందు పేరిడరాని బ్రహ్మము నీవు నిక్కముగన్ 81

ఇది యనఁగ నెదురగుచు నగపడు
నదియె బాధితమాటఁ, దాఁ గా
కిదియు లేదని తెలిసి, తద్వ్యావృత్తిసుఖమున నే
విదితముగ గుఱు తెఱుఁగునిజచి
త్పదవియా నానందరూపమె,
మదిఁ దెలియు మీ వనుచు; మనసున మాను సంశయమున్. 82

ఇట్టి దనరానట్టియాత్మ, న
దెట్టు తెలియఁగనో ననఁగ, విను
మట్టిపలుకఁగ రానిచిద్ఘన మై, యచింత్యమునై
నట్టిదానాత్మస్వరూపముఁ
దట్టి యనుభవ మంది నీలో;
వట్టి భ్రాంతినిఁదొలఁగి కను మది వత్స! నీ వనుచున్. 83

కలలలోఁ గల యగుచు, బుద్ధినిఁ
దెలియఁగల తెలి వగుచు, నిద్రను
గలుగు సుఖమున సౌఖ్యమయి, యవి కలఁగి పోవుగతుల్
తెలియఁగలతత్సాక్షి తానయి
పలుకుఁ దలఁపులు దెలియరానటు
లలరెడుపరంజ్యోతి వీవని యరయఁదగు దృఢతన్. 92

మనమునే గుఱిపెట్టి చూడఁగఁ
దనకుఁ దానే తోఁచుచుండును,
మనసు సాక్షియనంగఁబడు పరమప్రకాశంబున్!
మనమనఁగ దలఁచుటయె; యాతలఁ
పునవో, కామాదులనుబార సెడు;
అనఘ! కామాదులను వదలఁగ నగు మనంబునకున్. 93

ఒక్కతఱి షడ్వర్గమున, మన
మొక్కతఱి వైరాగ్యమున, నిం
కొక్కతఱి ధర్మమ్మున, సంసృతి నొకటఁ దత్త్వమునన్;
జిక్కి పుణ్యాఘముల నొకతఱి,
నొక్కతఱి సుఖదుఃఖములఁ బడు;
నిక్కరణి గుఱుతింపఁ గల్గిన దీవె నిక్కముగన్. 94

"తెలివి తెలిసితి" ననును మనసే;
"తెలివి నే" ననునదియు మనసే;
తెలివిలోఁ దెలివగుచుఁ దెలివిగఁ దేలునది మనసే;
తెలియ కేమియు గుఱుతు చూపక
నిలిచి వెలుఁగున వెలయఁ గలిగిన
తెలివి యాకాశంబు నీ వని తెలియు మది తదయా! 95

“నామరంబున ననరే! యన్యం
చేమితోఁపదు మందుఁ; దెలియఁగ
నామెయి స్నికతన నిశ్చయము మన్యో' నంచనినఁ;
తా మనసు కాలుష్య మొఱఁగిన
దేమొ, తానే తెలిసిచెప్పెను
నామహాజ్ఞానైకనిధి నీ వని యెఱుంగు సుతా. 96

తెలివికిని దేహంబు మన సగు
నల వివేకమె బుద్ధి; వ్యవహృతి
గలుగు నభిమానం బహంకృతి గాఁ జెలఁగుఁ గనఁగన్;
తెలుప నిటు లగునింద్రియంబుల
నిలిచి ప్రేరేపించుసాక్షియె
యల పరంజ్యోతియు, యదే నీ వనుచు మదిఁ గనుమా! 97

తనమనం బనునపుడు తనమన
మునకుఁ దా భిన్నుం డగుచుఁ, ద
న్మనముఁ దా గుఱిగాఁగ నిడికొని మనసు సల్పెడు క
ల్పనల, వ్యవహృతిగతుల నిచ్చలుఁ
గనెడుసత్యజ్ఞానచిన్మయుఁ
డనఁ బరగుచైతన్యసాక్షి పరాత్మ నీ వరయన్. 98

సురనరాదివి గావు, మఱి స్త్రీ
పురుషమూర్తివి గావు, బ్రాహ్మణ
ధరణిపతివైశ్యాదిసంజ్ఞలఁ దనర నీ వరయన్;
కరచరణమూర్ధాక్షినాసలు
పరఁగుదేహము లేక నిత్య
స్ఫురితపరమాకాశమూర్తివై పాల్పెదవు తెలియన్. 99

"ఏమియును గానట్టివస్తు వ
దేమి? నే నెట్టులైతి నది? మఱి
యేమి నే నానిజముఁ గనుఁగొను టెట్టు? లనుభవ మిం
కేమిగతి నగు? వివరమగునటు
స్వామి! దయతోఁ దెలిపి మఱిన
నోమి దీనతఁ బాపు మనుశిష్యు నొనర ముని గనుచున్, 100

ఒకని నీ వెవఁడ వనఁదగుఁ, దా
నకట! తనఁ దానడుగ నుచితమె?
వికటగతి యగుఁగాదె యట్టిది విశ్వమున నెందున్?
ముకురమా కరకంకణమునకు?
ప్రకటనిజచైతన్య మది నీ
వ కద! దృఢముగ నిర్ధరింపుము వత్స! నీలోనన్. 101

"నే నెఱుఁగ, నే వేఱు" యనునది
దేని వలనం గంటి, వది తుది
కానఁగా కేవలము తెలివియె కాదె? లక్ష్యమగున్,
దానిఁ గొని ధ్యానింప నత, మా
జ్ఞాన, మపరోక్షానుభవ సం
ధానసత్యముఁగాఁగఁ జూపమఁ దలఁపు మీ వదిగః. 102

తెలివి తానై యుండియును, దనుఁ
దెలియ ననునది తనకు నోటను
గలుగునాలుక లే దటంచను గతిని హాస్యమునొఁ
దెలియ ననుటను దేనివలనన్
దెలియఁ గంటివా? యా తెలివియా
వల చిదానందస్వరూపం బగుదు వీ వరయన్. 103

తెలివి తానై యుండియును, దనుఁ
దెలియకుండు టదెట్లు? సూర్యుని
నలమునే చీఁకటి? యదంతయు నచ్చెరువునుదుగా;
తెలియ లేదది మఱప రాదది
తలఁప గుఱుతే లేక, సహజత
నలరుచున్నది సత్యవస్తువు నరయు మీ వనుచున్. 104

నేను, నే ననునట్టిదగు నభి
మాన మది తాఁ గాదు, దాని, ని
ధ్యానమాజ్ఞానంబె నీవని తలఁచి యద్దానిన్
స్వానుభవసుజ్ఞానములచేఁ.
దాను గన నగు, నిత్యనిజని
ర్మాననిర్గుణవస్తు వీ వని మది నెఱుఁగు టొప్పున్ 105

'నన్ను నే నెటు లెఱుఁగ నగు' నను
మ న్నెఱుఁగునెఱు కాత్మయగు, నది
తన్నుఁ దా నెఱిఁగించు జ్యోతిగఁ దనరుస్వప్రభచే;
నెన్న బుద్ధికి సాక్షియైన య
భిన్నచైతన్యం బనన్యని
జోన్నతానందస్వరూపమె యొప్పు నీ వనగన్ 106

'జ్ఞానమున నను నే నెఱుంగఁగ
నే నని వచించెడి కతంబున
జ్ఞానపూర్వక మనఁగనౌ, నజ్ఞానమిది తెలియన్,
జ్ఞాన మటుగాన్పించు నంతియ
కాని, జడదృశ్యాన్యమగుఁ జుమీ!
జ్ఞాన; మాజ్ఞానంబె నీ వని కనుము నిశ్చయతన్. 107

తన్నెఱుఁగనియవిద్యకన్నను
మున్నుగల సుజ్ఞానమును దా
నెన్నఁ డజ్ఞానంబు ముసుకఁగ నెఱుఁగ దాశక్తి?
పున్నమను చందురుని నలమునె
చిన్న? యాటుల నిరావరణపూ
ర్ణోన్నతనిజానంద మీవని బుద్ధిఁగనుము సుతా! 108

తనుకరణముఖ సర్వతత్త్వము
లను గలుగుచును బ్రతిఫలించుచు
దనరి చేతనమైన సకలాధారచిన్మయునిన్
గనఁగ లేదను టరయ నుదకము
నను నిలిచి రజకుండు తృషచేఁ
దనువుఁ బాసె నటన్నయటు చెడఁదానె తనవలనన్. 109

కట్టడులు ఛే, కన్నితనువుల
మెట్టిమెట్టనియట్లు వెలుఁగుచు
నెట్టి చేష్టల వాని కిడు జీవాత్మనెఱుఁగ నన్,
పుట్టి తాఁ దనతల్లి నిజముగ
పుట్టు గొడ్రాలనుచుఁ దలఁచెడు
నట్టిభ్రష్టునిగతిని, నిశ్చయ మరయఁగాఁ దరమే? 110

జలజసఖునటు వెలిఁగి యొక్కట
వెలుఁగఁజేసెడు నెల్లకన్నుల
నలఘునాగతి నాత్మతనుకరణాదితత్త్వములన్
వెలుఁగుఁ దా నొకటే విధంబుగఁ
జెలఁగు కస్తురి పరిమళముఁ జే
తులను చూపఁగవలెనె? వాసనతోఁచదే తనకున్? 111

ఎఱుక మనమున వెలయు; నామన
మొఱుక తానై, యింద్రియంబుల
నిరవుగొనఁగఁ, దదింద్రియములు గ్రహించునర్థములన్;
పరమచైతన్యాత్మ మిందున
కరముచేరు టెఱుంగరాదే?
వరలు తనగళహార మరయఁగఁ బరులు కావలెనే? 112

నుడువు, నడచుఁ, బదార్థతతిఁ దగఁ
బడయు, విడుఁ, నానందపడు మది
నడను గని కర్మేంద్రియవ్యవహారముల నిడునీ
జడశరీర మదెవని నొక్కని
బడసిచేష్టలు సలుపు సతతంము
విడక యాచైతన్య మీవయి వెలయుదువు తనయా! 113

నిండుసంవి త్తగుచుఁ దోఁచుచు
నుండుసత్యమె, తెలిసిచూడఁగ
నుండి నిజతముకరణబుద్ధుల నోలి వెలయుటచే
దండిగాఁ జైతన్యమును గని
యుండుకతమున నవి యనంబడు
చుండు చైతన్యాత్మకము లని యొక్కఁగతిఁ దనయా! 114

తొలుత గురువర! బుద్ధివృత్తులఁ
దెలియు నెఱుకయె యాత్మ యంటిరి;
తెలిసె యది గుఱుతించుకొను టే తెఱఁగొ"? యనఁగరుణన్
తెలిసికొను టెటు లనెడిబుద్ధిని
దెలియు తెలివియె యాత్మయనుచున్
తెలిసికొని గుఱుతింపుమీ" వని తెలిపె ముని సుతుంతోన్. 115

బుద్ధి తనయుదయాస్తమయముల
పద్ధతులఁ దెలియుంగలే, దా
బుద్ధి యుదయ, లయము లనంతము; పొసగ వానికిని
బుద్ధికిని సంధాత యనఁగఁ, బ్రి
సిద్ధగతి, నిన్నెకను నెఱుకయె
శుద్ధసహజానంద, మయ్యది చూడ నీవె సుమా! 116

సిద్ధసాధనమై కనంబడు
బుద్ధి మొదలగువానిఁ గూడిన
శ్రద్ధఁ జైతన్యంబు విషయగ్రాహి యనిపించున్!
బుద్ధి వృత్తు లడంగినంతనె
శుద్ధబుద్ధవిముక్తుఁడగు, నా
సిద్ధసహజానందరసమయచిత్పదార్థము దే. 117

విమలరవికాంతినిఁ బగట, దీ
పముల వెలుఁగున రాత్రిన్ రూ
పములు గనఁబడు, కనులుఁ గను దీపముల, భాస్కరుని
సమత గన్నులు మూయ, నారూ
పము లరసికొనుబుద్ధిబుద్ధి
క్రమ మెఱుఁగుఁ జైతన్య మయ్యది కనుము నీ వనుచున్. 118

వర్గనిశి గదిఁ బండి, న్నిద్రా
భరముచేతన్ లేచి భయమున
నరసి కంబముఁ దోడరి తడబడి యడుగు లిడుకొనుచున్
నరుఁడు చనుపూర్వానుభవసం
స్మరణసాధనబుద్ధిచే నటు
బరఁగుబుద్ధిని దెలియునెఱుకయె వత్స! నీ వరయున్. 119

అరయపదిగాయత్రి నుడికైదు
తెఱఁగె, తెలియుము తనయ! బుద్ధికిఁ
బర మనుచు బోధింపఁబడు నెది పరఁగ నాస్సజమే
మెఱయు తేజము; ఖరకరాదుల
మెఱుఁగుఁ జేసెడు జ్యోతి; మునముగ
నిరతమును వ్యాపించు వెలుఁగది నీవె సుమ! తనయా. 120

బుద్ధి తెలియునొ వస్తువును తా
శుద్ధవస్తువె తన్నెఱుఁగునో?
బుద్ధివస్తువులందుఁ దెలియఁగఁబోలు నెద్దియనన్
బుద్ధి తెలియదు వస్తువును, దా
శుద్ధవస్తువె తన్నెఱుఁగును:
బుద్ధి సాధన మగుట జడమై పోలుచు నది పెఱవైపొ. 121

బుద్ధిచేతన మగును నాత్మని
బద్ధమగుటను తానెఱుఁగ దది,
బుద్ధి యాత్మ నెఱుంగు టనునది పొల్లుమాటె యగున్
సిద్ధమారవిప్రభను ముకురము
శుద్ధముగ వెలుఁగొందుఁ గాక, ప్ర
సిద్ధరవి కిడఁగలదె ముకురము స్థిరతరప్రభలన్ ? 122

దొరకు చెంతనె యుండుమంత్రిని
దొరయె నీ వని స్వప్రయోజన
పరులు మొగమిచ్చకము లాడుట పాటియా నటులే
పరమపురుషుసమీపముననే
బరఁగుబుద్ధియు నాత్మయని భ్రమ
నరయుదురు నృపమంత్రులటు బుద్ధ్యాత్మ లిరవొందున్ 123

కాంచఁగా సుత! గాజుమృత్తిక
నుంచి కల్గినయట్టిదర్పణ
మెంచ ముఖమును జూచుపనికై యెసఁగు కైవడి నే,
మించు మాయాకార్యమే యని
పించు బుద్ధిని సాధనముగాఁ
గాంచి శోధనఁజేసి యాత్మనుఁ గాంచనగుఁ దనయా! 124

సకలమును వెలిగించురవి, తా
ముకురమున బింబితుఁడు కాఁ, ద
న్ముకుర మింటను గలతమంబును బోనడఁచుకరణిన్,
ప్రకటమయి చిజ్జ్యోతి లోపలి
మొకముకా, బుద్ధియును లోపలి
విస్మృతికరమాయాంధకారము విడివడును జూడన్. 125

ఎఱుక తాఁ దనబుద్ధి లోపల
నెఱుఁగు నెట్టు లనంగ నిజముగ
నెఱుక స్వరూపముగ లక్ష్య మగుచును నెసఁగబో దగుటన్,
ఒరఁగుముఖమును గనఁగ నద్దము
పరమసాధన మైనకైవడి
నరయ నాత్మను బుద్ధిసాధన మగును దలపోయన్. 126

బుద్ధి సాధనమాత్ర మగు, నా
బుద్ధి యాత్మ నెఱుంగ నేరదు;
బుద్ధిసాధన మొంది తనుఁ గనఁబోలు నాత్మ రయోగిన్;
శుద్ధ మగుజ్ఞానాంశ మాత్మయు!
బుద్ధియో, జడదృశ్యసాధన
మిద్ధ, మాత్మ నెఱుంగునది యన నెట్లు చెల్లు సుతా! 127

కన్ను గాంచునో యద్దమును? తా
నెన్న ముకురమె కంటి నెఱుఁగునో?
కన్ను ముకురములందు తనుఁ దాఁ గనునో? తలపోయఁగ !
ఎన్నిచూఁడగ నెఱుక బుద్ధిప్ర
పన్న మగుటను తన్నుఁ దాఁ గను
చున్న, దెఱుకను బుద్ధి కన దిదియుఁగ నిజము తనయా! 128

తన్నుఁ దనచేఁ దెలియు నని శ్రుతి
యన్నసూక్తికి నర్థమే మని
తన్నుఁ దనచేఁ దెలియు టెటు లని తలఁతువే? వినుమా!
కన్ను, ముకురముచేతనే తాఁ
దన్ను జూచెడి నట్లె యాత్మయు
దన్ను నపరోక్షానుభవబోధమున నెఱుఁగు సుమా! 129

జ్ఞాన మెఱుఁగునె తనవలనఁ దనుఁ?
దానె తనకే దృశ్య మగునే?
జ్ఞాన మింక జ్ఞానాంతరంబున సరగఁ దోఁచుననఁ ?
తా నదే యనవస్థగా కాం
డా నే? దీపమువలన దీపము
కానవలెనె? స్వయంప్రకాశము గాదె యది తనయా? 130

బుద్ధిఁ దోఁచెడియెఱుక కగునే
శుద్ధమగు నెఱుకకు వెలుంగిడ ?
యిద్ధమతి! యద్వయ మతీంద్రియ మిద్ధ మిది తెలియఁగ ;
శుద్ధజలమునఁ బ్రతిఫలించి, ని
బద్ధ మగురవిమండలంబు ప్ర
సిద్ధరవి వెలిఁగించునే యోచించి చూడంగన్, 131

## 3, త్వం పదార్థశోధనము

బుద్ధిఁ బ్రతిబింబించు టెఱుకను
శుద్ధసంవి త్తెఱుఁగు! నెట్లన
శుద్ధనయనము, ముఖము ముకురమున నెలమి, గాంచుగతిన్
బుద్ధి తోఁచి యడంగు కతమున,
బుద్ధి నెఱుకయుఁ దోఁచి యడఁగుట;
బుద్ధిసహితము దృశ్యమే యగుఁ బోల దది నిజమై! 132

బుద్ధి వెలిఁగెడి యెఱుక నెఱుఁగఁగ
బుద్ధిఁ గలుగుదు రెల్లవారలు,
బుద్ధి కావలి తేట తెలివినిఁ బోలునే యెఱుఁగన్ ?
శుద్ధప్రజ్ఞయతీంద్రియంబు, ప్ర
బుద్ధ మపరోక్షానుభవసం
సిద్ధిచే సాధ్యంబు; కనుఁగొన సిద్ధవడు మీవున్. 133

తోఁప కెఱుఁగుటె నిజపుటెఱుకగు;
తోఁప నెఱుఁగుట బుద్ధియెఱుక; య
దేపగిది బుద్ధ్యాత్మభేదము నెఱుఁగ దగు; జూడన్
కాపుకేతకి తావిఁ బామును
దాఁపునని యూహించుకైవడి
తోఁపఁగలయది యెఱుక, దానను దొనకు బుద్ధిసుతా! 134

శుద్ధ మగుజ్ఞానమున గూడిన
బుద్ధి తా జ్ఞానమయి తన్నని
బుద్ధిపఱచెడుదాక తానే పరఁగునాత్మ యనన్;
శుద్ధరత్నము, గాజుపూస, ప్ర
సిద్ధి పఱచుపరీక్షకుని యటు
బుద్ధి యెఱుకను నిజపుటెఱుకను పోల్చికన నొప్పున్. 135

బుద్ధి కావల ప్రజ్వలించు వి
శుద్ధప్రజ్ఞను నెఱుఁగు టెట్లన?
బుద్ధి పొలుచు నడంగుచుండును మూఁడవస్థల; నీ
బుద్ధి వికృతుల నెల్ల నెఱుఁగును
శుద్ధసంవి త్తరయ; చంద్రుని
బద్ధుఁ జేసెడు రాహువును గను పగిదిఁ గను దానిన్ 136

సాధకుల కీబుద్ధి సాక్షిని
సాధనముఁ జల్పు టెటు లన, నిజ
బోధ మది నిత్యప్రకాశము; మున్నె యది తోఁపన్
బోధకై వడి బుద్ధి వెనువడి
యాదివస్తువువలన వెలిఁగెడి;
నాదమిడవె "తమేవభాంతము" నాఁగ శ్రుతులరయన్ ? 137

గుడముచే భక్ష్యములతీ పగ
వడెడు కైవడి బుద్ధి చిత్ప్రభ
నడరి తానును దోఁచుఁ జిత్ప్రభయట్లు, లంతె సుమా!
కడుఁగొనినసహజప్రకాశము
నొడువరానిది; యనుభవంబునఁ
దడవఁగనిన మహానుభావుఁడె దాని తెఱఁ గెఱుఁగున్ 138

కొలయుజలమునఁ బ్రతిఫలించిన
జలజహితుబింబప్రభల, నా
జలమె తోఁపక బింబ మెల్లెడ సాగితోఁచుక్రియన్
వెలుఁగుచిత్ప్రభఁగూడి తానును
వెలుఁగుచిత్ప్రభకరణి బుద్ధియు;
తలఁప సహజముగాదు తత్ప్రభ దానికిన్ దనయా! 139

బుద్ధికాత్మజ్ఞాన మగుచో
బుద్ధిసుఖమయమా; సదాత్మయు
శుద్ధసంవిత్తగుచు నిజగుణ శోభఁ దనరారున్ ;
బుద్ధి వెల్గును, రవివలన నా
శుద్ధ మగురవికాంతశిలయటు;
సిద్ధ మిది రవిపోలె స్వప్రభఁ జెలఁగు నాత్మ సుతా! 140

బుద్ధి ప్రత్యక్స్ఫురణ మగుటను
సిద్ధి గను నాత్మాపరోక్షము;
బుద్ధి బాహ్యప్రవణ మగుచోఁ బొసఁగు ద్వందములన్;
బద్ధతయు ముక్తతయుఁ గాంచుట
బుద్ధియే యగు నాత్మ గా; దది
శుద్ధ మానందైకరస మగుఁ జూడ సద్వయమా; 141

ఇనుపముద్దను నీటఁ ద్రోసిన
మునుఁగు, నదియే పాత్ర యగుచో
మునుఁగకే పయిఁ దేలియాడును పోల్చిచూడంగన్;
దనరుసంసృతిబుద్ధి బంధము
గనును, నాత్మజ్ఞాన మబ్బిన
తనయ! జీవన్ముక్తి గాంచును తథ్యముగఁ వినుమా। 142

ఎట్టివిషయము బుద్ధి నంటిన
నట్టి బుద్ధియు కలసి దానన్
బట్టువడు నదె బంధనం బగు బాయరానటులన్ ;
అట్టి దానందానుభవమునఁ
గట్టిపడుచో జీవభావము
నెట్టి బ్రహ్మైక్యమును బొందును నిజముఁ దలపోయన్. 143

తన్నెఱుంగలేనిదె యవిద్య, యా
దెన్న శాస్త్రవినిర్ణయముచేఁ
దన్నుఁ దాఁ గనుచో, నవిద్య యదార్థముగ నడఁగుఁ;
దన్నెఱుంగఁగ సాధనము తన
కన్న వేఱగుబుద్ధి, ఆత్మయు
దెన్న నన్యము; తన్నెఱుంగ నదియే లయం బొందుఁ. 144

అదినిమిత్తము, చిత్తబుద్ధుల
విదిత మగుగతి నెఱిఁగి, నిజ మగు
నదియె తా నని తెలిసి మదిని, యనాత్మ బను దెలుపం
బొదలువిద్యలకంటె మే లగు
సదమలానందైకఘనచి
త్పదముఁ జేరుటె బ్రతికిముక్తినిఁ బడయు టగుఁ దనయా! 145

సత్యశేషమె మేన నెసఁగెడు
నిత్య మగుచిత్తనుప్రకాశం
బత్యధిక మానంద మనఁబడు నాసాబగు; వెలుఁగా
ప్రత్యగాత్మ యనంబడెడు సం
స్తుత్యమోహనమూర్తి నిజసాం
గత్యమున నేకత్వముక్తిసుఖంబుఁ గను తనయా! 146

దేవుఁ డెవఁ డన వినుము, బుద్ధ్యన్వ
భావమునఁ దత్త్వం బెఱుఁగున
ద్భావరూపుఁడు సాక్షి నిజతత్త్వం బతఁడె గనఁగఁ
వేవిధుల శ్రుతిముఖము 'లేకో
దేవ' యని ఘోషింప నజ్ఞులు
దేవజీవవిభేద మెంతురు తెలియ కానిజముఁ. 147

మలినమై యద్దంబు మాసినఁ
గలదె దోసము? కడుగఁగా రవి
వలెనె వెలుఁగదె? యటులెగాదె ప్రత్యగాత్మయునుఁ;
గలఁపఁ బంచక్లేశములుఁ, దను
వలఁగొనఁగ సంసర్గపాశము,
గలఁతఁబడె, చిజ్జ్యోతి కెందును గలవె బాధకముల్? 148

ఓలి, త్వం పదలక్ష్యమును జాఁ
జాలదృష్టాంతముల, వ్యాసుఁడు
బోల చిదచిల్లక్షణంబుల బోధసలుపంగన్ ,
దూలి భ్రాంతిని జానుభవసుఖ
జాలశరధినిఁ దేలి శుకముని
లీల బ్రహ్మానందపదమున లీనుఁడై యుండెన్. 149

కోటిసూర్యవిభావిభాసిత!
కోటిమన్మథరూప! వింశ
త్కోటిసురకోటీరమణిగణకోటిదీప్తపదా!
హాటకోజ్జ్వలహార! సుందర!
పాటలాధర! దుష్టదైత్యో
త్పాటనా! మృదునామ! వేపలపర్తిశ్రీధామా! 150

త్వం పదార్థశోధనము

మూఁడవ అధ్యాయము సమాప్తము.





అనుభవామృతము

# తత్పదార్థ శోధనము

## నాలుగవ అధ్యాయము

---

శ్రీవిరాట్రూపా! ప్రదీపా!
భావవిలసితసన్ముసీశ్వర
భావనీరజభృంగ! వేపలవర్తిశ్రీరంగా!
దేవ! భువనాధార! సురసం
జీవనా! అవధారు వ్యాసుం
డీవిధిఁ వినిపించె శుకునకు హితమతం బలరన్.

ఉదయమున మలమూత్రముల విడు
టదియుపని, మధ్యాహ్నవేళను
పదరుక్షుధతృష లణఁప నుదరంభరిత మెంతేనిఁ
అదిముగియ మదిఁబొదలుమన్మథ
కదనమున కాంతులను గడపఁగ
నదను గనుతుచ్ఛులకుఁ దెలుపకు మనుభవామృతమున్. 2

శిష్టులకు శివభక్తిగలపరి
తుష్టులకుఁ, బరమార్థపద్ధతి
నిష్టమున సాధించుసాధుల కింగితజ్ఞులకున్
అష్టమదముల నడఁచి సద్గుణ
వేష్టితులునై సతతమును సమ
దృష్టి గలమాన్యులకుఁ దెల్పుము దీని విశదముగన్. 3

బాలకా! త్వంపదపులక్ష్యము
నోలిఁ దెల్పితి నీకు; నిత్యవి
శాలనిస్సీమాఖిలామలసాక్షి నిర్గుణముక్
మూలభూతప్రకృతి పరతర
కాలకర్మాతీత బ్రహ్మమె
పోలఁ దత్పదలక్ష్య మగు విను పుత్ర! తథ్యముగన్. 4

మాయాత్రిపుటికిరూపు; త్రిపుటీ
కాయము జగజ్జీవకరణ ని
కాయ మది భోగంబు భోగ్యముఁ గ్రమతభోక్త యగున్;
ఈయశేష మశేషమైనపు
డాయదార్థస్వప్రకాశ మ
పాయరహితమునై వెలుంగును; బ్రహ్మ మదియ సుమా! 5

అనఁగ: శుకముని "మాయ యన నే
మనఁగవలె? నీజీవజగ మె
వ్వనివలన నేహేతువున నిటు వఱలుఁ దెలుపు" మటం
చనఁగ, "రజ్జువునందు సర్పము
గనినయటు లది యింద్రజాలముఁ
గను మరీచికజలమునై వడిఁ గాంచఁదగుఁ దనయా! 6

ఆదిమధ్యాంతము లఱినచల
పాదిమాయను దెలియ హరిబ్ర
హ్మాదులకు దరమా! యనంతపరాంతకల్పములన్
వాదు లందఱుఁ బోరి దుష్కర
వాదములపాలైరి నిజ మిది
గాదు మిథ్యారూప మని మదిఁ గానరైరి సుతా! 7

ఈవిధంబుగఁ గల్లమాయయె
యావరణవిక్షేపశక్తులు
గా వెలయు రెం డగుచు; నందు నఖండవస్తువునే
యావరింపఁగఁ జాలునదియే
యావరణశక్తి యగు; జగమును
జీవులను సృష్టించునది విక్షేపశక్తియగుర్. 8

తనయ! మాయవిధంబు నెల్లను
వినుము, తెలిపెద జగము మాయా
జనిత మగు తెఱఁగెఱుఁగఁ జెప్పెద; సగుణబ్రహ్మము చే
తనె, గలిగి మిథ్యాప్రపంచం
బొనరఁ గనఁబడుగతి వచించెదఁ
దనరుపంచీకరణతత్త్వ విధానముల నీకుర్. 9

ఆదిమధ్యాంతములులేని, యా
భేదనిర్గుణనిత్యనిరతా
మోదసహజావ్యక్తచిత్పరిపూర్ణుఁడై తగు, నా
నాదరూపునిలోనఁ గల్గె వి
వాదమయశబ్దంబు దానసె
యాదృశంబై తగుప్రపంచంబెల్ల నుదయించెర్. 10

తనయ! 'తత్'' వాచ్యమున శబలతఁ
గనినబ్రహ్మను గల్గె, సదస
త్తనఁగ వ్యక్తావ్యక్త; మందున నామహ; త్తందుం
బొనసి త్రిగుణాత్మిక మహంకృతి;
దనరె వైకారికము సత్త్వం
బునను; రజమునఁ దైజసము; తమమునను భూతములుర్. 11

తనయ! విను మవ్యక్త మెయ్యది
యన, ననిర్వచనీయమాయయె;
ఘనమహత్తత్త్వంబు వొల్చును గర్భవతివోలెన్;
వినుము! వైకారికమె యల మన
సనెడుకరణము; తైజసమె కను
మనఘ! తన్మాత్రలు; ధరాదులు నయ్యెభూతములున్. 12

వినుము, మాయాకృతి యగునహ
మ్మునఁ గలుగు తన్మాత్ర; లందునఁ
దనరఁ బుట్టెను భూతపంచకతత్త్వ; మద్దానన్
కనులఁ దోఁచుసమస్తసృష్టిగ
నొనరె నీసచరాచరంబులు
మనెడునీపృథ్వ్యాది భూతాత్మకజగం బెలమిన్. 13

పొరసి భూతాంశములు పంచీ
కరణమున స్వేదజధరిత్రిజ
వరజరాయ్వండజము లనగాఁబడుఁచతుష్కంబున్;
ధరగగనజల, వనచరంబులు
చరములును; పంచీకృతంబులు
తరులతాగుల్మము, లచరములు దాన జనియించెన్. 14

దశగుణం బగు నీరు భూమికి;
దశగుణం బగు వహ్ని నీటికి;
దశగుణం బగు గాలి వహ్నికి దాని కాకసమున్;
దశగుణం బగు నగణితములై
విశదము లగునహంమహత్తుల
వశత సప్తావరణముల నేర్పడెఁ ద్రిలోకంబుల్. 15

పంచభూతాంశంబు లొండొక
టెంచ వినిమయమౌట దగ జని
యించెఁ దత్త్వసమూహ మన, మఱి యిట్లె యద్దానన్
మించి భౌతికజాతిభేదముఁ
గాంచె; పంచీకృతములుగ జీ
వించుప్రాణులసృష్టి యయ్యెను వినుతు నద్దానిన్. 16

చెలఁగఁ బంచీకరణ మనునది
తెలియఁ జేసెదఁ దెల్ల మగున
ట్లిలను మొదలుగఁ బంచభూతము లడవిభాగములన్
గలుగుబహువిధతత్త్వసంతతి
వలనఁ గలుగుప్రయోజనంబుల
ఫలము; తత్తన్నామ మధిదేవతలఁ గ్రమ మొప్పన్. 17

ధరణి మొదలగుపంచతత్త్వము
లరసి నగ మొనరించి దానన్
బరఁగునై దర్ధముల నొక్కొకభాగమున నాల్గా
తెఱఁగు భాగముఁ జేయ నవి యవి
జెరసి వింశతి యగును; మొదటివి
పౌరయు, నం దిరువదియునై దై మొనసెఁ దత్త్వంబుల్. 18

తెలియ నభమే జ్ఞాత; భూతకళ
కలయ నభమగు; చిత్తమేర్పడు
జలముఁ జేరఁగ; నగ్నిభాగము గలసి బుద్ధి యగున్;
కలయ వాయువు మన సగును; నీ
లలిఁ గరణములు వ్యోమతత్త్వము
వలననే క్రమ మొప్పఁగా నుద్భవము లయ్యె సుతా! 19

వ్యాన మది మారుతముచే, ప్రా
ణానిలము భూభాగమునను, న
పాన మది జలమునను, నగ్నిని వడి నుదానంబుగా,
ఆనభమున సమాన మయ్యెను;
గానఁగా వాయ్వంశమున ని
ట్లనువిధముల ప్రాణములు జనియించె విను తనయా! 20

నేత్ర మది యనలమున; ఘ్రాణము
మాత్ర మయ్యెను ధరణి చేరఁగ;
పాత్రమయ్యెను జిహ్వ వహ్నికి వారి కలయుటచే;
గాత్రచర్మము గాలి కలయిక;
శ్రోత్ర మంబరకళను బుట్టెను;
నేత్రముఖ్యాన్యేంద్రియము లన్నియు నెగడె నగ్నిగా. 21

జలముమాత్రముచేత రస; మా
జలము భూకళ కలసి గంధము;
జలము నగ్నియుఁ జేరి రూపము; స్పర్శ మాగాలిం
గలసి; శబ్దము నభము చేరుటఁ;
దలఁప నీవిషయంబు లైదుగ
నలరె నిటు జలతత్త్వసారమునందు జనితములై. 22

ఇల నొకట పాయువు; జలంబును
నిలయుఁ జేరఁగ గుహ్య మయ్యెను;
కలసి యనలము పాదమయ్యెను; కలసివాయు వటుగా
వెలసె పాణిగ; నభము దానికిఁ
గలసి వా క్కగు; మూలతత్త్వం
బిలయ; నీకర్మేంద్రియంబులు నేనూ విలసిల్లెగా 23

ధరణి జల వాయ్వగ్ని నభముల
వరలు భాగముచేతఁ గలిగెను
పరఁగ జ్ఞాతృరసాక్షిపాయు వ్యానపంచకముల్
పొరసి వ్యోమాంశమున మఱి క
న్బఱచె వినువాక్శబ్దకర్ణము
లురుసమానము, లనఁగ నాఱై యొనరు తత్త్వములన్. 24

కలసి మరుదంశములు త్వక్సా
ర్శ్వలును, ప్రాణె మనస్సు; వహ్నినిఁ
గలసి పాదోదానబుద్ధులుఁ గన్నె రూపంబుల్;
జలము కలయుటవలన గుహ్య, మ
టులనె జిహ్వాపానమనసులు;
గలిగె భూభాగమున నాసా ఘ్రాణ మనుకృతులున్? 25

కరణములునై, దైదుజీవము
లరయు నింద్రియపంచకము, న
త్తెఱఁగు విషయములైదు కర్మేంద్రియములైగు, మఱిన్
ధరణి జలవాయ్వగ్నినభములు
పొరసిచేరఁగఁ బంచవింశతిఁ
బరఁగె పంచీకరణ మనఁగా బాలకా! తెలియన్ 26

నాద మంబరమునకు; స్పర్శము
నాదమును గాడ్పునకు; వహ్నికి
నాదరూపస్పర్శములును గనంగ విషయములౌ;
నాదరూపస్పర్శరసములు
పాడుగాను జలమునకుఁ; బృథ్వికి
నాదరూపస్పర్శరసగంధములు విషయంబుల్. 27

కరణముల కధిదేవతలు హరి
హరవిరించిశశాంకులును; ది
క్సురుదరుణు లశ్వినులు నధిపులుగాఁగ నింద్రియముల్
వఱలెఁ; గర్మేంద్రియములకు సుర
వరుఁడు మృత్యువు నగ్ని గుద్రుఁడు
హరియు నధిదేవతలుగాఁ దా మలరుచుంద్రు సుమా! 28

భూతపంచకమున కధీశులు
ధాతృహరిరుద్రేశు లావి
ఖ్యాతయీశుఁడు సదాశివాఖ్యుఁడు; కఠిన, ద్రవ, ఘాతో
ష్ణాతిశయగుణయుతులు వారు; మ
హీతలాంశఁ, బస్థిచర్మము
లై తనరె మఱి రోమనాడులు నటులె మాంసంబున్. 29

కుదురు రుధిరశ్లేష్మశుక్లము
పొదలు మేధము నీటియంశము;
గదియు క్షుధతృషమాంద్యనిద్రలు గనఁగ సురతం, బీ
పదిసగంబును వహ్నియంశము;
ఒదిర! క్రియలు సమీరణాంశము;
ముదురు కామాదులు నభోంశముఁ బూని పొలుపొందున్. 30

వినుము! తత్త్వము లన్నియును జే
తనము చైతన్యాత్మచేఁ గని,
పనులఁ దగి వర్తించునిక్రియఁ బరఁగుఁ గనుఁగొనఁగన్;
ఘనచిదాత్మనిజ్యోతితత్త్వము
లను బ్రతిఫలింపంగ, నవె యా
ఖ్యానదలఁప నధిదేవతలు నన నెసఁగు నామములన్. 31

పంచకోశము తత్త్వమయ మని
యించెఁ, గన దేహముల రెంటినిఁ
గాంచె నది, స్థూలమున సూక్ష్మముఁ గాఁ దనరు నవియున్ ;
ఎంచ సత్త్వరజస్తమంబుల
మించెడునహంకృతియు, తా వ
ర్తించుఁ గర్తయుఁ గర్మ క్రియ యయి తెలియఁ జిత్రముగన్ . 32

సదమలానందైకరసమునఁ
బొదవి జ్ఞానే నామరూపము
లొదవఁగా, బ్రహ్మాండతండము లోరసి ప్రచురంబై
అదిర! బుద్బుదగతులఁ జూపదు
నదె సుమీ! మాయావిలాసము;
పదరి విధిహరిహరసురాదులఁ బరవశులఁ జేసెన్. 33

"గురువరా! మాయను దరింపఁగ
హరిహరబ్రహ్మలకు సైతము
తరముగా దెన్నటికి ననుచోఁ దామసుఁడు, నల్పుఁడ్,
నిరతవిషయభ్రాంతు, లాశా
పరులు నౌమానవుల కగునే
నిరవధియు నిస్సీమ మగుభవనీరధిని దాఁటన్ ?" 34

"ఆలకింపుము, తనయ! మాయకు
మూలమట్టము లేదు, మిథ్యా
జాలమది యవిచారసిద్ధము సత్యదూరంబున్
లీలమై గజభుక్తమౌనొక
మేలిమైనకపిత్థఫల మటు
పోలు నత్తగ రిత్తభ్రాంతిగఁ బుత్ర! పరికింపన్. 35

నీలరుచి యభ్రమున; దీప
జ్వాలలోపల నలుపు ప్రభతోఁ
గ్రాలుచంద్రునిలోఁ గళంకము గతినిబ్రహ్మమునన్
లీల మిథ్యామాయ తోఁచుచు
నోల లాడుచుఁ గప్పి కనఁబడు
మేలి తథ్య మనంగ నయ్యది మిథ్యయే యయ్యున్. 36

ఇదె యనుచుఁ బ్రత్యక్ష మిడ నె
వ్వదిని నిజమని తోఁపజేయును;
నదియె గురుముఖమున గ్రహింపఁగ నగును లే దనఁగన్;
సదసదాత్మిక మైనమాయను
విదితముగ వచియింపరామిని
నది యిటే యని తెలుపఁ దలఁపఁగ నలవిగాదు సుమా! 37

హరిహరబ్రహ్మాదులును, నీ
కరణి వెలసెడు మాయ గెలువఁగ
సుప్రయత్నము లూని యజపాయోగసాధనలన్,
చిరముఁ గైకొని దాని సుంతయుఁ
బరిహరింపఁగ లేక తుదఁ ద
చ్చరణయుగము సమాశ్రయించిరి శరణ మీ వనుచున్. 38

అదినిమిత్తం బష్టసిద్ధుల
కెద భజించుచు నా దయామయి
పదపయోజరజఃప్రభావము వార లందుటచేఁ
దదధికానుగ్రహముకతమున
నెదిగి రాహరిహరవిధాతలు
విదితముగ సత్త్వాదిగుణముల విశ్వవంద్యులై. 39

ఆదిమాయానైజ మగు స
ర్గాదికర్మస్థితులు మిథ్యా
పాదితము లగుబ్రహ్మసన్నిధిఁ బడయురూపంబుల్
మీఁదహృత్కర్మేంద్రియంబులఁ
బ్రోదిగాఁ గొని జాగ్రదాదులఁ
జాదుకొలుపు నహంకృతియె తుద బహ్మమం దడఁగున్ ! 40

తను నెఱుఁగనియవిద్యచేతన్
జనన మయ్యె జగం బదెట్లన,
తననిదురఁ దాఁ బండియుండఁగఁ దపులు కలవో లేన్;
తననిజముఁ గన, నేకమై తగు
వనధిఁబోలుచు నీసమస్తము
దనయుదరమం దణఁగఁ బూర్ణాద్వయతఁ దా నొప్పున్. 41

ఈవిధం బగుమాయ గెలువఁగ,
భావశుద్ధినిఁ బొంది, గురువర
పావనాంఘ్రులఁ బట్టి, తత్కృపఁ బడసి, ధన్యుండై
జీవపరమాత్మైక్య మనెడు మ
హావిశేషానుభవ మొందుటె;
భావమునఁ గన వేఱుపాయము పార దెయ్యెడలన్. 42

గురునియుపదేశమున, మాయా
వరణ మడఁచి మతాంతరపునం
చరణసంశయ మీఁగి కర్మాచరణ మేర్చి, తగన్
చెఱిచి జన్మజరాభయంబుల
మరణమును, మఱి స్వప్నబంధముఁ,
దరువ సహజానందపదమునఁ దవిలి సుఖ మొందున్. 43

నెగడుమూలప్రకృతి యనఁగాఁ
దగినమాయాగుణము లగుఁ జే
వగలవిద్యావిద్య లనెడు నుపాధికృతయుతమౌ
సగుణ మగు జీవేశ్వరులఁ దగఁ
దగిలియున్న నుపాధిపద్ధతి
తెగినచో, నద్వైతబ్రహ్మము తెల్ల మగుఁ దనయా. 44

గ్రామదేశద్వీపములఁ గల
వ్యోమ మొకగతి నుండుకైవడి,
నీమనుజపశుపక్షితరులం దెల్లసురలందున్,
భూమి మొదలుగఁ గల్గుభూత
స్తోమమున హారమున సూత్రము
నేమమున సమగతినిఁ దోఁచుచు నెగడు బ్రహ్మము సూ! 45

తరులతాదులరసము; ప్రాణులఁ
బరమచైతన్యంబు; గాడ్పున
నరయ బలమును; నీట రుచియును నవని గంధంబున్;
తరణిశశిపావకులలో వి
స్ఫురితతేజఃపుంజ, మాయం
బరమునన్ శబ్దం, బదెల్లను బ్రహ్మమే తనయా! 46

బింబమును ప్రతిబింబమును మృష
లంబరపురవిపట్లు; నటులె, ని
జంబు కల్పితు లరయజీవేశ్వరులుఁ దలపోయన్
డంబు గానని నిస్తరంగచి
దంబునిధివలె బ్రహ్మ మెసఁగి దృ
ఢంబు నిత్యానందమఁ డగున్మ, కడంక విను తనయా! 47

ఘటమఠంబులఁ గల్గుబయలును
ఘటమఠంబుల బయలటందురు:
ఘటమఠంబులు చెడఁగఁ బేళ్ళవి కలవె బయలునకున్ ?
అటమటబ్రహ్మాండతతులును
నటులెపిండాండములు నడఁగఁగ
ఘటమవర్ణ్యబ్రహ్మ మగు, నది తెలియు మీవు సుతా. 48

ఆవముఁదునఁ గ్రాఁగుఘటముల
తేవ నీబ్రహ్మాండతండము
భావ మెంచ, ననంత మగు శశ్వత్ప్రకాశమునన్
జేవఁ గని చూపట్టు ననిశం
బావిరాజవిభాప్రపూర్ణము
హావిభవవిస్ఫూర్తియే బ్రహ్మం బగును తెలియన్. 49

ఎండ నభమునఁ గనఁబడక, భూ
మండలంబున గ్రామపురముల
నిండి వెల్గెడిరీతిఁ, బూర్ణత నెగడి సర్వమునం
దుండి కొన్నిట గోచరముఁ గా
కుండి, కరచరణాదులను గను
పండువుగ వెలుఁగొందుబ్రహ్మము వత్స! పరికింపన్. 50

అణువునం దణువగుచు నణఁగును;
గుణనిధీ! తనువునను తనువై
మణఁగి తగినటు లుండుఁ గద! బ్రహ్మాండమందెల్లన్
గణనసేయ మహత్తగుచు న
నమ్రణులలో నభమట్లు వెల్గుచు,
గణనమీఱు ననంతమే సుమి! కనఁగ బ్రహ్మ మగున్. 51

క్షీరసాగరమందు బహుళా-
కారములు నగుజలచరంబులు,
క్షీర మాధారముగఁ బ్రతికెడు చెలువునన్, జగతిన్
భూసురనరతిర్యగాది శ
రీరములు జీవించు నెవని యా
పారసుఖసాగరమునం, దది బ్రహ్మ మగుఁ దలఁపన్. 52

ప్రాణితతిలో వెలిని ముఖ్య
ప్రాణ మగుచును బరఁగెడుజగ
త్ప్రాణు కైవడి, నన్నిటన్ జైతన్యరూపమునన్
ప్రాణమయి యవ్వాని మోయుచు,
నానైమ్మై కొలశేని దగు, ని
ర్వాణసర్వవ్యాపియై, పరబ్రహ్మమై యొప్పున్. 53

విను, మయస్కాంతంబు సన్నిధిఁ
గని చలించెడుసూదిమాత్రమె;
కన, నయస్కాంతము చలింపదుగాదె? యాపగిదిన్
ఘనజగజ్జీవంబు లెవని వ
లనను వ్యవహారములు సలుపునో?
తనయ! యామహనీయశక్తియె తలఁప బ్రహ్మ మగున్. 54

ఒకఁడె మామయుఁ, బితయు, మఱఁదియు,
సకల మగునటు, భిన్న రూప
ప్రకటజీవేశ్వరసమష్టివ్యష్టిరూపములన్
ఒకటెఱుక మిథ్యలగునామా
యికములన్ గని సర్వభూత
ప్రకరములఁ గనఁబట్టుచుండును బ్రహ్మ మదె తనయా! 55

పరమునకుఁ బరు, లక్షరక్షర
పురుషు లీప్రకృతిని వసించెద
రరయ క్షేత్రజ్ఞుఁడును క్షేత్రము లగుచు, దృగ్దృశ్య
స్ఫురణజీవజగత్స్వరూపము
లౌరిమ, భోక్తయు భోగ్య మనునీ
తెఱఁగు వారలకంటె శ్రేష్ఠుఁడు తెలియ బ్రహ్మ మగుఁ. 56

ద్రవమధురపరిశుభ్రతాన్విత
మవుఁగదా! గోక్షీర మొకటే
వివిధమైతగినట్లు సచ్చిద్విమలసుఖమయమై
యవిరళంబు, ననంతమైఁ తగు
దివి పగిది సువిశాల మగుచును
నవధి గానక యుండు బ్రహ్మం బరయఁగాఁ దనయా! 57

ఆవరించి సమస్తజగములఁ
దా వెలసి లో బయట నెల్లెడ
నీవిధిగ నెది యొనఁగెడినో? యదియే సగుణమగుఁ బ్ర,
హ్మావియల్లత కేది యావి
ర్భావమూలమొ? యట్టిదాన
ర్భావముతచిద్వ్యోమమే విను బ్రహ్మమై పరఁగుఁ. 58

ఖరకిరణుఁ డాదిగను దేజో
భరితు లగుపావకశశాంకులు
హరిహరాదులు నెవనిదీప్తుల నందు వెలిఁగెద రా
కరణముల కిరణముల నేమియు
నెఱుఁగ కప్రతిమప్రభావి
స్ఫురితతేజోరాశి యెది? యదె సూవె, బ్రహ్మ మగుఁ. 95

వెలుఁగ దోసుత! యీప్రపంచము
తెలియ స్వయముగ మున్ను; కలుగ, ద
వల నడంగినపిదపఁ; గన్పడు వర్తమానమునన్;
కలుగ కుడుగక సహజమై ఖరి
గలిగి వెలుఁగుచు మూఁడుకాలం
బులను మిఱ్ఱి నతంబు బ్రహ్మము పుత్ర! పొలుపొందున్. 60

ఎండమావులలోన మిథ్యగ
నుండుసలిలాంశమును విడ, నిజ
ముండునట్టిమరీచికాంశం బొకఁడె నిల్చుగతిన్,
దండివెల్గెడునామరూపము
లుండుమాయాంశములఁ ద్రోయ, న
ఖండ మగుచిత్సుఖమె బాలక! కాంచ బ్రహ్మ మగున్. 61

త్రాఁడు పామటుదోఁచఁ, దెలివిని
జూడఁజూడఁగ పాముగా కది
త్రాడె యగునటు, నిజపదార్థము దలఁప భ్రాంతిని నీ
రేడుభువనములట్లు చూపున
నాడు, మది విభ్రమముఁ దొలఁగిన
తోడఁ, దాఁ దానైన వస్తువె తుదకు బ్రహ్మ మగున్. 62

చేసిచూపఁగ నింద్రజాలము
నాసమెయిఁ గనువారు నిజ మని
మోసమునె భ్రమియింత్రు; గారడి పొల్పుఁ గల్లనుచున్;
ఆసరణి భూభువనములఁ గడు
మోసగించుచుఁ గపటమోహపు
టాస నిడుమాయకును మీఁ దగునదియె బ్రహ్మ మగున్. 63

లోన పిండాండముల, నీబయ
లూను బ్రహ్మాండముల, లో వెలి
నాని నిబిడీకృతము నౌమాయావిశేషమునన్
బూని వెలిఁగెడి వివిధభేద వి
ధానసగుణబ్రహ్మరూపవి
ధానఁ గడు వెలుఁగొందునది యే తలఁప బ్రహ్మ మగున్. 64

ప్రకృతి నైక్యం బగుచు బ్రహ్మము
ప్రకృతిసుఖదుఃఖములఁ బొందని
రక మెటుల నన, సుఖమయాత్మాశ్రయపుబుద్ధికినాన్
నికరమగుతత్ప్రకృతి కెన్నఁగ
సుకము దొరకొన దింతె నిజ మిది
వికృతి నొందనిసంగరహితము వినుము బ్రహ్మమగున్ 65

ధర, నుమంబరతరువు తుది మొద
లురలఁ గాచెడుఫలములట్టుల
నరయ మూలప్రకృతిలో బ్రహ్మాండవితతులు గ్రి
క్కిరిసి నిబిడీకృతములగు నని
మొరగుశ్రుతతి నిక్క మని నీ
వెఱుఁగుమా! ప్రకృతికి నిజాశ్రయ మెంచ బ్రహ్మ మగున్. 66

ఎఱుఁగ బ్రహ్మ పిపీలికాంతముఁ
బరఁగు ప్రాణులబుద్ధిభావన
కెఱుకపడకయు, సాక్షి యగుచును నెసఁగు నేవిభుఁడో,
కరణతతు లవి యెవనివలనన్
బరివరిగ వర్తింప నేర్చునో?
అరయ వాని నిమిత్తకారణ మదియు బ్రహ్మ మగున్. 67

చాలఁబొగడెడు శ్రుతితతులు విను
బాలకా! నిత్యము, ననాది, వి
శాలనిజపద మదియు తా మనుసంయమీంద్రులును౯
దాలిచి మనోజ్ఞమునఁ బలుకం
జాలక యె మౌనమున నుం, ద్రా
మే లతీంద్రియచిద్ఘనం బే మెఱయు బ్రహ్మముగ౯. 68

దేశకాలముదాఁటి జన్మ
క్లేశపాశము మీఱి నిబిడా
కాశమటుల నిరావరణ మయి కాంచఁ బూర్ణంబై
ఆశ నెఱుఁగనివిద్య తేజో
రాశియే నిర్వాసనము బ్ర
కాశమున్నై సత్యమై తగుఁగాదె బ్రహ్మ మన౯. 69

నిరుపమ, నిరాలంబ, నిర్గుణ
నిరవధి, నిరాంతర, నిర్మల
నిరతిశయ, నిశ్చల, నిరంజన, నిర్వికారంబు౯,
పరతర, నిజానంద, పావన,
పరమపద, పరిపూర్ణ పరచి
త్పర, సదద్వయమైన పరమార్థంబె బ్రహ్మ మగు౯. 70

ఇటుల తత్పదలక్ష్యమును బ్ర
స్ఫుటసుదృష్టాంతములఁ దెలిసెదు
నటుల దెలిపి, సమస్త మగుమాయల భ్రమం బుడుగ౯
దిట మపారానంతమును హృ
త్పుటమునందు స్మరింపు మన ను
త్కటముగా ధ్యానించెఁ దద్గతి కాంచు మెయి శుకుఁడు. 71

నాదబిందుకళావినోద! వి
భేదవిరహిత! మౌనివినమిత
పాద! నిత్యప్రభావిశ్లేషణ పరమగుణపూర్ణా!
శ్రీదయిత! చిదచిద్విలాసక!
వేదవిశ్రుత! విశ్వపిత! ని
ర్వాదనిత్యబ్రహ్మ! వేపలపర్తి శ్రీధామా! 72

## నాలుగవ అధ్యాయము

## తత్పదార్థశోధనము

## సమాప్తము.

---



# అనుభవామృతము

## ఐదవ అధ్యాయము

## అసిపదార్థ నిర్ణయము

శ్రీమనోహర! వరశుభాకర!
సామగానవిలోల! సుందర!
వామనా! రిపుభంగ! వేపలపర్తి శ్రీరంగా!
నామరూపవిలాస! సజ్జన
కామితా! అవధారు; పిదపన్
ప్రేమచే వ్యాసర్షి యిటు చెప్పెను శుకునితోడన్. 1

పరులదూషణఁ జేసి, తను ఘన
తరముగాఁ బొగడుకొని, యుబ్బుచు
గురునిఁ దెగడుచు, ఛలబలాధికకులమదంబులను
మరిగి, యరిషట్కంబువలఁ బడి,
నిరతశిశ్నోదరపరత, సుఖ
మరయుదుష్టులఁ గుడువనీయకు మనుభవామృతమున్. 2

ఇతరమతముల విడిచి, తత్త్వము
నతిశయంబుగ నభ్యసించెడు
మతియుతుల, నాచారపరులకు నోటియు శాంతులకున్,
శ్రుతిగురులయెడ భక్తియుక్తుల,
కతులగతి నాసించుసుకృతా
త్ముల కెలమిన్ ధారవోయుము! యనుభవామృతమున్, 3

పోలఁ దెల్పితి తత్త్వములలో
మేళ మగులక్ష్యార్థమును, విను
మోలి వాచ్యార్థమున, విద్యల, నాగి నవిద్యలచే
గ్రాలఁ గలజీవేశ్వరత్వము
తాళి కించిజ్జత్వమును మఱి
లీలతో సర్వజ్ఞతాదుల లీన మగు బ్రహ్మన్.

తలఁప సత్త్వరజస్తమము లన
జెలఁగు మాయాశక్తిగుణముల
వెలసె భేదము దాన విద్యావిద్య లన, రెండై;
అల యవిద్యయె కర్తృరూపము;
చెలగెఁ విద్యయె సత్త్వసంపద
నలరె సుమీ! సర్వజ్ఞతాదిషడంగరూపమునన్. 5

శైవ వైష్ణవ, మతము లనఁగ, న
వేవి యున్న షడంగసద్గుణ
భావభిన్నము లైన వంతయె వస్తుభేదములున్
లేవు; శ్రుతితతు లరయ 'నేకో
దేవ' యని ఘోషింప వే? మా
యావిలాసమువలన భేదం బంతె, లే దొండున్. 6

వెలుఁగుశుద్ధస్ఫటికసన్నిధి
నల జపాకుసుమాదిపుష్పా
వళి కలుగ, పటికంబు తత్తద్వస్తువర్ణములన్
వెలయునటు, నిజవస్తుగుణసం
కులపుబుద్ధిప్రవృత్తి తనలో
వెలయు, బహువిధభేద మొందినవిధమ్మునం దోఁచున్. 7

అంబరపుశశి, కుంభపరిపూ
ర్ణాంబువులమధ్యమునఁ దాఁ బ్రతి
బింబచంద్రులు పలువురై నటు వెలుఁగురీతిగనే
అంబుజాసనుఁ డాదిగా, నా
కంబ మాదును, సర్వజీవక
దంబ మగుచుఁ దనరు చేతనతత్త్వ మొక్కటియే. 8

వినుమ విద్యోపాధిచేతన్
దనయా! కర్తృత్వంబుఁ దనలో
గనుచు తనుకరణాదిగుణసంగతి నహంకారం
బునను స్థూలుఁడఁ, గృశుఁడ బాలుఁడ
ననుచు, వృద్ధుఁడ ననుచు, తెలిసితి
ననుచు, మఱచితి, సుఖిని దుఃఖిని ననుచుఁ జింతించున్. 9

దోసములగుమి, క్లేశయుతదు
ర్వాసనాంచిత మైనతనువున
నాసఁగొని, యద్దాన మోహమునంది మరుఁలమొయిన్
గాసిపడునీ దేహధర్మపు
దోసమును గల్పించి తనలో;
దాసనము జతగూడుమఱియుటు దనరు జీవుఁడొగిన్. 10

తనదుసహజానంద మగుచే
తనముఁ దనువున నన్వయించుచు
ననసి యన్యోన్యంబు వినిమయ మెసఁగి క్రాగిన పే
రిను మన; జరామరణభూయో
జననకర్మలఁ దవిలి, కష్టం
బును గుడుచుచును సతము నిహాపరములను దుఃఖించున్. 11

ఈపగిది బహుజన్మకర్మవి
లేపనమ్మున, తెగనిసంసృతి
కూపమునఁ బడి, మునిఁగి తేలుచు గుయ్యిడుచు మిఁకిలఁ
గాపథంబున నడచి చెడును
దీపితం బగుతత్పదంబును
బాపురే! కననీ దవిద్యాప్రౌఢ గుణమహారా! 12

లేదు జీవత్వంబు, దుఃఖము
లేదు సుమి! యాత్మకు; జలంబున
బాదుగానురవినీడ జలకంపము తెరల్ కయిచల్
మైదవులు; నిజరవికి లే వటె
నాదబిందుకళాతిరిక్తము,
వేదవేద్యము, సంగరహితము వినుము! బ్రహ్మ మగుః. 13

లింగదేహము నొందియును ద
త్సంగ మెఱుఁగఁడు; నభము కుంభము
సంగతిని గని కూడి యాడి నెసంగుచుండుక్రియః
లింగదేహముతోఁ దవిలి వెత
లం గనుచు బహుజన్మముల, నది
భంగమైన నఖండచిన్మయుభవ్యరుచి వెలయుః. 14

ఆహా! వేసము లట్టిజన్మల
దేహములు సుఖదుఃఖకరములు
దేహధారుల కెపుడు నాత్మపు దేహసంగతిచేః
మోహమును గొని మాయసృష్టికి
దేహి యూనఁబడి మఱచి తాఁ దను
ఆహా వడరినచంద్రదముఖము తెఱంగుగా నుండుః. 15

అంకె తెలియనిరాజ్యమును, ని
ష్కంకఁ బరిపాలించుభూపతి
మంకువడి తా లెంక యనుకొనుమాడ్కి ముక్తుఁడుఁ
గొంకుకొఱఁతలు గానవట్టి ని
రంకుశం బగుబ్రహ్మమే తా
సంకెలలఁ బడునట్లు కింకరసదృశుఁడై యుండున్. 16

లింగతను వరయుంగ చిచ్ఛా
యం గలసి చేతనమనం బడి
భంగపడు సుఖదుఃఖముల సంప్రాప్తకర్మములన్;
అంగరహితుఁ, డఖండచిన్మయ
సంగవిరహితనిజనిరంజన
మంగళాత్ముఁడు దుఃఖ సుఖములమాటువడఁ డయూఁ. 17

సంగదోషముచే సుగుణి దు
స్సంగి యనఁబడునట్లు, జీవుఁ డ
సంగఁబడు నా సంగదూరుఁడనంతుఁ డవ్యయుఁడున్
లింగసంగము నొంది దుఃఖిత
రంగముల నోలాడు, లింగము
భంగమొంద నఖండనిశ్చలబ్రహ్మమై యొప్పున్. 18

మఱచి నిజరూపంబు సద్గురు
కరుణ నది కనుఁగొంటి ననుటకు
నెఱుకమఱపులె యాత్మ? కది మది కెనయుమఱపె యగున్
ఎఱుకమఱ పది కాదు, రిత్తగ
నెఱయు మెఱుఁగయి వఱలుచుండెడు
కరణములలో నెఱుకమఱపులుగాఁ గనంబడుచున్ 19

ఈపగి దిబహుజన్మకర్మవి
లేపనమ్మున, తెగనిసంసృతి
కూపమునఁ బడి, మునిఁగి తేలుచు గుయ్యిడుచు మిఁకఁ
గాపథంబున నడచి చెడును
ద్దీపితం బగుతత్త్వదంబును
బాపురే! కనని దవిద్యాప్రౌఢ గుణమారా! 12

లేదు జీవత్వంబు, దుఃఖము
లేదు సుమి! యాత్మకు; జలంబున
బాదుకొనురవినీడ జలకంపము తెరల్ కయిచల్
మైదవులు; నిజరవికి లే వటె
నాదబిందుకళాతిరిక్తము,
వేదవేద్యము, సంగరహితము వినుము! బ్రహ్మ మగుఁ. 13

లింగదేహము నొందియును ద
త్సంగ మెఱుఁగఁడు; నభము కుంభము
సంగతిని గని కూడి యాఢి నెసంగుచుండుక్రియన్
లింగదేహముతోఁ దవిలి వెత
లం గనుచు బహుజన్మముల, నది
భంగమైన నఖండచిన్మయభవ్యరుచి వెలయున్. 14

ఆహా! వేసము లట్టిజన్మల
దేహములు సుఖదుఃఖకరములు
దేహధారుల కెపుడు నూత్న్నపుదేహసంగతిచే;
మోహమును గొని మాయసృష్టికి
దేహి యానఁబడి మఱచి తాఁ దను
తాహు వడరినచన్మదసుఖము తెఱంగుగా నుండున్. 15

అంకె తెలియనిరాజ్యమును, ని
శ్శంకఁ బరిపాలించుభూపతి
మంకువడి తా లెంకయనుకొనుమాడ్కి మున్నెందుఁ
కొంకుకొఱఁతలు గాననట్టి ని
రంకుశం బగుబ్రహ్మమే తా
సంకెలలఁ బడునట్లు కింకరసదృశుఁడై యుండున్. 16

లింగతను వరయంగ చిచ్ఛా
యాం గలసి చేతనమనం బడి
భంగపడు సుఖదుఃఖముల సంప్రాప్తకర్మములన్;
అంగరహితుఁ, డఖండచిన్మయా
సంగవిరహితనిజనిరంజన
మంగళాత్ముఁడు దుఃఖ సుఖములమాటువడఁ డయా 17

సంగదోషముచే సుగుణి దు
స్సంగి యనఁబడునట్లు, జీవుఁ డ
సంగఁబడు నా సంగదూరుఁడనంతుఁ డవ్యయుఁడున్
లింగసంగము నొంది దుఃఖత
రంగముల నోలాడు, లింగము
భంగమొంద నఖండనిశ్చలబ్రహ్మమై యొప్పున్. 18

మఱచి నిజరూపంబు సద్గురు
కరుణ నది కనుఁగొంటి ననుటకు
నెఱుకమఱపులె యాత్మ? కది మది కెనయుమఱపె యగున్
ఎఱుకమఱ పది కాదు, రిత్తగ
నెఱయు మెఱుఁగయి వఱలుచుండెడు
కరణములలో నెఱుకమఱపులుగాఁ గనంబడుచున్ 19

ఎఱిఁగి నీవే పరముఁ డగుచో
మఱచి నీ వేమైతి వహహా!
యెఱిఁగి యొకఁడుగఁ, మఱచి యొకఁడుగ నెసఁగునే యొకఁడే?
ఏఱుకమఱపుల నంటి యెఱుఁగని
యెఱుక నీవై యుంటి; వినుమా
యేఱుకమఱపులు కరణధర్మము లింతె యగుఁ దనయా! 20

ఎఱుక లేనిజనాళి, జలదము
తరణిబింబము మాటఁగా భా
స్కరుఁడు నిష్ప్రభుఁ డన్నకైవడిఁ గరణధర్మము లా
కొఱఁతయే లేకున్నయాత్మను
మఱుగుఁజేసిన దెఱుఁగ, కజ్ఞులు
పరము సంసృతిబద్ధుఁ డందురు భ్రాంతమానసులై. 21

కరము లక్షులఁ గప్పఁగా, నా
తరణిమండల మడఁగె నన్నటు,
కరణముల మరుగైనయంతన జ్ఞానపూర్ణుండున్
పరముఁ డగునయ్యాత్మ లేఁ డనఁ
దర మె? తుచ్ఛకరణము లెక్కడ?
అరయ నెక్కడ సచ్చిదానందైకసత్యంబున్. 22

శుద్ధవిద్యోపాధి నాత్మకు
సిద్ధు లగునణిమాదులను, సం
బద్ధమగును షడంగములు సర్వజ్ఞతాగుణముల్,
బుద్ధిఁ గని సృష్ట్యాదికర్మం
బిద్ధయత్నముఁ జేసి శిష్టుల
నుద్ధరింప, హరింప దుష్టుల నొప్పుశక్తు లగున్. 23

విశ్వరూపుఁడు హేమగర్భుఁడు,
విశ్వముఖుఁ డీశ్వరుఁడు, సత్యుఁడు
శాశ్వతుఁడు విశ్వాశ్రయుఁడు, విశ్వాధివాసుండున్,
విశ్వనాటక సూత్రధారుఁడు,
విశ్వగుఁడును విరాట్స్వరూపుఁడు
విశ్వకర్తగ, పతిగ, హర్తగ, వెలసె బ్రహ్మముగన్. 24

అతని, నిశ్వాసములె వేదము,
లతనియక్షులె సూర్యచంద్రులు,
అతనియవయవతతులె సత్యాద్యఖిలలోకంబుల్;
అతఁడె యింద్రుఁ డతండె దేవ
వ్రతతి; విశ్వములోన వెలుపల
నతఁడె పరిపూర్ణుండు విశ్వము, నావలను నతఁడే. 25

ఈ పగిది బహుగుణవితతిఁ, బలు
రూపు లనఁగ, ననంతనామము
లా పరమపురుషునకు శ్రుతితతు లాడెఁ బలుగతులన్;
తాపకారణ మైనసంసృతి
లేపనము గన కన్నిరూపుల
జూపఁ గలిగె నవిద్యవశమున సూవె! తా నొకఁడై. 26

అల, యవిద్యావిద్య లనఁబడు
పలుపురులపగ్గంబు వలగొనఁ
గలఁతపడు జీవేశు లనునవి కనఁగ, వాచ్యము లౌ;
తొలఁగి యారెండౌ నుపాధు ల
వల, నఖండాద్వైతచిద్ఘన
కలితశేషమె యసిపదైక్యము కాంచుమీ తనయా! 27

ఆనెడుతండ్రికి దనయుఁ డసిపద
మనఁగ నెయ్యది? దఖండవస్తువు
ననఁగ నెట్టిది? రెంటి కైక్యం బలరు నెమ్మాత్రికిఁ ?
కనఁగ లక్షణ మెట్టు? లది నా
మన సెఱింగెడివగిది తెలుపుము!
యనుచు మ్రొక్కఁగ సుతునిఁ గని పిత యనియె నీరీతిఁ. 28

దేవజీవులభేద మనునది
భావమున నిడ నినుమొ, హేమమొ,
యేవిధము దది యైన సంకెల యెంచ బంధమె యహా;
నీవిధవుఁ బ్రతిబంధ ముఁడుగక
దేవుఁడై నను, జీవుఁడై నను,
కేవలానందైకరససంకీర్తితుం డగునే? 29

తనయా! త్వంశబ్దార్థ మగుజీ
వనపరిచ్ఛిన్నత్వ, మజ్ఞత,
వనట, మఱియు ననీశ్వరత్వముఁ బ్రత్యగాత్మతలుఁ.
అనఘ! 'తత్' శబ్దార్థ మగునీ
శునిపరోక్షానంద మొక్కెడఁ
గనము; కనుకనె భాగలక్షణ కార్య ముఁడుగ కగుఁ. 30

విహిత మగులక్షణముగ నమీ
జహాద జహాదభిధాన; తన్ని
ర్వాహణ మా యీ రాముఁ డనియెడు వాక్యమున 'నా యీ'
గ్రహణ మరయ విరుద్ధ మంశము.
సహజముగఁ గడద్రోయుచో స
న్నిహితుఁ డగుచును రాముఁ డొకఁడె నిలుచు శాశ్వతుఁడై. 31

విను, పరోక్షము తత్పదార్థము;
తనయా! త్వంపద మభిముఖార్థం;
బనెద రీపదయుగమున, విరోధాంశముల వదలఁ
దనరు సత్య, మఖండ మద్వయ,
ఘనతరానందైక్య, మసిపద
మనను సమరసమును నెఱుంగ, ముముక్షుప్రవరుఁ దగుఁ. ౩౨

ఇన్నినా ళ్ళాసీమ రాజుగ
నున్నవాఁ డీసీమ బడుగయి
బన్నములు పడువాఁ డనఁగ, సంపదయు లేమియును
భిన్నములు, దేశములు భిన్నము,
లన్నరుఁడు మాత్రం బొకఁడే; యి
ట్లెన్న నసిపద మద్వయార్థత నెసఁగె విను తనయా! ౩౩

అందు కావ్యముఁ జదివినాతం
డిందు గైతలు సెప్ప, వాఁడన,
నందు నొక్కఁడిదే పరోక్షము నభిముఖత్వ మగుఁ;
అందు నిం దనువానిఁ ద్రోయఁగ
నందు నిలిచెడివటుశరీరము
చంద మసిపద మద్వయార్థపు సామరస్య మగుఁ. ౩౪

గురుతుగలగో విడినపాలునఁ
బరఁగ దొకభేదంబునటులే
నిరత మా యీ యనెడుమాటల నెగడుభేదంబుల్;
అరయఁగా నాక్షీర మొకటే
తెఱఁగు కనఁబడునట్లు, నిజసుఖ
భరిత మసిపద మద్వయార్థతఁబరఁగుఁ దలపోయఁ. ౩౫

డంబుగా ఘటమందుఁ గనఁబడు
నంబరమె లో బయట నిండి, క
రంబు జృంభిత మగుచు నెల్లెడఁ బ్రకట మగుచుండున్
అంబుజాసన, విష్ణు శతమఖ
సాంబ ముఖ్య సమస్తజీవక
దంబముల నొకఁ డనఁగ నపివడ తత్త్వ మరయ దగున్. 36

సత్తు చిత్తానంద మనఁగఁ బ్ర
వృత్తుఁడై చను ప్రత్యగాత్మ ని
జోత్తమజ్ఞానైకనిత్యత నొప్పు బ్రహ్మంబున్;
ఉత్త దది ప్రత్యక్పరాత్మల
హాత్తు భేదము, మాటమాత్రమె;
మృత్తికయె మన్ననఁగ నపివడ తొనఁగు నర్థమునన్. 37

మాయ యనునది మిథ్య; జీవ ని
కాయమును నదబద్ధ మగు; నను
పేయమా యీ భేదబోధన మింత నిజ మరయన్,
రాయఁడే భటుఁ, డాభటుండే
రాయఁ డనుచందమున బ్రహ్మము
మాయచే జీవుండు: జీవుఁడె మరల బ్రహ్మ మగున్. 38

ఓలి, శ్రుతితతి 'తత్త్వమసి' యని
పోలఁ దెల్పెడి విను, మవిద్యా
జాల మాత్మను నావరింపఁగఁ జాల దది యనుచున్;
లీల రెండగు వస్తువులలోఁ
గ్రాలు నేకత్వమున, లక్షణ
శీలవృత్తిని బ్రహ్మమే లక్షితము నగు ననుచున్. 39

అనలుఁ డెటు లుష్ణస్వరూపుఁడో?
కనఁగ చిన్మయుఁ డావిధంబుగ
తనయ! నిత్యజ్ఞానరూపుఁడు! తత్ప్రకాశమునన్
బొనర సత్త్వతమఃప్రధానము
లనఁగ జ్వాలాధూమములగతి
జనన మయి చిచ్ఛక్తి మాయాశక్తు లిటు నెగడున్. 40

తనయ! తెలియఁగ కార్యకారణ
మను నుపాధు, లవిద్య, విద్యయు
కనఁగ మలినముఖంబు కార్యము కారణం బరయన్
విను! మఱియు సత్త్వప్రధానము;
కనఁబఱచు నివి తారతమ్యపు
గానముచే జీవేశ్వరత ముక్తునకు నిర్గుణికిన్. 41

నీ రధిక మగు నెడల నమలా
కారతన్ దగు నల్పమైన వి
కారమలినత నొందు నట్టులె కార్యకారణముల్;
నీరుగుణదోషంబు లెటువలె
నారవిప్రతిబింబమున కే
పారు, నటె జీవేశ్వరత్వ, ముపాధికృత మగుచున్. 42

కనకపాత్రకు మంటిబిందెకు
నొనరు భేదము; బయలు భేదమె?
కనఁగ నట్టులె పందిగుంటకు గంగ; కారెంటన్
తనరురవి యన్యుఁడె? యుపాధులఁ
గనుట జీవేశ్వరవిభేదం
బనఁగఁ దోఁచెను, పూర్ణబ్రహ్మమునందు కృత్రిమమై; 43

స్వాదు వొకటే నీరునకు, భూ
భేదమున బలురుచులు గలిగెడు;
నాదిలో వర్షోదకంబున కారుచులు గలవే?
భేద మయ్యెను కార్యకారణ
వాదమున; జీవేశ్వరులకున్
లేదు వ్యత్యాసంబు విను మేలేశముఁ దనయా! 44

బద్ధసూతకుఁ డనఁగ నర్థము?
సిద్ధ మాత్రము చేత నాపై
శుద్ధుఁ డగు నా శబ్ద ముడిగినఁ జూడ నటువలెనే
శుద్ధబ్రహ్మము శబ్దమాత్రన
బద్ధజీవుం, డది తొలంగ వి
బుద్ధచిన్మయుఁ డనఁగ నొప్పెడుఁ బుత్రకా! వింటే. 45

ఈవిధిని నన్విపద మఖండవు
శేవ వెలయుటఁ దెలిపి మునిపతి
జీవభేదము నుడివి, పరమవిచిత్రతర మగు నా
కేవలానందానుభవసం
భావితమె నే నను ననుభవము
నావధానమునను నిలుచునటు సలిపెఁ దనతనయున్. 46

అమలసహజానంద మేగతిఁ
భ్రమసె నీమాయాప్రబంధము?
మమత నది జీవత్వ మెందిః మార్గ మెటు లొప్పెన్?
తమక మిదు సంసార మిది నా
శమును నేఘనువలన గా. చెను?
సమత యగుచిన్మాత్ర యది మఱి సమకురెడు నెటులన్. 47

పోలఁ దెల్పుము జనక! సంశయ
జాల మది నశియింప, నన నో
బాలకా! యీశ్వరునిలీలగఁ బలుకఁదగు మఱియుఁ
మూలభూతమునౌ, నవిద్యా
జాలపాశ మటంచు గొందఱు
మేలిదైవవిచిత్రసృష్టిగ మెలఁగు నిది యనుచున్ ; 48

మతవిభేదము లైనబహువిధ
గతులఁ దెల్పుదు రందు గొందఱు
నతిశయోక్తులచేతఁ దగ దృష్టాంతపూర్వముగా!
శ్రుతివిహితసత్యాత్మునకు సం
సృతినిబంధన లే, దిదంతయు
మతికె; మిథ్యారోపణము, బ్రహ్మమున కిది తెలియన్, 49

నరుఁడ ననుకొని యీశ్వరత్వము
మఱచె రఘుపతి, బ్రహ్మనారదు
లెఱుకపఱుపఁగ విష్ణుఁడనె యని యెఱిఁగె, నాగతినే
గురునియుపదేశమున మాయా
వరణ మూఁగఁగ, నద్వయుం డీ
శ్వరుఁ డనెడుపరవస్తు వీవని న స్మరింపు సుతా! 50

తనజనన మెఱుఁగకయె రాధా
తనయుఁ డనుకర్ణునకుఁ గుంతీ
తనయుఁ డవనుచు హరి తెలుపఁదాఁ దథ్య మెఱిఁగినటుల్
కనక నీ నిజ మింత, జీవుఁడ
ననుచు వెతవడునీవు గురుకరు
ణను నిజ మెఱిఁగి బ్రహ్మ మీ వనున్యాయ్యముఁ గనుమా! 51

పదుగురన్ దను పేడి మఱి తొ
మ్మిదిగి నెంచఁగఁ; బరుల లెక్కిడి
పదుగు రంచని చూపఁ దెలిసెడిపగిది సత్యంబై
పొదలుగురువాక్యమున, భ్రమవడి
మదిని జీవన్ముక్తుఁ డే నని
విదితసత్య మెఱింగి యఁదియై వెలయుమా! నీవున్. 52

నెఱి గ్రహావిష్టుఁడు తనుఁ దా
మఱచి యుండఁగ మంత్రవాదియు
కఱప జ్ఞానము, తన్నుఁ దాఁ గనుకరణిఁ దలపోయన్
పరమవరగురుకరుణ మాయా
వరణ మెడలిచి యద్వయుం డీ
శ్వరుఁ డనెడుపరవస్తు వే నను సత్యముం గనుమీ! 53

కలను భుజగము తన్ను గఱచిన
బలవరించుచు జడిసి కుయ్యిడఁ,
దెలుపఁ బరులా నిజము, భయమున్ దేరునటువలెనే,
తెలుపఁగల్గినగురునికరుణను
దెలిసి మాయాభ్రమ నడఁచి, ని
శ్చలితనిర్మలనిత్యుఁ డనునిశ్చయము గనుతనయా! 54

అలరుమంటపమణుల శునకా
వళుల ప్రతిరూపములఁ గని శుని
కలహ మాడఁగ వానితోఁ జనుకైవడినె, తలఁపన్
అల యవిద్యోపాధిచేఁ దాఁ
జెలఁగి బహురూపములఁ దోఁచుట
దెలిసి గురుకృప నద్వయుం డని తెలియుమా! నిన్నున్. 55

తలకు పైత్యం బడరి కన్నులు
తెలియకుండఁగఁ బవలు రేలును
సలుప వెజ్జు చికిత్స తెలిసెడిసరణి, గురుబోధ
మలిన మగు మదిఁ గలుగు భ్రమలను
దెలిసి తొలఁగింపంగ, నేనే
యల సనాతన నిత్యముక్తుఁడనంచుఁ గనుఁగొనుమా. 56

ఆవరణావిక్షేపశక్తులు
ఆవరింపఁగఁ బరముని, జగ
జ్జీవరూపం బయ్యెఁ, గలఁ దోఁచెనుపదార్థమటుల్;
పావనం బగు గురుపదాంబుజ
సేవ సంసృతి వీగి నీవు ని
రావరణనిస్సీమసత్యపరాత్మ వని కనుమా! 57

అసిపదాఖండాద్వయామృత,
రసభరితనిస్తీరవార్నిధి
మెసఁగఁ దుంగతరంగతతులం దేర్పడెడుఖ్యాతిన్;
ప్రసరమయి బ్రహ్మాండబుద్బుద,
మసమసచ్చిత్సుఖమయంబును
రసమయము నద్భుత మహార్ణవముగా నెనఁగున్. 58

నీరునీరును, బాలు పాలును,
సారమగుచక్కెరను జక్కెర
చేరి తమలో నొక్కరూపునఁ జెలఁగుచుండుక్రియన్,
ధీరగురువర కరుణ సుఖసా
కారసహజాద్వైతమందున్,
జేరి సమరస మొంది సుఖివై వెలఁగుమా, తనయా! 59

వింతయగు జీవేశ్వరత్వము,
భ్రాంతికల్పిత మనుచుఁ దెల్పి య
నంతరం బిటు లసిపదాఖండార్థమును దెలుపన్ !
అంతరంగం బేకపథని
శ్చింతసుఖమయమౌట, శుకుఁ డ
త్యంతసహజానందపద చింతనమునం దుండెన్. 60

పరమపురుష! మహామహిమ! సుచి
చిరపరంజ్యోతిస్వరూపా!
పరతరమహామహిత! సన్నుత పాపవిధ్వంసా!
వరచరాచరరూప! బంధుర
కరుణ! సుందర! కామితప్రద!
వరద! పావననామ! వేపలపర్తిశ్రీధామా! 61

ఐదవ అధ్యాయము

అసిపదార్థ నిర్ణయము

సమాప్తము.

---



# అనుభవామృతము

## ఆరవ అధ్యాయము

## సప్తభూమికల అభ్యాసము.

శ్రీగిరీంద్రాత్మజనుతాఖ్యా!
భోగిరాట్పర్యంక! పరతర
భాగవతజనసంగ! వేదలతాశ్రీరంగా!
యోగసంచర! యోగిహితకర!
యోగివర! అవధారు వ్యాసుం
డీగతిని వినిపించె శుకునకు నిష్టపుత్రునకున్. 1

పాలసుల, కహితులకుఁ గుత్సిత
శీలురకుఁ, గుటిలురకు, విబుధులఁ
దూలనాడుజడులకుఁ, గామాంధులకుఁ, గఠినులకున్
గాలమును దుర్వాదములలో
దోలువ్యర్థుల, కధమజనులకుఁ,
బోలఁ దెలుపకు మనుభవామృతమును మఱచియైన్. 2

నిర్గుణాష్టాంగాదిసాధన
మార్గనిహితాసక్తియుతులకు,
భర్గపాదాంబుజనిరంతరభక్తిభరితులకున్
స్వర్గసుఖ మల్ప మని తత్సం
సర్గ మొల్లక నడవఁగల యుప
వర కాంక్షుల, కనుభవామృతప్రాశనంబు తగున్. 3

పలుగతులయభ్యాసములు, జే
ష్టలు గలిగె నాత్మపరోక్షం
బలవఱుప, వేదాంతములు, సాంఖ్యములు, యోగంబుల్
కలవు సిద్ధాంతములు శాస్త్రం
బులును; వానిని నేర్చి సాధన
యలవఱచుభూమికల నెఱుఁగుట యానఁగ సులభంబే? 4

నిస్తులంబై వెలయు నాపర
వస్తువును సాధింపఁ గలుగుప్ర
శస్తసోపానంబు లనఁదగు సప్తభూమికలన్
విస్తరించెద నోలి దానన్
నిస్తరంగచిదబ్ధిబ్రహ్మను
హస్తనిహితామలకముంగతి నరసికొనవచ్చున్. 5

మొదటి దరయ శుభేచ్ఛ; రెండగు
నది సదాత్మవిమర్శ; మూఁడవ
దది యసంగము; వాసనాక్షయ మరయ నాలుగు; నై
దొదవు నానందియును; నాఱవ
యది తురీయము; సప్తమం బగు
నది తురీయాతీత మనఁగా నలరె భూమికలున్. 6

వెనుక సల్పినసుకృతఫల మది
తన కొదవ, వైరాగ్యబుద్ధినిఁ
గనుచు, పరమవివేకసంపదఁ గాంచి, నరుఁ డెం దెం
దును సుఖము నొక్కప్పు డేనియుఁ
గనక కడు వేసారి తుద మన
మున మరిగి సుఖ మిచ్ఛయించును బుద్ధిపూర్వముగన్. 7

సతుల, సుతుల, సువర్ణభూషణ
తతుల, గృహముల, గృహమువార్తల
నతుకుకొన్న మనంబు సడలిచి యల్లనల్లనఁ దాఁ
నతివిరక్తి వహించి దుఃఖము
గతిఁ దొలంగి శుభంపుపథమున
సతము మోక్షాకాంక్షి ముందఱ సాగు నడు గిడుచున్. 8

యోగసిద్ధులఁ గోరఁ డమరుల
భోగముల మది నిడఁడు, నిస్పృహా
భాగరిమగను, నన్ని లయమగుఁ దథ్యముగ ననుచున్;
ఏగతియొ తన కింక ముం దెటు
శ్రీగురునిసత్యోపదేశము
నేఁ గనెదనో? యని తపించు శుభేచ్ఛ ననిశంబున్. 9

పున్నెములె తా సల్పు, పాపం
బన్న జోలికిఁ బోఁడు, దుఃఖం
బెన్నఁ డన్యుల కెపుడు; తనవలె నెల్ల రని యెంచున్,
ఉన్నయాశల విడు, శరీరము
మున్న పోషింపఁడు, సత్యం
బున్నడపు నాతండు మొదలిటిభూమికను దనయా! 10

తా నెవఁడో? దేహంబులోపలఁ
దా నదేరూపమున నుండెనో?
అను సంసృతి దుఃఖ మేగతి నలవడెనో తనకున్?
ఈ నిబిడగతిఁ బైకొనిన య
జ్ఞాన మేక్రియఁ బాయునో? తన
దా నిజముఁ గను టెట్టులో యని యరయు లోలోనన్, 11

నేను నే నను నీయహంకృతి
తా నదేమో? యెట్టిరూపమొ?
కానరాక మఱుంగుకా, నేకతమొ పరీక్షింపన్?
మేనఁ దోఁచియుఁ దోఁచనటి వి
ధాన మింకేటిదో? య
జ్ఞాన మన నేభ్రాంతిదో యని కలఁతనొందు మదిన్. 12

విరతిసుఖము నెఱుంగు, నిగమపుఁ
బరమసారము నరయు, దేహపు
గరువమును విడు, నాత్మచింతనఁ గలిగి వర్తించున్,
గురుజనుల సేవించి చాలఁగ
నెఱుఁగు నాత్మహితాహితము, సం
సరణదుఃఖముఁ దొలఁగ గురువులచరణముల కెరగున్. 13

పరమకరుణావారినిధి యగు
గురునిరీక్షణవడసి, మనమును
నిరవుకొనుపలుచెడుతలంపుల నెఱిఁగి, యాపిదపన్
పరమశాంతినిఁ బొంది, స్ఫటికము
తెఱఁగు నిర్మల మైనబుద్ధిప్ర
సరణమున నిజసుఖ మెఱుంగు విచారతత్పరుఁ డై. 14

జీవపరములలక్షణము, మా
యావరణచే నైనమఱపు, య
థావిధిగ వాచ్యార్థ లక్ష్యార్థములవివరణమున్
భావమునఁ గొని లక్షణము గురు
దేవసేవ లొనర్చి యద్వయు
సావధానతఁ గనుటె యాత్మవిచారము యగుఁ గనఁగన్. 15

సువివేకవిచార మలవడ
నావరణ మడుగంటి యాత్మను
భావమున నెంచుచుఁ దదాప్తిని బడయునాసక్తిన్,
చేవఁ గొనుజ్ఞాతృత్వ మెడఁగొని
తా వెలుఁగ నిస్సంగి యగుచు, సు
భావబోధం బగును రెండవ దైనభూమికలోన్. 16

ఎసఁగువిషయసుఖాశ విడి, మా
నసమునన్ వైరాగ్య మూనుచు,
వెసను సజ్జనగోష్ఠి లోఁ గొని విడిచి దుర్మతులన్,
నసి నహర్నిశ మాత్మచింతా
భ్యసన మొనరుప దృఢత, నిజసుఖ
మనమగతి నరచేతిమానిక మగుట తథ్య మగున్. 17

నేన సత్యజ్ఞానసుఖుఁడన్,
స్వానుభవసంవేద్యుఁడను, నేఁ
గాన దృశ్యములందు సంసర్గంబు నెయ్యెడలన్;
భానురుచి లోకంబు చలనము
నూను కైవడిఁ గరణతతికిఁ బ్ర
ధానకారణ మౌదు నని మదిఁ దలఁచు నతఁ డరయన్. 18

పరచుజలములు జన్మభూమిని
నెఱుఁగనటువలె, నాత్మచే వి
స్ఫురణమును నుగ, కరణములు తమమూలవస్తువునే
యెఱుఁగ నేరవు; కనఁగ సూర్యుని
కిరణమట్లు ప్రవృత్తిముఖమై
బరఁగుటను సద్దానిసంగముఁ బడయ నే, ననెదన్ 19

జలమునం దగపడుతరంగా
వళులు తటమును మీఱఁ జూపదు,
దెలియ నీటిని దాటునే! యాతీరు కరణములున్
వెలుఁగు నాత్మప్రభను; దానిని
దొలఁగి చెలఁగఁగలేవు, తనువుల
వెలికిఁ దోఁచును; తనకు వానికి వెలయుసంగ మదే. 20

పాలు పెరుగటులౌ వికార్యుఁడు;
పోలు స్వర్ణముగతిని బ్రాప్యుఁడు;
క్రాలు నుత్పాద్యుఁడను ఘటమటు; గాంచ ద్విజమాడ్కిన్,
వాలు సంస్కార్యుఁడను; గా డీ
లీల నాల్గుకరణబంధన
జాలకర్మలు లేవు, తా నిస్సంగుఁ డవ్వానన్. 21

కర మహంకారమున కర్మల
నెఱపి తత్ఫలితముగఁ గుడువఁగ
నగి సుఖదుఃఖములఁ గర్తృత్వాభిమానమునన్;
గరువమే దేహంబుగాఁగ, న
లరెడుదుష్టాహంకృతికి న
తురుఁడనౌ నా కరయ సంసర్గంబులే దనఘా! 22

గగనమునఁ జన ఖగము సంగమ
ముగనె యన్యోన్యం; దటులె చి
ద్గగనమందు నహమ్మనఁగుమాత్రమున వినిమయమే?
అగణితనిజానందనిరుపమ
విగతగుణనిస్సంగనిర్మల
నిగమవేద్యుఁడ వీవు; సంగము నీకు లేదెందున్, 23

త్రిజగములకై పడఁ గనంబడు
నిజ మనఁగ; మన సడఁగ నది చెడు
భుజగ మది పగ్గమున కనఁబడి పోవునటు; శక్తి
రజత మటుల; ననాద్యవిద్యా
వృజినలింగశరీరసంగము
నిజముగాఁ దన కేమి లే దని నిస్పృహత నుండున్. 24

చనుమ్రుపాహంకృతియె కలవతె
ననసి జగమై తోఁచు, మృగతృ
ష్ణను గనంబడుజలముక్రియ, నది సత్య మెట్లగున్?
వినుత తేజోనిధి సహంకృతి
చెనకునే? చీఁకటులు రవిపైఁ
జనునె? యాతం డట్టులే నిస్సంగుఁడై యుండున్. 25

అనిలుఁ డట నడయాడ, నభమున
కనిలునకు సంగమదె? ఆత్మయు
తనుసహితపరిపూర్ణనిజనిత్యప్రకాశము; క
ల్పనల కిరవై యొప్పుమాయా
జనిత మగుషోడశవికారపు
మనసుసంగము లేదు తన కని మదిఁ బదిలపఱచున్. 26

మున్ను సల్పినపుణ్యఫలమున
నున్నతవిరక్తిని గలిగి, తా
నెన్ని సజ్జనసంగమంబున నెఱిఁగి శాస్త్రము, సం
పన్నమతిఁ దనుఁ దెలిసి, వాదం
బన్న మదిలో రోసి, బ్రహ్మం
బన్న నే నను హెచ్చరిక మూఁడయినభూమిక యగున్. 27

జలమునం దగపడుతరంగా
వళులు తటమును మీఱఁ జూపదు,
వెలియ నీటిని దాటునే! యాతీరు కరణములన్
వెలుఁగు నాత్మప్రభను; దానిని
దొలఁగి చెలఁగఁగలేవు, తనువుల
వెలికిఁ దోఁచును; తనకు వానికి వెలయుసంగ మదే. 20

పాలు పెరుగటులౌ వికార్యుఁడుఁ;
బోలుస్వర్ణముగతిని బ్రాప్యుఁడు:
క్రాలునుత్పాద్యుఁడును ఘటమటుఁ; గాంచ ద్విజమాడ్కిన్,
జాలు సంస్కార్యుఁడను; గాఁ డ
లీల నాల్గుకరణబంధన
జాలకర్మలు లేవు, తా నిస్సంగుఁ డవ్వానన్. 21

కర మహంకారమున కర్మల
నెఱపి తత్ఫలితముగఁ గుడువఁగ
నఁగి సుఖదుఃఖములఁ గర్తృత్వాభిమానమునన్;
గరువమే దేహంబుగాఁగ, న
లరెడుదుష్టాహంకృతికి న
తురుఁడనౌ నా కరయ సంసర్గంబులే దనఘా! 22

గగనమునఁ జన ఖగము సంగమ
ముగనె యన్యోన్యం; దటులె చి
ద్గగనమందు నహమ్మనఁగుమాత్రమున వినిమయమే?
అగణితనిజానందనిరుపమ
విగతగుణనిస్సంగనిర్మల
నిగమవేద్యుఁడ వీవు; సంగమునీకు లే దెందున్, 23

త్రిజగములకై వడిఁ గనంబడు
నిజ మనఁగ; మన సడఁగ నది చెడు
భుజగ మది పగ్గమున కనఁబడి పోవునటు; శక్తి
రజిత మటుల; ననాద్యవిద్యా
వృజినలింగశరీరసంగము
నిజముగాఁ దన కేమి లే దని నిస్పృహత నుండున్. 24

చనుమృషాహంకృతియె కలవటె
నెనసి జగమై తోఁచు, మృగతృ
ష్ణను గనంబడుజలముక్రియ, నది సత్య మెట్టులగున్?
వినుతతేజోనిధి నహంకృతి
చెనకునే? చీఁకటులు రవిపైఁ
జనునె? యాతం డట్టులే నిస్సంగుఁడై యుండున్. 25

అనిలుఁ డట నడయాడ, నభమున
కనిలునకు నంగమటె? ఆత్మయు
తనుఃహితపరిపూర్ణనిజనిత్యప్రకాశము; క
ల్పనల కిరవై యొప్పుమాయా
జనిత మగుషోడశవికారపు
మనసుసంగము లేదు తన కని మదిఁ బదిలపఱచున్. 26

మున్ను సల్పినపుణ్యఫలమున
నున్నతవిరక్తిని గలిగి, తా
నెన్ని సజ్జనసంగమంబున నెఱిఁగి శాస్త్రము, సం
పన్నమతిఁ దనుఁ దెలిసి, వాదం
బన్న మదిలోఁ రోసి, బ్రహ్మం
బన్న నే నను హెచ్చరిక మూఁడయినభూమిక యగా. 27

ఎంతయును భూమిత్రయము నిటు
సంతతంబుగ నభ్యసించుచు
చింతిలక కడచినపనికి యోచింపకయు ముందున్,
ఇంతగాఁ గనుపించుసృష్టిని
వింతపడి నిజమంచు నెంచక,
భ్రాంతి విడి మనుభూమికయె నిర్వాసనాఖ్యఁ దగున్. 28

తనువు తానే యనెడువాసన,
కనఁగ బహువిధశాస్త్రవాసన,
ఘనతరపు లౌకికమె మొదలుగఁ గలుగువాసనలం
దున సతంబును మునిఁగి లేచెడు
మనసు యోగమునూని చిన్మయు
నైనయ, నిర్వాసనపుభూమిగ నెంచఁబడు నదియున్. 29

వాసనాక్షయ మది యగును, దు
ర్వాసనక్లేశంబు లై దిటి
దోసమును దొలఁగింప, మది నిర్దుష్టశుద్ధము నై
భాసమగుచును బుద్ధి వెల్గుచుఁ
దా, నరిగ నంతర్ముఖము కా,
నీ సకలమును స్వప్నమటు స్ఫురియించు మిథ్యయు నై; 30

చిలుము గప్పినయద్దమటువలెఁ
దెలియకుఁగా బహుజన్మజన్మల
వలగొనినసంసారముల దగువాసనాఘల మఱ
కలుషమును గడత్రోయఁగా ని
ర్మలము నొనర్చిన మెఱయుముకురము
వలె వెలయు మన సాత్మ నెలకొన వాసనాక్షయ మౌ; 31

ఇది సుమా! నాలుగవభూమిక
యదను, మఱి యభ్యాసవశమున
మది వినిర్మల మగుచుం దా నాత్మైక్యమును గనుచున్,
నదమలాత్మానంద మది మదిం
బొదల నిద్దురను గనిననరుసటు
లదియు సుప్తి యనంబడు; నదె నిరస్తమాయ యగున్. 32

తమముం జేరంగ నిద్రజాగ
ద్భ్రమం దొలంగి, నిజసుఖము, లో ని
ర్మమత నడంగంగ యోగనిద్ర కుమార! బుద్ధి కగున్;
తమపునిద్ర సుఖంబు క్షణికం;
బమలయోగానంద మధికము,
విమలసహజానంద మిట్లని వేర్కొనంగ వశమే? 33

జీవపరమైక్యము గలుగ లే
దేవిధపుసంగము తనకు స
ద్భావమే దేహంబుగా నిర్వాసనయె నెలవై
కేవలానందానుభవమే
లో వెలుపలన్ నిండి విడువక
చేవగొన నానందభూమిగం జెల్లె సది తలంపన్. 34

తలంప సచ్చిత్సుఖమయాత్మయె
వెలింగి లోం బ్రతిబింబ మిడ, ని
ర్మలనిజాంతస్సుఖవికాసవిరాజి యగుబుద్ధిన్;
తళతళలమెఱుగారు మనసు ప్ర
భలం గలసి, వెన్నెల స్ఫటికమణి
నలరునటు, లద్వైత మయి తా నతిశయించుం జుమీ! 35

చూడ నానందిలియ యది, యి
ట్లైదుభూమిక లందఁగోరుచుఁ,
గూడి యాఱవభూమికను గైకొనఁగ, నాస్థితిలో
మూడి యానందం బడఁగ, తా
నాడి యుచ్చావస్థ; నిజముగ
వీడి భావాభావగతులను వెలుఁగు నసాజముగన్. 36

ద్వైత మద్వైతంబు లనునీ
రీతి నేమియుఁ గానకయె చిత్
జ్యోతి యగుచును, చిత్రదీపము జోక నలరుచు బల్
కౌతుకము కాఁగా నఖఁడని
జాతిశయలవ్యార్థ మగు నది
యే, తురీయబ్రహ్మపద మయి యెంతయును వెలయున్. 37

ఆరయఁగ తొలిమూఁడవస్థల
మీఱి, యాఱువికృతు లడఁచి, చి
త్సారసుఖరూపము తురీయపదంబుగా నగుచున్
పారమార్థికమైన దది విను!
మాఱవది యగు భూమి మనుజుఁడు
ధీరగుణ! యద్దాన ముక్తినిఁ దేలి సుఖియించున్. 38

ఆఱవది భూమిక యలవడ, కు
మార! వ్యవహారంబు యోగికి
నీరెతెరమైన ట్లెజేఁగి. లో నెగడి వర్తించున్.
వే ఱొకటి కనఁబడదు కార్యము
కారణంబును లేవు, సుఖసా
కారసాయుజ్యంబు సులభతఁ గాంచు నతఁడు సుమా! 39

తనయ! సప్తమభూమి కనునది
విను! తురీయాతీత; మనుపమ
మును, నగోచర మెందు మానసమునకు వాక్కునకున్;
కన, నచిత్తన చిత్తనంగ స
త్తన నసత్తన రాదు వే ఱె
ట్లనంగ సాధ్యము కాదు; నిజపద మదియు తలపోయన్. 40

మొదటిమూఁడగుభూమికలు నిం
పొదవు నభ్యాసముల కరయంగ
నదనుగా సాధనములై విను మాచతుర్థంబై
నదియు చిత్తనఁ బేర్కొనంబడు;
మది దలఁపఁ దుదిమూఁడుభూమిక
లదిర! జీవన్ముక్తిపర్యాయంబు లగుఁ దనయా! 41

విను! తురీయాతీత మేడవ
దనఁగఁ గడపటిదైనభూమిక;
తనయ! కార్యము కారణము భేదము నెఱుంగనిదౌ;
ననఘ! కేవలనిర్వికల్పము
కనఁగ నదియె విదేహముక్తిం
దనరు, ననుపమనిర్విచేష్టత దానిలక్షణమౌ; 42

ఈపగిది భూమికలనెలవు ని
రూపణం బభ్యాసమున కను
రూప మగుశ్రవణాదులను మది రూఢిపడురీతిన్
ఏపు సూపుచుఁ దెలిపె శుకునకు
నాపరముని యైనవ్యాసుఁడు
దీపితపువేదాంతపద్ధతిఁ దెల్లమగురీతిన్. 43

తనయ! విను సద్గురునికరుణను
ననుభవము సరిపోల ననువయి
మన సాడంబడురీతి శాస్త్రపు మర్మములఁ దెలియన్
ఘనము లగుజన్మాంతరపు వా
సనలఁ గలుగునవిద్య తె న్విడి
చన, నిజాత్మను నిశ్చయించుటె శ్రవణ మన నొప్పున్. 44

విమల మాత్మతత్త్వమసివాక్యా
ర్థము గురునికడ నెఱిఁగి, శాస్త్రో
క్తముగ, మాయాతత్త్వముల మదిఁ దలఁచి మిథ్యలుగన్ ;
అమలసత్యజ్ఞాన మనఁగా
నమరఁ గల ప్రత్యక్పరాత్మై
క్యమె తనయ! తా నంచు తెలియుట యరయ శ్రవణమగున్ . 45

గురుపదాంబుజసేవ మదిలో
నెఱుకగొని, సతమున్ సలుపఁ ద
త్కరుణ కలుగఁగఁ, భావవిచ్ఛేదస్వరూపంబౌ
పరమశాంభవబోధ యనఁబడు
నిరతిశయసంపూర్ణదృష్టిం
జరిగి సహజానంద మొందుట శ్రవణ మనఁబడెడున్ . 46

శ్రవణమున దృఢపఱచి, తనయను
భవముచే మతభేదములఁ బో
నవలఁద్రోయుచు ప్రబలశ్రుతియుక్త్యనుభవపథమునం
దవఘటించెడి సంశయంబులఁ
దవులఁబోవక, స్వానుభవమును
దవిలి రక్షించుటయె మననము తథ్య మగుఁ దలఁపన్. 47

తనయ! యాలింపుము, సకలవా
సన లడఁచి మృగతృష్ణయటువలెఁ
దనకు నగపడుసర్వమును మిథ్యగ మదిఁ గనుచుఁ
ఘనగురునియుపదేశచింతన
మననకాలమునందు చిత్తము
కనఁగ నౌకాస్తంభసంస్థితకాకమై యొప్పుఁ. 48

ఆసనము నలవఱచి, ప్రాణము
నోసరిలఁగానీక, దృష్టిని
నాసికాగ్రమునం దునిచి, యంగము శిరము ఋజురే
ఖాసమంబై యొసఁగ, స్థిరమతిఁ
జేసి గురుబోధంబు, నిర్జన
వాసమున జపియించుచుండుటె వత్స! మనన మగుఁ. 49

మనన మభ్యాసంబు విడువక
యనవరతమును సలుపఁగాఁ, దన
యనుభవము దృఢపడుచు సహజం బగుచు నలరారుఁ!
జననకారణ మైనకర్మము
ననఘ! నాశమునొందెడిని, మది
కనును నిస్సంశయత; హృదయగ్రంధి లయమొందుఁ. 50

దినదినము మననము, మఱిచిం
తనఁ, దనువు ధర్మముమఱచి, తా
ననఁగ నాత్మయె యానెడుదృఢతర మైనజ్ఞానముకా,
ఘనపరంజ్యోతిస్స్వరూపుఁడె
తనకు తా నౌ రాజయోగము
దనర నది యొప్పారెడు నిదిధ్యాసనం బనఁగఁ. 51

అరయ, బ్రహ్మనిష్ఠ యనఁగా
నురుసిదిధ్యాస యగు; బ్రహ్మము
పరమతికి సాక్షాత్కరింపఁగఁబడుసమాధియనన్
మఱి యహంకృతి పూర్వకర్మము
తెరల, సంపెఁగఁ జేరుకొనునళి
తెఱఁగె యగును విదేహమోక్షము తెలియుమా! పుత్రా! 52

శ్రవణమున, నజ్ఞాన మడఁగఁగ
నఖిలపరంజ్యోతి మననం
బు వలనను వెలుఁగొంది దృఢతరముగను నిశ్చలమై,
ధ్రువము నగు నిజపద మనంబడు
ప్రవిమలనిదిధ్యాస యది యగు;
తవిలిజీవన్ముక్తి దొరకొనుఁ దథ్య ముద్దానన్. 53

అనయ మాధ్యాత్మ్యపువిచారం
బున మనం బంతర్ముఖముకా,
ననఘ! చిద్రూపంబు ప్రత్యక్షానుభూతముగాఁ!
ఘనతరనిజానందవస్తువు
తనకి ప్రత్యక్షముగ, నైక్యం
బనఁగ బుద్ధిని గలసిమెలసిన నది సమాధియగుః. 54

ధ్యాననిశ్చలతయె సమాహితి
దాన భేదము లాఱు, వినిచెద
నేను విను! సవికల్పకము మఱి నిర్వికల్పకమున్;
కానఁగా సవికల్పకమె దృ
శ్యానువిద్ధము, నదియె యగు శ
బ్దానువిద్ధము, రెండు బాహ్యాభ్యంతరములు నగున్. 55

లోనఁ గరణప్రతతి గుఱిగా
నూని, దృశ్యత్వమున గని య
వ్వానిఁ బ్రత్యక్షముగఁ జేకొని వాని నన్నిటికిన్
దాను సాక్షిగ నిలుచుటయె దృ
శ్యానువిద్ధం బనుసమాధిగ
నౌ నటందురు విజ్ఞు లది మది నారయుము తనయా! 56

ఎవ్వఁ డది వినుఁ జూచు, మఱి తగ
నెవ్వఁ డాస్వాదించు, గంధము
నెవ్వఁ డాఘ్రాణించు; నుష్ణము నెవడు శైత్యంబున్
ఎవ్వఁ డెఱుఁగు? నతండు తా నని
యివ్విషయముల కెల్ల గుఱిగా
నివ్వటిల దృశ్యానువిద్ధము నెగడుఁ దలపోయన్. 57

తన, మనోదృగ్వాగగోచర
మనిన యాత్మ నదెట్లు ధ్యానం
బొనరుపందగు? ననఁగఁ దెల్పెద నొప్పుగా వినుమా!
అనువుతో శాఖాగ్రమున చం
ద్రునిఁ దగన్ సాధించుగతి, గుఱి
యనఁగ కరణము లిడి కనఁగ దృశ్యానువిద్ధ మగున్. 58

తలఁప ఛిద్రఘటంబులో ప్ర
జ్వలితమౌ దీపంబువలె, లో
వెలి, వెలుఁగు నది; కరణముఖముల వింతగా దానిన్,
తెలియు నెవ్వఁడు? వాఁడె తనలోఁ
దెలిసి తను, మనస్సంబుచే తాఁ
దలఁప 'సోహ' మ్మనుచు నది శబ్దానువిద్ధ మగున్. 59

బ్రహ్మ మొదలు తృణాంత ముండెడు
జిహ్మయే, మణులందు సూత్రం
బిమ్ముగాని నటు, చేతనం బయి యొసఁగి సర్వములన్
గ్రమ్ముకొని సత ముండు నని. సో
హ మ్మనుచు నలుపంగ, నగు మన
న, మ్మదే శబ్దానువిద్ధమునాఁ బరఁగుఁ దనయా! 60

తనయా! కల లగుకల్పనంబులు
మనసు భ్రమ లని తెలిసి, మానస
మనయు, మద్వయబ్రహ్మమం దైక్యంబు నొందంగన్ ;
వినుము! భ్రాంతి యడంగి బాహ్యం
బును మఱచి తగ నాత్మను రమిం
ప, నది యొసఁగును నిర్వికల్పసమాధి యనఁ బుత్రా! 61

మకుటకంకణరూపనామపు
వికృతి వీడినహేమమట్టుల,
ప్రకట మగు తెరనురువు లడఁగినవారినిధివోలెన్,
సకలభేదోపేతమాయా
ప్రకృతిరహితైకత్వనిరుపా
ధికనిజాత్మయె నిర్వికల్పవిదితసమాధి యగున్. 62

వెలిని లోపల పూర్ణ మనుభవ
మలవడంగను నిరనిలం బగు
స్థలిని దీపమువోలె నిశ్చలితముగ వే తెదియున్
గలుగ కొకలే నిలుచునిలువయె
నిలుకడగ నచలముగ వెల్గఁగ, న
మలినమతి! విను నిర్వికల్పసమాధి నాఁబడెడున్. 63

శ్రవణమననాదుల మనం బది
తవిలి సారూప్యంబు వడయఁగ
లవణరసగతపత్రతృణములలాగునను మఱియుఁ
గవిసి కతకరజంబు కలుషిత
భువనమునఁ గలసినట్లు, కీటము
జవమునన్ భ్రమరత్వ మందినసరణి యగు నాత్మన్. 64

అరణులం దుదయించుపావకుఁ
డరణులను దనయట్లు సల్పెడి
కరణి 'సోహ' మ్మనుపదంబున గల్గుజ్ఞానంబున్
అరయ దేహాద్వయవిభేదము
పరిహరించుచుఁ దన్మయముగా
నిరుప మద్వయరూపుఁ డయి తా నెగడు నిశ్చయమై. 65

తనయ! విను మా ప్రణవమే ధను,
వనుపమాత్మయె శరము, బ్రహ్మమె
కన, గుఱిగఁ గొని సావధానముగా నిరంతరమున్
మననమును జేయుచును శర మ
ట్లనుసరించుచు లక్ష్యమున, దా
ననుభవానందైకరసమయుఁ డగుచు నలరారున్. 66

తాను దా నయి వేఱుతోఁపక
తానె కా, నది నిర్వికల్ప
ధ్యానధారణమున సమాధిగఁ దనరు నది మతికిన్;
మానవిధి! సవికల్ప మనఁగా
భానుఁ డంబులఁ బోఁచునటు లది
స్వానుభవసంసిద్ధ మగు సోపాధియై యొప్పున్. 67

మన మడఁగ నేకత్వ మగు నా
ఘనసుఖం బే నిర్వికల్పము;
తనయ! సవికల్పము మనస్సహిత మగుసుఖమె సుమా
వినఁ దురీయావస్థ బుద్ధికి
నొనరుచే సవికల్పకము, మన
మణఁగ నిర్గుణనిర్వికల్పం బగును తలపోయన్. 68

తాను తనలో నిట్టులాత్మ
ధ్యానమును సలుపంగ, నాత్మను
దా నెఱిగి, చిజ్జ్యోతిరూపము దనర హృద్వీథిన్,
తా నెఱిని శాస్త్రార్థములఁ గొని
యమనియమములఁ గని సమాధిని
బూన, శాంతానంతసుఖనిధి మునిఁగి తేలుఁ జుమీ! 69

ఆఱువిధములు నాసమాధులఁ
గూరి సత మభ్యాసమున, మన
మూర, నేకాంతంబు నొందఁగ నడఁగ మతి స్మృతియున్
సారసుఖ మగు, నావిధంబును
నేరి కగు వర్ణింప? మరగిన
వారికే తగుఁగాక, శక్యమె వానవునకైనన్. 70

నిర్వికల్పసమాధిసిద్ధిని
నిర్వహింపఁగ, నాల్గుభూముల
సర్వదాభ్యాసంబు విడువక సల్పఁదగు వినుమా!
దుర్విషయముల మరగుమానస
గర్వ మడఁచుచు నిజసుఖంబును
బర్వఁజేసెడు పరమపద మగు బాలకా! తెలియన్. 71

ఆలకింపుము తనయ! పసులకు,
బోలె వాగ్వృత్తులు నశింప, వి
శాలమానముచే మనోరాజ్యత్వమాత్రమునన్
కాలమును గడపంగ నొప్పై
లీల నెల వగునాయవస్థయె
క్రాలుఁ జుమి! ప్రథమంపు ప్రభూమికగా మదిఁ దెలియుమీ. 72

ఆమనోరాజ్యత్వ మాత్రపు
భూమి నభ్యాసంబు సలుపఁగ
నామనోరాజ్యంబు తొలఁగుచు నటులె క్రమమొప్పన్
సేమ మలవడి తొట్లలో సుఖఁ
మామకొను శిశువట్లు రెండవ
భూమిక యహంప్రత్యయ మొకటె పొలుచు నాత్మనికిన్. 73

విను మహంప్రత్యయము నిలువఁగఁ
జనుఁడు నిద్రను దూఁగునటువలెఁ
గను నుదాసీనత్వ మాతఁడు గాంచు సర్వములన్!
అనెద రాభూమికయవస్థను
ఘనులు మూఁడవ దనుచు! సుఖమయ
ము నగుఁ జుమి! యొకవాని కొక్కటిభూమికలు నిగుడన్. 74

మానసమే మొదలై మఱి యుదా
సీనతయె తుదిదైన యనుసం
ధానములు లయమొందఁ జిత్తపుధర్మ మడుగంటన్,
ఆనిదానావస్థ నెలకొన,
నానెలవె యాత్మస్ఫురణమా
త్రానుభవనిద్రితునివలె నాఱైనభూమికయౌ. 75

ఆసమాధిని యోగిమానస
మేసమయమున నెన్నఁ డెవ్వరి
జ్ఞానముననైనను జలింపదు తోఁచ దేస్మృతియుఁ ?
జేసి దేహప్రవృత్తిఁ దా ని
ర్వ్యాసనముగ! జడాంధపంగుల
తో సమానత వ్యవహరించుచుఁ దోఁచు నాతండుఁ. 76

మన సడఁగి, కర్తృత్వగుణాచిం
తన యడఁగి, సంసృతిని లో వెలిఁ
గనక, నిరతసమాధినిష్ఠను ఘనతరంబుగఁ దా
ననుభవించునతనికి నిజసుఖ
మనిశ మబ్బుచునుండు! నాతఁడె
తనయ! యాత్మారాముఁ డగుచును దనరు సంతతముఁ. 77

సగుణనిర్గుణము లని, యోగపు
తెగలు రెం డగు, సగుణ మనునది
యగును సాకారముగ; రెండవ దా నిరాకారం
బుగను; సాలోక్యంబు మొదలుగ
సగుణమున మోక్షముల గాంచెద,
రోగిని నిర్గుణయోగమున సాయుజ్యముక్తి యగుః. 78

తనయ! యిహపరసుఖవిరక్తిని
గనుటె యమ మగు! నియమ మనఁగా—
మనసు తత్త్వాసక్తి నొందుటె మఱియు బాహ్యమునం
గనెడియాదాసీన్య మే యా
సనము! కరణము లణఁచ సంయమ
మనఁగ! తద్గ్రహణంబె ప్రత్యాహార మగును సుతా! 79

వసమయినతనచిత్త మాత్మ
వ్యసనమునఁబడ ధారణం బగు;
వసముచైతన్యంబు తా ననుటడికు ధ్యాన మగుఁ!
మసలు చాత్మధ్యానమున మది
యెసఁగ నేకాకార మగుచును
వసి వెలుఁగ సుసమాధి యగు నిస్సంశయము పుత్రా! 80

కొమరుఁడ! కషాయలయవిక్షే
పములె మొదలగునంతరాయము
లమరు యోగాభ్యాసకాలమునం దగణితములై,
క్రమత నవ్వానికిని బరిహా
రములఁ జెప్పెదుస్మృతిశ్రుతిపురా
ణము లెఱిఁగి యటునడవనావిఘ్నములు నాశ మగుఁ. 81

తనకునపరోక్షాను భవ మగు
ఘనసమాధిస్థితిఁ దదన్యం
బను నదేమియుఁ దోఁపకయె తా నంతయై దోఁపఁ,
తనయ! శూన్యత తోఁచు; నిద్దుర
చెనకఁ బోలియనుభవము చెడియెడి
ననెద రదియె 'లయం' బనెడియోగాంతరాయముగ. 82

మననకాలమునందు స్మరణము
తనయ! చంచల మగుచు, బరముని
యనుభవముఁ గన, కన్యవిషయములందు నెలకొనుచుఁ,
ఘనముగా నెల్లెట్లు మరలిచి
నను మరల దది! యయ్యవస్థయె
యనఘ! విను 'విక్షేప' మనఁదగునంతరాయ మగుఁ. 83

భావశుద్ధిని, బొంది చిత్తము
సావధానమొనర్చి, బ్రహ్మము
భావమునఁ గొను వేళ, బుద్ధిని బరగుజడవృత్తిన్,
ఏవిధము దోఁచకయె స్తంభీ
భావ మొందెడునాఁడు వస్థను
భావకాళి 'కషాయ' మంచని వలుకుదురు తనయా! 84

శ్రవణమననములందు చిత్తము
తవుల, సత్త్వాద్వయసుఖం బను
భవమునొందెడువేళ దానిని వత్స! యుత్సుకతన్
జవిఁగొనుచు సుసమాధి నుండెడు
నవసరంబును బ్రాజ్ఞులెన్నెద
'రవగతరసాస్వాద' మనఁదగు నంతరాయముగన్. 85

నిదుర కాద్యంతములఁ దెలియు ప
గిదిగనే య్యాబ్రహ్మభావము
నిదురమధ్యను గనుటె లయమును నీల్గఁజేయు టగున్!
అదిర! బుద్ధి యె దేవిషయములఁ
బొదలు నావిషయములె బమ్మగ
నెదఁ దలఁప విక్షేపనాశన మేర్పడును దెలియన్. 86

బుద్ధినే దృశ్యముగఁ దెలియు ప్ర
సిద్ధసాక్షిని లోనఁ గనఁగఁ బ్ర
బుద్ధ మగును కషాయవారణ మనఁగఁ; దలపోయ్య
బుద్ధి మీఱు నతీంద్రియంబును
శుద్ధసంవిన్మాత్రతేషునునౌ
పద్ధతియె పరిహారము 'రసాస్వాద' మునకరయన్. 87

తనయా! విను మాలస్యరోగము,
లనుగతపుదుఃఖత్రయంబును,
మానసుసంశయమును, ప్రమాదము మనసువిషయేచ్ఛన్,
గనెడుభ్రాంతి. యసడ్డ, చపలత,
లనెడునవి దోషములు ప్రబలము
లని వచించిరి యంతరాయము లనుచు యోగములన్. 88

మఱియు తా! ప్రతిభాశ్రవణమును,
నతిశయపువార్తలును, దర్శన,
మతుల మగు, నాస్వాద, వేదన లనెడుషట్కంబున్,
గతివిరోధు లనంబడెడుప్రా
కృతపుటైశ్వర్యములు; విను మివి
యతులబ్రహ్మాభ్యాసకుల కగునంతరాయంబుల్. 89

ఈవిధపుటభ్యాస మెప్పుడు
తా, విడక మదిఁ దప్పఁబోవక
సావధానత సలుప మనసున చంచలత అయమై,
ఏవిధపువాసనలు వృత్తులు
నావరింపక శుద్ధమగున
త్మావలంబన మగుచు శాంతిని దనరు సుఖమయమై. 90

ఓసుతా! ఈభూమికల న
భ్యాసమొనరిచి, శ్రవణమాదిగ,
నాసమస్తసమాధు లలవడునట్లు యోగంబున్
వాసిగాఁ బోషించి, శాస్త్రపు
వాసనల నెలకొలిపి యోగా
భ్యాససహజానందపరపద మంది సుఖి వగుమా! 91

ధన్య! సురమునియోగిజనమూ
ర్ధన్య! విశ్వప్రాణితతిచై
తన్య! సర్వప్రాణసర్వత్రాణపరిపూర్ణా
మాన్య! లోకానన్య! సాగర
కన్యకాపతి! శిష్టరక్షా
ధ్వన్యదివ్యవరాహా! వేపలపర్తిశ్రీగేహా! 92

ఆరవ అధ్యాయము

సప్తభూమికల అభ్యాసము

సమాప్తము.

---



# అనుభవామృతము

## ఏడవ అధ్యాయము

# పరమాత్మ పదనిర్ణయము

శ్రీక్షమావిలసత్కటాక్షా!
రక్షితాఖిలలోక! కౌస్తుభ
వక్ష! సద్గుణసంఘ! వేపలపర్తిశ్రీరంగా!
రాక్షసాంతక! ఖగచర! విరూ
పాక్షసఖ! అవధారు! వ్యాసుఁడు
దక్షుఁడై వినిపించె శుకునకు తత్త్వమిమ్మాడ్కిన్. 1

తుంటరుల కవిచారులకు జన
కంటకులకుఁ గఠోరమతులకుఁ
గొంటెగాండ్రకు విషయరతులకుఁ గూళులకు మఱియున్,
గొంటులకు, మొఱకులకు, జడులకు
గంటుదొంగల, కన్యకాంతల
నంటుదుర్మార్గులకుఁ జెప్పకు మనుభవామృతమున్. 2

సాదరత నధ్యాత్మవిద్యా
మోదకులు నగుఘనులకును, స్నే
హాదిసద్గుణముల గడించు మహానుభావులకున్,
భేదభావములేక సద్గురు
పాదపద్మముసేవ సలిపెడు
సాదులకు నీయనుభవామృతసరణిఁ దెల్పఁ దగున్. 3

అనఁగ శుకుఁ డోజనక! తత్త్వపు
ఘనరహస్యము లెల్లఁ జెప్పితి
మన మెఱుఁగ శాస్త్రార్థమందలిమర్మములు విడఁగన్,
జననమరణపరంపరలు విడి
చనె, భవత్కారుణ్యదృష్టిని;
వినుపు మాపరమాత్మపద మన, విని ముని వచించెన్. 4

వినుము సుత! వివరముగ, నిజపద
మును దెలియ నాశక్యమే? యై
నను వినుతు సంగ్రహముగా, నగుణంబు నద్వయమ్మున్
కన, నిజము నపరోక్షబుద్ధిని
ననుభవముచేఁ గాంచనగు, నో
యనఘ! దాని నిరంతరంబు ప్రయత్నభాగ్యమునన్. 5

శుద్ధ మగునద్దమును బోలెడు
బుద్ధివృత్తియె, నిత్యనిజపరి
శుద్ధతేజము నేకరస మయి చొక్కి కప్పురము
ఇద్ధ మగుదీపంబువలెని ప్ర
బుద్ధమై యేకైక మవ్యయ
సిద్ధ మగుపరమాత్మపద మదె చెలఁగుఁ జూడంగన్. 6

మనసువృత్తి యసంగి తోఁచక
తనకు తానే యనునహంకృతి
ఘనత బయలై భావభ్రాంతులఁ గడచికడుఁ బోనునా,
ఘనపరంజ్యోతిస్స్వరూపము
మనము ననుభవమొంద ననుపమ
మనఁగ నగుపరమాత్మపద మది యగును తథ్యముగన్. 7

బుద్ధి యనఁబడుకరణ మనుభవ
సిద్ధమై తానాత్మవిభలో
నిద్ధబయలందునను స్వప్రభక మెత్తిచూపినటుల్
శుద్ధ మగునాకార మడఁగి, ప్ర
బుద్ధ మద్వయహార్ష వారిధి
పద్ధతిగను నభేద్య మగుఁ జుమి! పరమపద మరయన్. 8

అచ్ఛ మగువెన్నెలవెలుఁగున
హెచ్చుకాంతిని వెలుఁగుస్ఫటిక శి
లోచ్చయపునిజ మొందు తెలియక యొకటె తోఁచుక్రియన్,
అచ్ఛ మగు నెఱుకరయఁ దత్సుఖ
మెచ్చుపడ దనబుద్ధిలో నది
చొచ్చుచోఁ బరమాత్మపద మగుఁ జూచి కనుఁగొనుమా! 9

జీవుఁ డనఁబడుసంవిదద్వయుఁ
డేవగల విషయములఁ జేకొనఁ
బోవ కూరక నిర్విషణ్ణతఁ బొదలు నేవేళన్;
కేవలచిదానందమయమై
భావవిరహిత మేదొ? యయ్యది
యావటిలు పరమాత్మపద మని యరయుమా, తనయా! 10

ఉన్నతసనిజ మెఱిఁగి, సుఖసం
పన్నుఁడై, తనకంటె వేఱై
యున్నప్రారబ్ధంబుకర్మను, నొడిచి, కరణములన్,
భిన్న మగుననుభవము లని తా
మున్నె వాని హరించి నిలుచు ని
జోన్నతియె పరమాత్మపదమని యూహసేయు మదిన్. 11

తెగువ సకలాకారమైన
ట్లుగఁ గనంబడు, నెఱుక నది తొలఁ
గఁగ వెలయుఁ దాఁ దానె యైనయఖండవస్తువుగా
నిగమతతి కందకయు, నిర్గుణ
సగుణనిర్ణయ మొడలి, తగుచి
ద్గగన మది పరమాత్మపద మని కనుము ధృతమతివై. 12

కేరి సర్వముఁ జూపుఁదనలోఁ
జేరికగ; నది యడఁగ నడఁగు వి
కార మేమియు లేక స్థిమితత గన్న శరధిగతిఁ;
మీఱి వెలిఁగిన సత్యసంవిద
పారపరమానందసహజా
కార మది పరమాత్మపద మని కనుఁగొనుము తనయా! 13

కనుల దోఁచునదెల్ల జ్ఞేయము,
కనఁబఱచుకరణములు జ్ఞానం,
బనయ మారెండిటి నెఱింగెడునదియె జ్ఞాతృత్వం
బనఁగఁబడు; నివి త్రిపుటి యనుపే
రునఁ జెలంగెడు; నీత్రిపుటి గె
ల్చినయవస్థయె పరమపద మనఁజెల్లును కుమారా! 14

గాఢనిద్రను నిజసుఖం బది
బాధమగుచో నరుఁడు దానిని
గాఢసుఖ మస్వాప్నమహామనికడుధృతిని బలుకుఁ;
రూఢి యగు నదె ప్రత్యభిజ్ఞా
ప్రౌఢి యదియే నిత్యసత్యా
రూఢ మగుచో పరమపద మనురూపమునఁ బరఁగుఁ. 15

ఎందుఁ జీఁకటివిడిచి వెలుతురు
నందఁగోరెదుకనులఁ దేజో
మందిరము లనునట్లు, దుఃఖము మాను సౌఖ్యము నే,
పొందఁగోరెదుసత్యనిత్యా
నందవస్తువు నిరుపమాద్వయ
సుందరం బది పరమపద మగుఁ జూడు గుఱివడఁగన్. 16

స్థాలిలోపలి యగ్నిపురుషుఁడు
తైలసిక్తం బైనవత్తికి
మేళమయి వస్తువుల నెల్లను మెఱయఁజేయుక్రియన్,
స్థూలసూక్ష్మాకారతత్త్వము
లోలి వెలిఁగించుచు వెలింగెడు
మూల మగు నదె పరమపద మగుఁ బుత్ర! పరికింపన్. 17

జ్ఞానమున నభిమతములే, క
జ్ఞానమును రానీక, యెపుడున్
భానుకైవడిఁ గడువెలుఁగుఁ బ్రజ్ఞాన మనఁబడుచున్;
ధ్యానమౌనసమాధు లెడలఁగఁ,
దా నిజానందైకవస్తువు
నై, నిలుచుఁ దాఁ దానె, యది పరమాత్మపదము సుమా! 18

కరణములు మొదలగు నుపాధులఁ
బరఁగుచుండెడుజీవుఁడే స
ద్గురుకటాక్షముఁ బడసి తనదునిగూఢ మగుసత్యం
బెఱిఁగి, యపరోక్షానుభవసు
స్థిరత యమరఁగ తానె సాక్షా
త్కారమొందిన నదియె పరమపదంబు విను తనయా! 19

తాపములు మూఁడిటికి వెలియై
పాపపుణ్యస్పర్శ మెఱుఁగక,
రూపరసగంధాదివిషయవిరూప మొందనిదై
దీపమటు లేకాగ్రతఁ గన
నోపి జాగ్రదవస్థ వెలసెడు
నాపరంజ్యోతియె సుమీ! పరమాత్మపద మరయన్. 20

కానఁబడుచు నడంగు నన్నిటఁ
గానఁబడక, కడఁగకయె, సహజము
గాని కనఁబడు చెప్ప డొకటేగతిని సర్వంబున్
గాననిదు, స్వపరప్రకాశి, ప్ర
ధాననిత్యానంద సంవిద
నూనసారము పరమపదము తనూజ! కనుఁగొనుమా. 21

మూఁడుతనువులు మూఁ డవస్థలు,
మూఁ డహంకృతులును, గుణంబులు
మూఁడు త్రిపుటి, త్రివర్గత్రికరణములును మఱియు శుకా!
మూఁడువేళలు, మూఁడుజగములు,
మూఁడుశక్తులు, మూఁడుగతులం
దాడి మీఱుతురీయమే పరమాత్మపదము సుతా! 22

ఈపగిది పరమాత్మపదము ని
రూపణము సల్పఁగఁ జిత్తపు
తాప మడఁగి మనోనురాగముఁ దవిలి ప్రియుఁ జనకున్
శ్రీపదాబ్జము లంటి భక్తిర
సోపభోగముచే శుకుఁడు స
త్యాపవర్గుండైనగురుఁ డని ధ్యాన మొనరించెన్. 23

దేవదేవ! మహానుభావా!
జీవజీవ! స్వయంభువా! లో
కావనా! పర! చిద్ఘనా! సూర్యాగ్నిశశినయనా!
దేవతాత్రయమూల! ద్వంద్వా
భావ! కారణకారణా! హరి!
పావనా! పరమాత్మ! వేదలవర్తి శ్రీధామా! 24

## ఏడవ అధ్యాయము

### పరమాత్మ పదనిర్ణయము

### సమాప్తము.





# అనుభవామృతము

## ఎనిమిదవ అధ్యాయము

# మాయామిథ్యాత్వ ప్రకరణము

శ్రీపరంధామా! సునామా!
రూపనామవిలాస! శ్రీకర!
పాపహర! మృదులాంగ! వేపలవర్తి శ్రీరంగా!
శ్రీపతే! పరదేవ! యతిహృ
ద్దీపకా! అవధారు:— వ్యాసుం
డాపిదప నిటు పలికె శుకుతో హృష్టమానసుఁడై. 1

క్రూరులకుఁ, గుపథులకుఁ, దుర్వ్యా
పారులకు, దుష్టులకుఁ, బాపా
చారులకు నిర్భాగ్యులకు నసత్యవాదులకున్,
ఘోరదుఃఖాకార మగుసం
సారజలధినిమగ్నులకు, మద
పూరితుల కీయనుభవామృతమ్మున్ దగదు తెలుపన్. 2

శ్రుతిగురూక్త్యుపదేశముల మతి
హితము నెఱపెడివారలకుఁ, బర
మతములందు నసూయఁ బూననిమహితచిత్తులకున్;
మితవిహారాహారహితభా
షితుల, శాంతరుక్మఖమనీషుల
శక్తిదయానీతులకుఁ దెలుపుమీ! యనుభవామృతమున్. 3

అనఁగ శుకుఁ డను 'జనక! మాయవ
లన మహత్తత్త్వప్రసరమున
ఘనతరబ్రహ్మాండతతులుఁ గలిగి వెలుఁగొందఁ
మనసున కలితం, బజండం
బు నగు తేజఃపుంజ, మాకృతిఁ
గనెను దానఁ ననంగ జోద్యముఁ గా, మదిఁ దోఁచెఁ. 4

మంజులం బగుమంచుమూటను
పంజుఁ జొన్పినయట్లు; తలఁపఁగ
సంజమ బ్బనునుడుపుఁ గట్టిన సరసిజాప్తుఁ డెటుల్
రంజితుం డగు, నట్లు తేజః
పుంజ మాబ్రహ్మంబు మాయా
పంజరంబున నడఁగె ననఁగాఁ బరమచిత్ర మగుఁ. 5

బ్రహ్మ మాయయు రెండుఁ దమలో
నుమ్మడిగ నేకంబనంగా
నెమ్మితో నెట్లుండె? తెల్పుము నెనరుతో ననఁగఁ,
బ్రహ్మ యెక్కడ? మాయ యెక్కడ?
దిమ్మ చూడ్కికి మాయ నిజ మగుఁ
జుమ్మ! సత్యజ్ఞానమున నది చూడ మిథ్యయగుఁ. 6

అదిర! మాయ నెఱుంగు గతి హా
స్యద మె యగు; నాటకపుబొమ్మ ప
గిదిగఁ దోఁచు నడంగును మెఱుఁగుక్రియను జిత్రముగా
నది రహించును, రూపనామము
లాదవఁగా బహుభేదముల, జగ
దుదయకారణ మగుచుఁ ద్రిగుణము లొనరఁ బొలుపొందుఁ. 7

శుద్ధ మగున ద్వైతబ్రహ్మము
సిద్ధసహజత నొప్పు; నప్రతి
బద్ధతేజఃపుంజమగుఁ జుమీ! స్వప్రకాశ మగున్;
శుద్ధముగ నెమరుంచి చూపెడు
సద్ధతిఁగఁ దనుఁ దాన తెలియు ప్ర
సిద్ధమిథ్యామాయ పొడమెను చెలఁగి యానడుమన్. 8

కోటిసూర్యప్రభల వెలిఁగెడు
సాటి గా నని బ్రమ్మ; తేజః
కోటిలహరియ యద్ది మాయాకుహక మగు నరయన్,
పాటి గా దది తెలిసి చెప్పఁగ
బూటకము, భ్రాంతులకు ఖడ్గపు
నీటుతళు కది చిద్విలాసము నిక్క మిది యెల్లన్. 9

గట్టివరివిత్తులను పొల్లట
పుట్టుగతి, నిజమైనభూమను
వట్టిదా నీమాయ పుట్టెను వత్స! పరికింపన్,
గట్టి గా దది నీట బుగ్గలు
పుట్టునటు; పొంగపవ్వళనులకు
పట్టపగలే మబ్బు లెసఁగెడుపగిది మాయ యగున్. 10

లేని దగుమాయాప్రపంచము
కానవచ్చెడి బ్రహ్మమందున్
బూని రవిప్రభ నెండమావులు పొలుచుచందమునన్;
మానుగా పొగ వహ్నిలోపల
గానఁబడియెడురీతి; నది లో
నూని యుష్ణిమ వ్యాప్త మగునటు లొప్పు నయ్యదియున్. 11

జగతిలో నుత్పాతములు పలు
తెగలుగా నుదయించురీతిని,
గగనమున గంధర్వపురములు గలిగి వెలుఁగునటుల్,
అగణితబ్రహ్మాండతండము
లగపడును బ్రహ్మమున సత్త్వ మ
నఁగ; నిజంబుగ సత్తవే యవి నందనా! వింటే? 12

దారు వేఱుఁగురూపమున నే
పారు; దారువుగాక గజ మది
వేఱు గలుగునె? నామరూపవిభేదముల మిగులన్
మీఱు గోచరములు నిజంబులె?
అరయఁగ బ్రహ్మంబె జగదా
కారముగఁ జూపట్టె నంతె, జగంబు మఱి గలదే? 13

లోహమయ మగుప్రతిమ, పీఠము,
వాహనము, వస్త్రములు, సొమ్ములు,
మోహనము లైనట్లు, వస్తుసమూహమం దరయన్,
దేహనామములెల్ల మాయా
మోహమాత్రము లౌను; నిజ మది
యూహ; 'సర్వం బ్రహ్మమయ' మననొప్పు నద్వయమై. 14

తీపునన్ బలుతెగ లయిన కద
ళీపనసబిల్వామ్రములు ఖ్యాతము
లై పరఁగు ఫలజాతులకు నిరవైననామముల
రూపములమాత్రమె విభేదము;
చూపడెడు మాధుర్య మొకటే;
ఆపగిది సర్వంబు బ్రహ్మమయంబు నిజ మదియున్. 15

తంతువే పట మయ్యె; ఘట మా
ద్యంతమును మృత్తికయ; జలమే యా
నంతము లగుతరంగములు; స్వర్ణంబె తొడవు లగుఁ ;
అంతు గానని బమ్మలో నీ
యింతకారణకార్యభేదము
భ్రాంతియే యగు; వేఱె యొక్క-ప్రపంచ ముండదు సూ! 16

వన్నె స్వర్ణమునందు, పరిమళ
మెన్నఁ బుష్పమునందు, మధురత
యన్న, నిక్షువునందుఁ గలిగెడినటులె సర్వములం
దున్నతముగా వెలిఁగి తోఁచెడు
భిన్నములు పరమాత్మలో ను
త్పన్న మయి చిత్రితలతాపత్రములవలె నొప్పుఁ. 17

బీజపంచకమునఁ బ్రపంచము
భూజమటు చూపట్టె; నిజమా
బీజ మగుబ్రహ్మమునఁ బుట్టెను బీజపంచకము;
బీజమే ఫల మనెడుపలు కది
నైజ, మదియంతయును చిద్ఘన
తేజ మగుబ్రహ్మంబె; వే ఱెద్దియును లే దరయుఁ. 18

కట్టుచద్దిని గొనుచు దారిని
బట్టి వడచుచు బడలి దానినిఁ
బొట్టకోఁ బెట్టుకొని శ్రమఁ బోఁబుచ్చుచందమునఁ ,
వట్టి "అది—నే" ననెడుభేదము
మట్టువడి యేకత్వ మగుచో
నెట్టికష్టము లేనిసుఖ యగు నిలను నరుఁ డరయుఁ. 19

లేని దగుమాయాప్రపంచమె
కానఁబడి నిజమటుల, దృశ్యము
గా నెగడెఁ; దదాశ్రయంబుగఁ గలుగుసాక్షి యదే
తా నలరె ద్రష్టనఁగ; రెండును
లేనివే యగుఁ; నిత్యసత్య
జ్ఞాన మది దృగ్దృశ్యభేదముఁ గనునె బ్రహ్మంబున్? 20

తనదునీడను గాంచి బాలుఁడు
ఘనపిశాచ మిదంచు బెదరెడు
ననువునన్ దనలోన కల్పిత మైనమాయయె, గా
కనఘ! భేదభ్రాంతిగా కెది
యును గలుగ దన్యం, బిదంతయుఁ
గనఁ బరబ్రహ్మంబె తాఁ బలుగతులఁ దోఁచుఁ జుమీ! 21

తనయ! విద్యావిద్య లనఁబడి
కనఁబడును సుజ్ఞాన మొకటే,
కనుఁగొనంగను రజితశుక్తిజ్ఞానమట్టులనే,
వినుము, దృగ్వృత్తిస్వరూపం
బున నె యద్వయ మది యనంతం
బనఁగఁ దోఁచెడు భ్రాంతిమై; ద్వయ మనఁగ లేదెందున్. 22

తనయ! విద్యావిద్యలను నవి
వినుము, మాయాకృతులు; మాయయు
జను విచారబలంబుచే, నవిచారసిద్ధ మది;
పొనర మాయను దానిపనులను
గనుటె జ్ఞానం; బట్టిశ్రుతిహిత
ము నగుసుజ్ఞానంబె బ్రహ్మము పుత్ర! పరికింపన్ 23

కామినీమయ మగును జగ మిది
కాముకున కరయంగ; లోభికి
ప్రేమచే ధనమయముగా నది వెలయు, నారీతిఁ
నామరూపవిభేద మడఁగిన
సామరస్యముఁ దోఁచు, నిజని
స్సీమసుఖపరిపూర్ణభూమ భజించుజ్ఞాని కొగిఁ. 24

ఒక్కసంఖ్యకు మీఁద బిందువు
నొక్క టిడఁ బది యగును, మఱిమఱిఁ
జెక్కు లిడ నాయంకెయే కడుఁబెరుగు లెక్కయగుఁ;
ఒక్క టూసున్నల ననంతత
నిక్కు; నవ్యక్తంబు బిందువు;
తక్కి బిందువు లొకటి నిలుచును తనయ! యద్వయము. 25

మాయ యడఁగును మాట లడఁగఁగ
మాయ యడఁగిన మనసు తలఁపులు
మాయమగు; నామనసుతలఁపులు మాటువడునపుడే
యీయగాధపుదృశ్యసంతతి
మాయ మగు; నామీఁద నచ్చి
త్కాయ మగు నద్వైతబ్రహ్మము తా నొకఁడె వెలుఁగుఁ. 26

పోనఁగ మాయాకార్య మనఁగను
బ్రసర మగు మదిలోనఁ గల్పన
లెనఁగి కనఁబడు రూపనామము లెనయు భేదములుఁ;
నసిని గురుముఖమున గ్రహింపఁగ
నసుకుఁ 'గల' యటు లది లయంబయి,
యసమ తేజోరాశి బ్రహ్మమెయగు న దద్వయమై. 27

నిదురలో మది యడఁగుటను నవు
డొదవు శుద్ధానంద మంతట,
మదియె నిదుర తొలంగఁగా సంసారియై నెగడున్;
మదికె సుఖదుఃఖములకూడిక,
అదియె యడఁగఁగ నెల్ల యడఁగును,
పిదప నమలానందము ననుభవింపఁదగుఁ దనయా! 28

కపటసర్పముఁ దొలఁగఁ జేయఁగ
విపులమంత్రౌషధము లెన్ని క
లిపి ప్రయోగించినను వృథయౌ క్రిల, మాయయు ని
శ్చపలసత్యజ్ఞాన మనఁబడు
నుపమచేతనె గాక వేఱొక
నెపముచే నాశంబు నొందునె నిజముఁగాఁ దనయా? 29

నిప్పుగృహమున నుండియును గను
గవ్వఁ జీఁకటి; దీప మయి యా
నిప్పు వెలుఁగఁగఁ దిమిరమడఁగును నిజముఁ గనుఁగొనఁగా,
నప్పగిది బ్రహ్మంబు కలిగియు
విప్పి యాడుఁ బ్రచండమాయయుఁ,
దప్ప కది సుజ్ఞానదీపము తగిలి లయ మొందున్. 30

మంటిగణపతి తానమాడఁగ
వెంటనే మరణ మనుసామెత,
కొంటెమాయకు మూల మెఱిఁగినఁ గూలు నది యపుడే;
కంటె! కల్గదు మున్ను; తెలిసిన
వెంటఁ దను బా, నద్ది లయ మగు
చుంటఁ గనఁబడు నడుమ గుణఫణిరాజభ్రాంతిదమై. 31

'మా' యనఁగ, నెలేదడియర్థము,
'యా' యనఁగ, 'నది యెవతె? యని' యా
మాయ కెట్లు ప్రతిష్ఠ కల్గెను? మదివిచారంబుఁ
జేయ 'సర్వం బ్రహ్మమయ' మను
న్యాయమున నది మిథ్య; కన న
న్యాయ మగు నామాట; కను మీన్యాయమును దనయా! 32

'తొలఁగు మాయాదేవి! నన్నిటు
కలఁతఁబెట్టకు' మనఁగ, నయ్యది
పలుకు:— ప్రభు! పరిపూర్ణుఁ డీవన బయలు గలదటె, నేఁ
దొలఁగ? చూడఁగ రజ్జుసర్పము
వలెఁగదా! నీయందుఁ గల్పన;
కలిగి తొలఁగుట నాకు సహజముఁగాదె' యనె నజతో. 33

ఏమి పల్కెదు తనయ! మాయా
కామినీమహిమంబు? తనుఁ దా
నే మఱచునటు మఱపు తెఱలో నెట్టు నరు నరయన్,
ఆమహాజ్ఞానాత్ముఁ, బొర తెర
గా ముసర నజ్ఞాన, మాకం
డే మఱచుఁ జిద్భానుఁడే నను నెఱుకనే మదిలో. 34

అనిరి 'మూలప్రకృతి' యిది యని,
అనిరి 'వైష్ణవమాయ' యంచని,
మునులు పల్కిరి 'యోగనిద్రామూర్తి' యని దీనిన్;
కనిరి 'యీశ్వరశక్తి' గా, మఱి
యనిరి 'కారణ' యని పలుగతుల
జనులు మాయకు నామకరణము సలిపి పోయిరొగిన్. 35

మాయతోఁ బనిలేదు మనకుఁ, ద
దీయగుణసంబంధతత్త్వని
కాయసద్గ్రసితివిమర్శనఁ గలుగ దొకఫలమ్ము;
ఈయశేషము లే దనుచు నిలు
వొ, యదార్థస్వప్రకాశ
న్యాయ మెఱిఁగినఁ జాలునేల తదన్యవిషయంబుల్. 36

అంత, నిటు మాయావిధానం
బంతయును భ్రాంతి యని మునివరుఁ
డంత మెఱుఁగనిసుఖచిదద్వయ మనుచు శుకమునికిన్,
సంతసంబునఁ దెలుపఁ, జిత్తపు
చింత తొలఁగ సుఖానుభవ వి
శ్రాంతసహజానందమున నిజజనకునిఁ గొలిచెన్. 37

పరమపురుష! పరేశ! పావన!
పరమగుణగణనిలయ! కరుణా
భరణ! చిత్పరిపూర్ణ! మోహనపరమవిజ్ఞానా!
శరణజనరక్షణ! పరాత్పర!
నిరుపమా! నిఖిలేశ! నతజన
వరద! వంద్య! పరాత్మ! వేపలవర్తిశ్రీధామా! 38

మాయామిథ్యాత్వ ప్రకరణము

ఎనిమిదవ అధ్యాయము

స మా ప్త ము.

శ్రీ

# అనుభవామృతము

## తొమ్మిదవ అధ్యాయము

## జీవత్రయ విచారము.

శ్రీ మదమలగుణార్ణవా! రిపు
భీమ! భువనోదర! మహాశ్రీ
భామినీహృత్సంగ! వేపలపత్త్రిశ్రీరంగా!
రామ! కృష్ణ! పరాత్మ! బుధజన
కామితా! అవధారు:- వ్యాసుఁడు
ప్రేమతో నాశుకున కిటు చెప్పెను మృదులఫణితిన్. 1

కుటిలులకుఁ గడుఁగుత్సితులకుఁ, జె
నటుల, కధముల, కనృతపరులకు,
విటజనుల, కన్యాయపథులకుఁ, బిరికిపందలకున్,
నటుల, కత్యాచారులకు మహి
సటలు సల్పెడికలుషమతులకు,
నటమటీండ్రకుఁ దెల్పఁబోవకు మనుభవామృతమున్. 2

పరహితుల, కతిపుణ్యపథసం
చరులకును, బురుషార్థపరులకు,
నిరతశిష్టాచారమతులకు నిర్మలాత్ములకున్,
పరమశాంతగుణాఢ్యులకు, నిజ
గురువులెడ తత్త్వార్థసంపద
నరయుసజ్జనులకుఁ దెలుపు మీ యనుభవామృతమున్. 3

కన, నహమ్మన నేమి? జీవుఁడు
తనువులో నెటు లణఁగె? జీవుం
డ్వనెదుమిథ్యారోపణం బెటు లతఁడు గనె? నెటులోఁ
దనకు జీవన్ముక్తి? మోక్షం
బనఁగ నేమి? యెఱుంగఁ దెల్పుము
జనక! యనుశుకునకుఁ బలుకు, వ్యాసర్షి హర్షితుఁడై. ౪

తననిజముఁ దా మఱచుకారణ
మున, నహంకృతి యన్నిటను దా
నను, శరీరగుణంబు గా దది యాత్మగుణమును గా
దనఘ! భిన్నం బగు; నది యహ
మ్మనకు నభిమానస్వరూపము;
తనకుఁ జైతన్యంబు చేరుటఁ దాను చేష్టపడున్. ౫

విను, మహంకృతి దేహధర్మం
బనినఁ, బృథ్విని గంధమట్టుల
తనువు నది యెడఁబాయరాదుగదా! యటులగాకే
కనఁగ చచ్చినమీఁద నగ్నిన్
దనువుతో నెలకొనదు, కావున
తనువు ధర్మముగా దహంకృతి తలఁప వేఱే యగున్. ౬

కన, నహంకృతి యాత్మధర్మం
బనిన, చంద్రుఁడు చంద్రికయువలె
ననయ మన్యోన్యముగ నవి రెం డంటియుండవలెన్;
అనఘ! యోగిసమాధిలో నది
కనఁబడక నిజనిత్యసుఖ మగుఁ
గనుక, నయ్యది యాత్మగుణ మనఁగాఁదగదు తనయా! 7

పరమునం దది రజ్జుసర్పము
తెఱఁగునన్ భ్రాంత్యాత్మకమె యగుఁ;
బరఁగి త్రిపుటి స్వరూపముగ నది వర్తనముఁ సలుపుఁ ;
గరువమునఁ బ్రబలుచు నవస్థా
పరిణతిని 'నహామహ' మనుచుఁ దా
నరయఁ దనలో వ్యవహరించు ననిశముఁ దనయా! ౮

ఆరయ, నహమ్మన కవిద్యయె
కారణంబగు; జాగరాదుల
మీఱు దేహత్రయము తా నన మెలఁగుచేతన, మే
పాఱి తనలో వెలుఁగఁ గాంచిన
నీరిలో నభము, ట్లహంకృతి
తారతమ్యముచేత జీవత్రయముఁ దోఁపించుఁ. ౯

తోఁచు నహ మది తనువులో, సం
కోచ మొందఁ సుషుప్తి యగును; య
థోచితము నాడుల నొకించుకఁ దోఁప స్వప్న మగున్ ;
ఏచి యిరువదినాల్గుతత్త్వము
లాచికొని యాపాదమస్తక
సూచితంబయి యున్నచో నది సుమ్మి! జాగరణ. ౧౦

అరయ నహ మది తామసంబునఁ
బరఁగ సుషుప్తి; రజోగుణంబునఁ
బరఁగ స్వప్నము; జాగరము సత్త్వమున నది పరఁగన్ ;
మఱి యవిద్యాదేహమున నది
పరఁగ సుషుప్తియు; సూక్ష్మతనువునఁ
బరఁగ స్వప్నము గలుగు; జాగృతిఁ బరఁగు స్థూలమునన్. ౧౧

ఈవిధంబున నతఁడు వెలుఁగుచు
జీవుఁడగు, విశ్వుండు, తైజస
భావుఁడును ప్రాజ్ఞుండు నన బేర్వడసి తానగుఁ;
ఈవెలయుమూఁడౌ నవస్థల
బోవ నొండింకొండు చూపకు
సావధానమునం గణింపఁగఁ జక్రనేమిగతిఁ. 12

ఒండవస్థ ననుభవించుచు
నుండుజీవుఁ డెఱుంగలేఁ డిం
కొండవస్థను; నిటుల వేత్తై యొప్పు మువ్వుర నొ
క్కండ నుచుఁ గని లిప్తుఁడుగఁ గా
కుండి తత్తదవస్థలను గను
చుండి సాక్షిగనుండుఁ బరముఁడు సూవె సంతతముఁ 13

నిదురలోపలి యనుభవంబును
మదిఁ దలఁచు మేల్కాంచి; యితరుల
కది వచించును బుద్ధిసాధన మగుట మేల్కొను సా
పిదపఁ జెప్పును; బుద్ధిలేమికి
నిదురతటి ధ్యాల్లగుట, తా నపు
డెదియుఁ దెల్పక యూరకుండును నింతనిజము సుతా! 14

అహమునకుఁ జిచ్ఛాయ కెంతయు
సహజ మగునైక్యంబు; తనువున
కహమునకు నది కర్మజం బగు; సాక్షి కహమున కౌ
వహిలు నైక్యము భ్రాంతిజన్యత;
మహముఁ జిచ్ఛాయయును గడు స
న్నిహితము లగుటను దాదాత్మ్యము నెగడు వేఁపడకే. 15

ఓలి, మూర్ఛాసుషుప్తిమృతులగు
కాలమున, నిజకర్మ ముడుగుటఁ
బోల దేహము సహము నైక్యముఁ బొందఁబో వరయన్,
గ్రాలునిజసాక్షికి సహమ్మున
కాలకింపుము, భ్రాంతి తొలఁగిన
కాలమునఁ దాదాత్మ్య ముడుగును గాంచఁగాఁ దనయా! 16

ఆవరణవిక్షేపశక్తులు
నావికటమాయాకృతులతో
నోవి లింగశరీరములు మొదలొప్ప జగమెల్లన్
ఠీవితో సృజియించు జలసం
భావితం బగు తెరనురుగులటు;
లావిధము విక్షేపశక్తి స్వయంకృతంబె యగున్. 17

తలఁపఁగా దృగ్దృశ్యభేదము
వెలసి పరమునిస్సృష్టిలో వెలి
వలయముల నావరణశక్తియు వ్యాప్తమై యుండున్,
బలిమి నీరెండావరణములు
గలుగ ధర్మాధర్మచింతన
ములును సంసృతిబంధమును దృఢమూలముగ నుండున్. 18

ఆవరణ మనఁబడెడు నిద్రయె
ఆవరించుచు వస్తువుల పలు
భావభేదభ్రాంతిరూపస్వప్నమును జూపన్,
దేవతిర్యఙ్మర్త్యలోకము
లీవిధపు సచరాచరంబులు
వ్యావహారికజీవునకు సత్యములుగాఁ దోఁచున్. 19

కలల ననుభవవేద్యములునై
వెలయఁగల సుఖదుఃఖముల నా
కలఁ గనెడునరుఁ డవి నిజంబులుగాఁ దలచుమాడ్కిన్,
దలఁప జాగ్రతిలోన సంసృతి
కలయనుభవము మనస్స్భ్రమచేఁ
దలకొనను వ్యవహారజీవికిఁ దథ్యములటంచున్. 20

కనఁగ కల నిమిషంబు; కలలో
ననుభవము బహువత్సరంబుల
దనఁగఁ దోఁచును స్వప్నచిత్తము నందు భ్రమచేతన్,
వినుము! బ్రహ్మాదుల బ్రతుకుఁ, గనఁ
గొన, నిమిషమాత్రంబు, సంసృతి
యనుభవము బహుకాల మట్లగు నావరణశక్తిన్. 21

బాలకా! చిదచిత్తుల కగున
మేళమే హృద్గ్రంథి యనఁబడు
నోలిఁ గ్రాగినయినుమువలె నన్యోన్యమగు నదియున్;
స్థూలజడపునచిత్తులోన
స్థూలనిజచిత్తది యహంకృతి
నోలగని వ్యవహారవశమున నొప్పుజీవుఁ డనన్. 22

ఇట్టియహమే సాక్షిగా ను
న్నట్టి నిజచైతన్యతేజము
నెట్టులో తనలో ధరించును నిహాపరంబులతోఁ
దొట్టి సుఖదుఃఖాదికంబుల
నట్టె సంచారంబు సలుపుటఁ,
బట్టి వ్యవహారమునఁ బేర్కొనఁబడును జీవుండై. 23

విను, మహాత్మ్మ జీవభేదము,
గనుచు గోచర మగును బహుగతి
అనఘ! తన్నావరణశక్తి యా దావరించుటచే,
తనయ! జాగృతి వ్యావహారికుఁ
డనఁగ, కలలో ప్రాతిభాసికుఁ
డన, సుషుప్తిని పారమార్థికుఁ డనఁగఁ బేర్లు గనున్. 24

బుద్ధిసుఖదుఃఖేచ్ఛలును మఱి
బద్ధధర్మాధర్మభావన
ఇద్ధమగు ద్వేషంబు నాదిగ నెసఁగుగుణములచే
బద్ధమయి గుణి యనఁగ వెలసి ప్ర
బుద్ధతార్కికసమ్మతముగఁ బ్ర
సిద్ధిఁ గాంచెను వ్యావహారిక జీవుఁ డనువాఁడు. 25

విను, మవిద్యాభ్యాసమునఁ దాఁ
గనుచుఁ గర్తృత్వమును సూక్ష్మం
బును మఱియు స్థూలంబు తనువుఁ బొంది యహము మెఱిఁగ
గనుచు మేల్కీడులను గర్మము
లను దవిలి యూర్ధ్వాదిలోకము
లను గమించును ప్రాప్తగతితో వ్యావహారికుఁడు. 26

వ్యావహారికజీవుఁ డీగతి
వ్యావహారికజగము నిజ మని
భావమందుఁ దలంచు మాయావరణవశుఁ డగుచున్;
వ్యావహారికజీవి కగు ని
ద్రావరణమున ప్రాతిభాసిక
జీవజగముత్పన్న మయ్యెడు చిత్రగతిదోఁప. 27

నూతనపుజీవమును జగమును
బ్రీతితో సృజియించి నిద్దుర
నా తెలుఁగుఁ గన్పఱచి, యాక్షణమందు చెఱచుటచే
ప్రాతిభాసికుఁ డనఁగఁబడె; స్వ
ప్నాతిశయముగఁ దోఁచు దానిని
ప్రాతిభాసికజీవుఁ డెంచును పరమసత్యముగన్. 28

మీఱు నీయహామే పరాత్మను
జేరి తా నపు డుండుకతమున
పారమార్థికజీవుఁ డనఁగాఁ బ్రబలెఁ; దలఁపఁగ నా
తీరు మాయాంశమునుగాదు, సు
సారతరమాత్మాంశమై యా
పారమార్థికజీవుఁ డెంచఁగఁ బరముఁడే యయ్యెన్. 29

ఆవిధిని పరమార్థజీవుఁడు
వ్యావహారికజీవజగమును
భావమున గొంకని తలఁచుఁ గనఁ బడకపోవుటచే;
వ్యావహారికజీవుఁడో తా
భావమున గాను ప్రాతిభాసిక
జీవజగమును సత్యమయ మగు చిత్రముగ నెపుడున్. 30

ఈవిధి నహంకృతిని, భేదపు
భావ మొందుటవలనఁ గనఁబడు
జీవు లామూఁడైనతనువుల, జేరి వెలుఁగుగతిన్;
ఆవరణమున నైనహంకృతి
కేవిధిని జీవిత్వ మఱు నన,
నావరణ మెప్పుడు లయంబగు నపుడు యదియుఁ జెడున్. 31

సారమతీ! తా స్థూలసూక్ష్మశ
రీరి కానని, నిత్యసత్త్వా
ధారుఁడను నిస్సంశయం బని తలఁచి సంతతమున్
ధీరతను గరచరణశృంఖల
పాఱఁ ద్రోసినరీతి సంసృతి
మీఱి జీవన్ముక్తిఁ బొందుచు మెలఁగుఁ దలపోయన్. 32

జలములందలిశక్తి తెరనురు
వులను జేయఁగ, దానిలో త
జ్జలములోన్ద్రవత్వశైత్య స్వాదుతలు దోఁచు ;
తొలఁగ నురు గాగుణము లలరఁ
జెలఁగి కన్పడు; నల లడఁగ నవి
జలములో మున్నట్టులుండును సమ్మిళిత మగుచున్. 33

కనఁగ నిజసాక్షిస్వరూపం
బున విభాసిలుసచ్చిదాదులు
గనఁబడును వ్యవహారజీవజగంబులం దెపుడున్ ;
వినుము మఱి వ్యవహారజీవిఁ
దనరు సచ్చిత్సుఖము దోఁచెడి
ఘనమతి! యాప్రాతిభాసికు నందు విరళముగన్. 34

ప్రాతిభాసిక నావరణ చెడెఁ
బో! తనదునిజసచ్చిదానం
దాతిశయ మది పారమార్థికు నందు చూపట్టున్;
ఆతెఱఁగుగాఁ బారమార్థిక
సాతిశయతావరణ మది చెడ,
నాతఁడును మున్నట్లు సాక్షిగ నలరు నద్వయుఁడై. 35

స్వానుభవశ్రుతి గురులకృపచే
మాని మది భ్రమ, సత్యవస్తువు
నే ననెడుపరమార్థమును మది నెఱిఁగి దృఢమతివై
తా నగును పరమార్థజీవిగ
మానితం బగుసాక్షిఁ గూడి, య
నూనసాయుజ్యమును బొందుఁ, దనూజ! పరికింపఁగ. 36

పారమార్థికజీవుఁ డరయ న
పార మగుగురుకరుణ ఘనమా
యారహితుఁడయి ఘోరసంసృత్యంబుధిఁ దరింపఁగ
సారజీవేశైక్యపరమో
దారసుఖసామ్రాజ్యపదమును
గూరి, పరమానందపదవినిఁ గొల్లగొను స్వేచ్ఛఁగ, 37

ఇద్ధమతి! స్వప్నమునఁ గన్నది
బుద్ధి నెంచ నసత్యమైనటు,
బద్ధుఁ డగువ్యవహారజీవుఁడు వడిశమదమములఁ
శుద్ధుఁ డగుచును శ్రుతిగురులచే
సిద్ధిఁగొన నద్వయసుఖ మగు; న
బద్ధమగుఁ జుమి! జీవభావము బాలకా! తెలియఁగ. 38

వినుము! కలయటుతోఁచు సర్వము
మనసు విస్మృతిమొయ్యాను; వచ్చి
ద్ఘనపరంజ్యోతిః ప్రకాశముఁ గాంచ నద్వయమా
ననెడుననుభవ మంది కోరిక
లను, నణచి నిశ్చింతఁ గాంచినఁ
దనకు సహజానంద మేర్పడు తథ్యముగఁ దనయా! 39

మీఁటి యహమది మూఁడుదశల వి
కారగతి వర్తించుచుండఁగ,
సారసత్వపు టెఱుక దానికి సాక్షిగా నుండుఁ ;
కూరి, చిద్గగనం బహంకృతి
తారతమ్యముచే వెలుఁగ, నది
యారసెడు ధీరులకు సహజం బై గుఱిగఁ దోఁచుఁ . 40

తెరలుఱులు రభసమునఁ బుట్టిన
నురువు లవి తమతెరల నడఁగఁగ
నెఱిఁ దెరలు వారిధి నడఁగఁ నది నిస్తరంగ మగుఁ ;
కరణ గోచరవిషయతతు లవి
కరణముల లీనంబుగా, నా
కరణ మెఱుక నడంగ, సహజసుఖం బగును తనయా! 41

పొల్లుగా కరణములఁ గన్పడు
నెల్లయుఁ జరాచరము, గరణము
వల్ల గలిగెడివృత్తి; యది స్వప్నమటు లయి మొంపఁగ,
సల్లలితనిరుపాధికం బనఁ
జెల్లు నేకత్వంబు చూపఁడు
టల్ల ముక్తిపదంబు కైవల్యం, బదే తనయా! 42

ఒక్కదీప మనేకవర్తులఁ
బెక్కులైనటు, నాటువిత్తన
మొక్కటే పలువిత్తనంబుల కునికి యైనటులే,
ఒక్కవస్తు వుపాధి వేఱిమిఁ
జిక్కి నానావిధము లయ్యెనుఁ;
తక్క నేని యుపాధి యొకటే తనరు నద్వయమై. 43

మొనయుసంసారపుటవస్థలు
తనవికావు; భవంబు భ్రాంతిన్
జనిత మయ్యె, నవిద్య తొలఁగిన సంసృతియుఁ దొలఁగున్;
అనుకొనుచు వర్తింప మోక్షము
పొనుపడును' తన; కట్లె యితరుల
కెనయు మోక్షం బని తలంపుమ యిది యథార్థమగున్. 44

అరయ జీవుఁ డొకం డవిద్యా
పరతఁ బలువురు నైనజీవుల
కరణిఁ దోఁచెడు కలల సరకుల గతిని భ్రాంతిమెయిన్;
గురుకరుణచేఁ దా నవిద్యను
బరిహరించిన జీవ గంధము
మఱచు; జగదేకత్వమనుభవిను మా! యాతని కెందున్. 45

సకలజీవులకరణసాక్షిని
నొకటిగాఁ గనువిధ మ దెట్లన,
వికటబుద్ధిని మలపి తనలో వెలయుసాక్షియె, యీ
సకలమందు నొకే తెఱంగునఁ
బ్రకటమయి తనరారు నంచును
నకట! తెలియుట చోద్యమే తన యట్టు లన్నిటిలో? 46

అరయఁగా నొకగ్రామమందున
వఱలువ్యోమమె గిరిగహనపుర
శరధులాదిగఁ దగుసకలదేశముల నుండునటుల్
కొఱయు నఱయును లేక వరసుఖ
ఖచితసంవిద్గగనమే యది
పరఁగు నొకగతి సర్వబుద్ధుల పరమసాక్షియు నై. 47

ఈపగిది జీవత్రయంబున
రూపభేదము లారసినను ని
రూపణముగాఁ జెప్పె వ్యాసుఁడు రూఢిపుణ్యకీర్తీ;
చాపలము విడి యంతరంగపుఁ
దాప మడఁగఁగ శుకుఁడు సత్యప్ర
దీపితుఁడునై తత్త్వమెల్లను దెలిసి సుఖముండెన్. 48

ఇందుధరప్రియమిత్ర! పూర్ణా
నంద! పీతాంబర! పయోనిధి
మందిరా! కరివరద! శ్రీకర! మందరోద్ధారా!
ఇందిరారమణా! జనార్దన!
సుందరా! సుఖసార! సన్ముని
వందితా! శుభనామ! వేపలపర్తి శ్రీధామా! 49

తొమ్మిదవ అధ్యాయము

జీవత్రయ విచారము

సమాప్తము.





# అనుభవామృతము

## పదియవ అధ్యాయము

# జీవన్ముక్తి నిరూపణము

శ్రీ పరమహంసాత్మ! సచ్చి
ద్రూప! సూర్యశశాంకనయనా!
పాపహర! సత్సంగ! వేపలపత్త్రిశ్రీరంగా!
దీపితాఖిలభువనసంతతి!
శ్రీపతీ! అవధారు:- మఱియా
తాపసేంద్రుఁడు వ్యాసుఁ డిటు లను తనయుఁ డగుశుకుతోన్. 1

పాలసుల, శబ్దార్థులకుఁ, బ్రతి
కూలసత్కర్మలకు, దంబము
బ్రేలువారికిఁ, గోపమతులకు భేదవాదులకున్,
శీల మెఱుఁగనికృపణులకు, మతి
మాలినట్టి కుతార్కికులకును,
నాలరులకును జెప్పఁబోవకు మనుభవామృతమున్, 2

శిక్షితులకు, శివాగమన మున
పేక్షపడువారలకు, శివపం
చాక్షరిని విధిగా జపించెడియార్యులకు మఱియున్,
మోక్షమతులకు, మౌనముద్రను
దీక్షనైజపతపము లొనరుచు
నక్షరాకాంక్షులకుఁ దెలుపుమ యనుభవామృతమున్. 3

తనువు కరణములాది సర్వము
ననన యాచును సున్నచుట్టఁగ
ననుపమం బగుశేషమే నే నంటి వారితిన్
గనుచు నాలో నేను గుణితము
గనుచుఁ జిన్మయుఁడైతి, నైనను
అనఘ! సహజానంద మలవడ దని శుకుం డనిన్. 4

తనయ! తత్త్వముఁ దెలిసినంతనె
తనువు తా నన్న భ్రమను విడువదు
మన, మగుట భూమికల దృఢపడుమాదిరిని విడకే,
అనవరత మభ్యాసమం దిడి
మననమును గావించుచుండిన
ననఘ! పరమానంద మగుఁ, గ్లేశాదులును లయమై. 5

క్లేశపంచక మన:_ నవిద్యా
వేశ మొం; డస్మితయు రెం డగు;
నాశయుతరాగంబు మూఁ డగు; నరయఁ 'బగ' నా ల్గా;
ఆశఁగొని యన్నింటను నభిని
వేశమున నడయాడుసౌఖ్యవి
నాశకర మాక్లేశ మైదగు; నందనా! కనఁగన్. 6

తన్నెఱుంగనిదే యవిద్య, యు
దన్నిటను దా ననుటె యస్మిత;
యున్నతపుభోగాభిలాషయె యొప్పు రాగ మనన్;
మఱి న్నది లభింపమిఁ బ్రియంబును,
తన్నిమిత్తము ద్వేషమగు, నీ
యన్నిటను విడ కభినివేశం బడరి వర్తించున్. 7

ఎంచఁ, బంచక్లేశములఁ బిగి
యించఁబడి, యజ్ఞానవశుఁడై,
పెంచి యన్యములందు భోగాపేక్షలన్ మిగులన్
గాంచి 'పగ' యనుమంటలోఁ దపి
యించి మాత్సర్యంబు పంతము
మించఁగను జీవునకు సౌఖ్యము మేదినిన్ గలదే? 8

భోగలోభుల కగును స్త్రీసం
యోగధనగృహవస్తుతతిలో
రాగపువికారములు, నరివర్గముల బాధలు; వా
రాగతులవలఁ దవిలి దుఃఖపు
సాగరములో మున్గి, సౌఖ్యము
నీగి, మదమత్సరములం బడి నీతి విడిరి సుమా! 9

అష్టమదములు నెత్తికెక్కఁగ,
దుష్టమైన యహంకృతిని బడి,
శిష్టులను దూషించి, సాధులఁ జెఱచి, దుర్మదుఁడై;
ఇష్టమున దుస్సంగతిని నిజ
దృష్టిచెడి వర్తించుమనుజుఁడు
కష్టనిష్ఠురములఁ గుడిచి, మది కలఁగి చెడుఁ దుదకున్. 10

కరుణ వెఱ శంకాజుగుప్సలు.
నురుతరపుఁగులజాతిశీలము,
లరయ సిగ్గను అష్టపాశము లట్టె తమ్మేఁచన్,
మరగి భ్రమలో మునిఁగి రకటా!
సురనరోరగులెల్ల, వారికి
దొరకదయ్యెను సుఖము, పొందిరి దుఃఖమును మిగులన్. 11

మించి యసువుల క్షుధ తృషయు బా
ధించు; శోకము మోహమును మది
నొంచు; రోగజరామరణములు నొగిని దేహంబున్
జించు; బహుదుఃఖములఁ జిక్కఁగ,
ణించన్ షడూర్మికలలోనఁ ద
పించి రెటు సుఖ మింత గానన్ యీజగజ్జనులు. 12

పుత్రవిత్తకళత్రములు నా
నీ త్రితయ మగునీషణములను
చిత్రలోభ మమత్వమోహావిశేషముల సుఖ మం
చాత్రపడి, దుఃఖార్ణవపు తా
పత్రయంబులఁ జిక్కి కర్మల
పాత్రమై నవసినను సౌఖ్యముఁ బడయ లేరు సుతా! 13

తనువువాసన, లోకవాసన,
ఘనతరం బగుశాస్త్రవాసన,
మనసుఁ బట్టెడు పుత్రమిత్రమమతలవాసనయున్,
అనుచితంబగు నిట్టివాసన
బను మనస్సువిడ కంటియుండఁగఁ
గనునె సౌఖ్యము? నరుఁ డమితమగు కష్టముం గుడుచున్. 41

వేదశాస్త్రపురాణసంహిత
లాదిగా సర్వముల నేర్చినఁ
గాదు ఫల, మాసారమును జవిగనక; వ్యర్థముగా
బూదిలో నిడుహోమమే యగు;
వాదములఁ బోరాడి యుదరపుఁ
బ్రోదికై యవి నేర్వ సౌఖ్యముఁ బొందవశ మౌనే? 15

క్షీరమునఁ బులుసును బులిమినటు,
సారసుధను విసముఁ గలిపినటు,
కోరి శర్కరలోన వేమును గూర్చిపేర్చినటుల్,
పారమార్థికమైనసుఖసా
కారసాగరమందు మిశ్రిత
ఘోరతరసంసార మది యొనగూడు టగుఁ దనయా! 16

ఇంతగా నిజసుఖముదుఃఖా
క్రాంతముగ నుండంగ, నీ విఁకఁ
గాంతు నిత్యానంద మెటు లాకలుషచిత్తమునన్?
సంతతము గురువాక్యమున వే
దాంతగతి నీబుద్ధిఁ దవిలిన,
నంత మెఱుఁగనినిత్యనిజసుఖమబ్బు సత్యముగన్. 17

ఎ దుఁ జూచిన నిత్యసహజా
నందవారిధి పొంగివడఁ, ద
ద్బిందుతతి యెల్లెడలఁబడి వ్యాపించుకైవడి నే,
క్రందుకొను నీసప్తలోకము
లందు విషయసుఖం బలమి, యీ
చందమునఁ గనుపట్టుచున్నది సత్యవస్తువునన్. 18

యమమును నియమము మొదలు యోగ
క్రమము నభ్యాసంబు నలుపఁగ
శమదమము లలవడఁగఁ జిత్తపుసహజవృత్తి చెడన్,
భ్రమ యడఁగి విషయేచ్ఛ యెడ, ని
ర్మమత గని సర్వమున మన సది
విమల మగుచో, నిత్యసుఖప్రతిబింబ మటఁ దనరున్. 19

చింత లెఱుఁగనికాలమందు ని
జాంతరంగప్రవృత్తి విడి యే
కాంత మొందఁగ, వేఱుతలఁపుల నంటకుండు నెడన్,
అంత మెఱుఁగనిసౌఖ్య మగు విను,
మెంతయును నిశ్చలితమైన జ
లాంతరంబున బింబితుం డగునబ్జహితుమాడ్కిన్. 20

వేసటనునది లేక, యెందును
నాస యేమాత్రమును బొందక,
వాసనల జంజాట మూనక వఱలుసుఖదుఃఖా
వాసవిషయాసక్తు లనఁబడు
దోసములు లేకున్న నైజము
నౌ సుఖంబు ఘనంబు పొనుపడు నన్నికాలములన్. 21

కలుగుజాగ్రత్స్వప్నములలోఁ
గలఁగి కుందెడుమతికి. సుకృతము
వెలసి సుప్తావస్థ గలిగినవేళలో నరుఁడున్
మెలఁగు నిజసుఖమింత చవిఁగొని
యలరి యానందించు, వానన్
దెలియు సహజానంద మీగతిదే, యనుచు నూహన్. 22

రాగ మందక మనసు; దేహము
రోగ మొందక; నిచ్చలును ను
ద్వేగ వేదన మాన; కాఁకలితృషలబాధలలోఁ
గ్రాఁగకయు; ప్రాణములు దృఢములు
గాఁగ, వాసన లడఁగఁగా, సుఖ
సాగరము సద్దడఁగిన ట్లతిశాంతిసౌఖ్య మగున్. 23

నందనా! చీఁకటి తొడంగఁగ,
నెందుఁ జూచిన నందు వెలుతురు
గ్రందుకొనునటు, సంసరణదుఃఖంబు లయ మొందన్,
సుందరం బగునిత్యసహజా
నంద మది స్ఫురితం బగును, నా
సందు గుఱుతిడి కనుము, నిస్సంశయము సుఖ మొదవున్. 24

ఉన్మీలించుచు నెపుడు సంసృతి
క్రమ్ముకొని లోలోనఁ దోఁచు న
హమ్ము చెడఁ, బరితోష మడఁగు నహస్కరునిమాషికన్
బమ్మసుక మది తోఁచి వెలుఁగును
జుమ్ము! నిశ్చలనిర్మలశ్రీ
సమ్మతానుభవాపరోక్షవిచార మగుబుద్ధిన్. 25

సురతకాలమునందుఁ బురుషుఁడు
తరుణి కిదు క్లేశంబుఁ గడుసుఖ
కరమనుచు నాసతికిఁ దోఁచెడు కైవడిని, యెపుడున్
భరితపరమానందమునఁ దా
మరగి తన్మయుఁ డైనయెడ, సం
సరణదుఃఖ మ దంతయును సుఖమయముగాఁ దోఁచున్. 26

సురతసుఖమున దేహభావము
మఱచి తన్మయుఁ డైనరీతిగ,
నరయ నపరోక్షానుభవ మగునద్వయానందా
వరణమతి యగుయోగి సర్వము
మఱచి, తాదాత్మ్యమున సత్తా
స్ఫురణమాత్రవిచేష్టితుం డయి పొలుచుఁ జరికింపన్ 27

సుకముసోన యసంగఁబడు తా
నొకటిగా నిఖిలేంద్రియవ్యా
పకతఁ బొల్చెడు; తనదుసుకృతముఫలముగా నెపుడేన్
సకలతనుకరణములు హాయిగ
నొకక్షణము లయమొంద, దానినె
వికలమతులు తలంచుచుందురు విషయసుఖ మనుచున్. 29

వెతలఁ బడిపడి చెడఁదిరిగి సం
తతము బడలినచిత్త మెపుడే
నతులనిద్రకుఁ బాలుపడి దేహంబు మఱచునెడన్,
సతతసౌఖ్యాంశంబు పొంగఁగ
మతివిహీనులు మనుజు లదియే
ప్రతిపదము భావించెదరు నిద్రాసుఖం బనుచున్. 29

అదినిమిత్తం బాత్మసౌఖ్యం
బుదితమగును నసంగ మలవడఁ
బొదువువడు సాధకున కైదవభూమికను గనఁగన్
అదిర! చిదచిత్తులవిభేదపు
టడను దెలియఁగ ముక్తి; రెండిటి
నొదవి కనఁగా బంధ మగు, శుకయోగి! తలపోయన్. 30

అన్నమయ మాది యగుకోశము
లన్ని తా ననునాత్మబుద్ధియె,
బన్నముల నిడుబంధనము; తా వానికన్యుం డం
చెన్నుబుద్ధియె ముక్తి; నిజసం
పన్నసాక్షికి నిత్యముక్తున
కున్నె బంధము ముక్తి? బుద్ధికె యొప్పు నవి కనఁగన్. 31

దేహమే తాననుచు, మాయా
మోహపాశనిబద్ధుఁ డయ్యెను;
దేహ మది యగు ఘటమువలె భౌతికము; తా నౌనే?
దేహధర్మ మెఱుంగుసాక్షియె,
సోహ మనఁబడు ప్రత్యగాత్మ వి
మోహరహితుఁడు నిత్యముక్తుఁడు పుత్ర! తలపోయన్, 32

దేహ మది జడ; మాత్మ యజడము;
దేహ మగు సావయవ, మవయవ
బాహిరం బగు నాత్మ; దేహ మపాత్ర మధ్రువమున్;
ఊహసేయఁగ నాత్మనిత్యము,
దేహ మరయఁగఁ గర్మబద్ధము;
మోహరహితము నిత్యముక్త, మమోఘ మాత్మ యగున్. 33

ఎఱుఁగ కజ్ఞులు తనువు తా మం
దు రకట! యసువులతోడ నాత్మయె
యరుగ దేహము వీడ, శవ మని యందు రజ్ఞానుల్;
పరమచైతన్యాత్మ తా నం
చెఱుఁగ ముక్తుఁడు; తెలియ కితను
కరణములు తా నంచు భ్రమగొనఁగాని బద్ధుఁ డగున్; 34

కలుగునే బంధమును మోక్షముఁ
దలఁపఁగా నిజనిత్యముక్తున
'సకల జగద్భరితుండు గదిలో నరుగుదేరెడుసూ!
తెలుపుతీయుం'' డనెడురీతిగ
నలరు నద్వయుఁ బ్రత్యగాత్మను
నలచునే మాయాప్రబంధం బరయ నెయ్యెడలన్? 35

బుద్ధి యడఁగఁగ నడఁగిన ట్లగు,
బుద్ధి తోఁచఁగఁ దాను తోఁచును,
బుద్ధి జడమైయుండఁ దా జడముగనె చూపట్టుఁ;
బుద్ధి కాత్మాజ్ఞత నశింపఁగ
బద్ధుఁ డగు, నది యరయ ముక్తుఁడు;
బుద్ధి వికృతం, బాత్మ యవికృతపూర్ణమై యొప్పుఁ. 6

బుద్ధి నల్పినసుకృతి దుష్కృతి
వృద్ధి యాత్మకు లేదు, కల్మష
సిద్ధజలమున భాస్కరుం డది చెంది కశ్మలసం
బద్ధుఁ డైనటుతోఁచు నంతియు
శుద్ధసూర్యుని కేటి కలఁకలు?
బుద్ధిసాక్షియు నటు తగుల దాబుద్ధికృత్యములన్, 37

ఐనచో, నాత్మకును గురుముఖ
మైనబోధన కేమిపని? యనఁ
గా, నవిద్యోపాధిచేతనె కాంచ సంసారం
బైన; దది తెలచుటకు బోధన
కాని, నిజముక్తున కదేటికి?
జ్ఞానపరిపూర్ణునకుఁ గావలెనా, యితరబోధల్? 38

అదినిమిత్తము బుద్ధికృతమగు
నెదియు బుద్ధికెకాక, కలుగదు
నదమలానందాత్మ; కది కన స్వప్రకాశ మగుఁ;
పదరుబుద్ధిని యోగవేళలఁ
బొదవి సహజానందసంవి
త్పదమునన్ విబుధాళిముక్తినిఁ బడయుదురుగాదే? 39

జలములోఁ దామర, పరాగా
వళిని బవమానంబు, నంబర
తలము మబ్బుల, ద్రవ్యములఁ బాదరసమును బోలెఁ
కలిగియును మహదాదితత్త్వం
బులను లో వెలి నెల్ల విడువక
యలరియును నిర్లేపితంబై యాత్మ వెలుఁగొందుఁ. 40

తనయ! యవికారి యగునాత్మకుఁ
గనఁగ సంసృతి లేదు; జీవుం
డన నసత్యము, గనుక నాతని కది యెటుల గలుగుఁ?
విను, మహంకృతి జడము ఘటమటు,
కనుక దానికిఁ గలుగ; దింకిట
ఘనవిషమసంసారబంధపుఁగట్ట మెవ్వరికి? 41

"అటులయిన సంసార మేరికి
చటులబంధన మయ్యె"? నన విను:—
కుటిలమాయయె లేదు, సంసృతిగోల మిథ్య యగుఁ;
కటకటా! శాస్త్రజ్ఞు లూరక
తటపటంబడి వాదమాడిరి
యటమటించుచు నొండొరులు ప్రజ్ఞాతిశయ మొప్పఁ. 42

వినుము, వంధ్యకుఁ బుత్రశత మం
చనెడుగతి, మిథ్య యగుసంసృతి
ఘనవియత్కుసుమాపచయమటుగాదె, తలపోయఁ;
తనయ! నిజ మది శశవిషాణం
బనఁగ నగు; వాదుల కభేద్యము;
మనసునఁ దెలిసి విప్పిచెప్పఁగ మాటమాత్రంబే: 43

తన్నెఱుఁగనియవిద్యచే ను
త్పన్న మగు నీమనసుకల్పన,
భిన్నభూతవ్రాతములుగా వెలసె నద్భుతమై;
తన్నెఱుఁగనియవిద్యచే ను
త్పన్నమగుకల్పన నశించిన
నెన్న సాధ్యమె భేదమా సర్వేశ్వరునికొనన్, 44

ఉన్నత స్తని నిమ్ననాభిని
కన్నియను జిత్రింప పటమున,
నున్నత స్తననాభినిమ్నత లొప్పు సమ మగుచున్,
ఎన్నఁ బూర్ణబ్రహ్మమున హై
న్యోన్నతులు లే వరయ, నంతయు
నున్న; నామాకారశబ్దస్ఫురణమాత్ర మగున్. 45

లేనిదానిని గల దనుచు మఱి
లేనెలే దననేల? యుండిన
దానిఁ గల దని వ్యర్థవాదముఁ దలకొనఁగ నేలా?
లేనిదే నానాత్వమనునది,
కానిపోని పలాప మేటికి?
పూని 'ఏకో దేవ' యని శ్రుతి పొగడదే నిజమున్? 46

ఈవిధిగ నెదుటెఱుట చూపదు
నేవియునుఁ దాఁ గాదు, తూష్ణీం
భావమే పరమాత్మపద మది పరఁగుఁ దా నగుచున్;
భావశూన్యత నిలుచు నిజ మగు
తావు, తామై వెల్గుయోగులు
నేవిధం బగుస్థితినిఁ బొందిరో యెఱుఁగ నేరి కగున్? 47

బ్రహ్మ యిదె యను మనుచుఁ జూపఁగ
బ్రహ్మకైనను సాధ్యమగునె? యీ
హమ్మొదల గునేదియుం గా దందు రది; తన్నై
జమ్ము వేత్తై వెల్గెడుపదా
ర్థమ్మె? యనుభవగోచరము; స్వభు
జమ్మె నెక్కి గమింపఁ దనకు వశంబగునె తలఁపన్? 48

బుద్ధిచే పరవస్తు వీ వని
యుద్ధరించెను గీతలోనఁ, బ్ర
బుద్ధముగఁ బార్థునకుఁ గృష్ణుఁడు బోధమాత్రనె కా?
సిద్ధబ్రహ్మ మి దంచుఁ జూపెనె,
సిద్ధమా స్వాత్మైకవేద్యవి
శుద్ధనిజనిత్యైకవస్తువు చూడ నెదు రెటురన్? 49

శ్రుతి గురులచే మథనపడి ని
శ్చితము నగు ననుభవప్రమాణమె,
మతి కధీనం బగుచుఁ జూపడుమాట నిజముండన్,
ఇతరమైనప్రమాణ మెట్టుల
మతికి సాధ్యము? వాఙ్మనసముల
గతిని మీఱినయాత్మఁ దెలుపఁగఁగలుగు తెఱు వేది? 50

మతి కగోచరమైనవస్తువు
నితరములగుప్రమాణములు ని
శ్చితము సల్ప, నతీంద్రియముగాఁ జెలఁగు నది యగుటన్,
శ్రుతులుఁ దెల్పెడిపగిది సద్గురు
కృతమహానుగ్రహముచేతను
మతికి యపరోక్షానుభవమున నగును దెలియంగన్. 51

జ్ఞానమం దాశ్రయము ప్రత్య
క్షానుమానాదిప్రమాణము
లూను; జ్ఞానము విడ స్వతంత్రత యూడు నన, నవియుఁ
జ్ఞానమునకే లోఁగినవి సూ!
జ్ఞానమును మీఱినప్రమాణ మె
దైనఁ గలదే? స్వానుభవేద్యంబ యది సుమీ! 52

తనయ! యద్వయసుఖసుధాబ్ధిని
మునిఁగి, తాఁ దానై నసిద్ధుఁడు
మొనసి యూరకయుండి పోవును మూఁగచందమునన్,
కనుక వేదశిరంబులే యా
త్మను దెలియఁగాలేక తమలో
నెనసినవి మానంబనంగా, నేల వాద మికన్? 53

తాను పలికినయంతఁ దనవలె
నే, నగంబు ప్రతిధ్వనించుచు
దాను పలుకకయున్న నది మానంబుఁ దాల్చుగతిన్,
కానిపోనివివాద మొనరుపఁ
బూనువారలతోఁ బ్రసంగము
మాని మూఁగవిధాన నుండుటె మంచి దగుఁ దనయా! 54

ప్రబలదుర్బలము లని శ్రుతితతు
లఁ, బలుకుదు, రావాక్యములలో
ప్రబల మది సిద్ధాంత మగు, దుర్బలమె వాద మగున్;
ప్రబల మది ముముక్షుల కసాధ్యం;
బబలు లాదుర్బలపుశ్రుతులను
నిబిడముగ సాధించువారలు నిజములని వినుమా! 55

సుతులఁ గను మని, యాగముల స
ద్గతులు గల వని యల్పజనులకు
శ్రుతి విధించెను, దుర్బలుల కిది సూవె! ధర్మ మగుఁ;
అతిశయాత్ముల కవి వచించెను:—
సతము సత్యజ్ఞానసాధన
మతిని ముక్తినిఁ గొనుఁడు మీ రని మానితంపుగతిన్. 56

అప్రమేయ, మసంగ మద్వయ
మప్రతర్క్య, మనామరూపం
బప్రతిమ, మవ్యయ, మతీంద్రియ మది, యగోచరమౌ
స్వప్రకాశమె బ్రహ్మ మగు నను
చీప్రకారము ఘోషసలిపెడి
నాప్రబలశ్రుతివితతు లానిరుపాధిచిద్రూపున్. 57

నామరూపవికార మొందని
స్వామి కీనామములకల్పన
నేమ మెటు ఘటియించెఁ దెల్పుము నెనరుతో ననినన్,
బ్రేమమెయి వినిపించె మునిపతి
యామహామాయం గలయికయె
యామహామహితునకు లే దని యాఁడుశ్రుతితతియున్. 58

స్వానుభవ మాదిగను బుద్ధి
జ్ఞానముల కధికంబు నగు ప్ర
జ్ఞానమే బ్రహ్మం బనఁగ బుజ్మృత మగున్ దెలియన్,
ఈనిఖిలములలోన వెలి సద్
జ్ఞానసుఖమదు మైనబ్రహ్మమె
తా ననఁగ వాక్యములఁ దెల్పు నథర్వణం బరయన్. 59

తొలఁగ వాచ్యార్థములు రెండును
నిలుచు లక్ష్యమె నీ వనుచు నగు;
తలఁప సామము తత్త్వ మసి యను దాననర్థము, లో
పలను బుద్ధికి సాక్షి యగుచును
వెలుఁగుచుండెడునాత్మయే విను,
మల యజుర్గతవాక్యమున బ్రహ్మంబు స్పష్ట మగున్. 60

దేశకాలసమస్తవస్తుప
దేశముల నెఱి నిండి, పరమా
కాశుఁ డనవిచ్ఛిన్నుఁ డగుటను గనె ననంతాఖ్యన్;
లేశమును విడ కెల్ల తేజో
రాశి వెల్గుట పరంజ్యోతి; ప్ర
వేశి సకలాత్మల నగుట సర్వేశుఁడై వెలసెన్. 61

జలజసఖునటు తనకుఁ దానే
వెలుఁగుచుంట స్వయంప్రకాశుఁడు,
వెలిఁగి తా, నితరములసైతము వెలుఁగఁ జేయుటచేఁ
దెలియ నగు స్వపరప్రకాశుఁడు;
వెలుఁగఁగల యన్యప్రకాశము
వెలుఁగఁ జేయుట స్వప్రకాశుఁడు విను, మతఁ డద్వయున్. 62

తలఁప బుద్ధ్యాదీంద్రియంబులఁ
దెలియఁబడమి నతీంద్రియుఁడు, ని
శ్చలననిజసంవిత్తగుటచే జ్ఞానపూర్ణుండున్,
చెలఁగుమాయావరణ మనఁబడు
వలఁ దగులమిని నిత్యముక్తుఁడు,
తెలియఁబడఁ డెద్దానిచే, బోధింపరా దతనిన్. 63

పలుగతుల జడదృశ్యసాధన
ములను గననౌద్రష్టచేతన
ముల కరణముల నడపు గావున పూర్ణచైతన్యం;
బల కరణములబాహ్య మరయఁ
గలిగి జ్ఞాతయు; జాగ్రదాదుల
చలన మొందక నిలుచు గావున సాక్షియై వెలయున్. 64

పంచకోశవిమర్శశేష మె
యించు ప్రత్యక్షన సకల త
త్త్వాంచితాధారంబు కూటస్థు బనంబడు, భా
వించ నాశములేమి నవ్యయ;
మెంచ నిర్వాసనత నిజము; చ
లించమిని స్థాణు వగు; నూతయె లేమి నిరుపాధి. 65

తపము చేరుటచేత జీవుఁడు;
విమలసత్త్వత నీశ్వరుఁడు; సం
క్రమణ మొందక రెంటినిన్ విడఁగా రామాత్ముఁ డగున్;
క్రమముగా క్షరుఁ డక్షరుం డన
నమరు నిద్దఱి మీఁఱి తా ను
త్తమపురుషుఁ డనఁబడును వినుమీ, తనయ! బ్రహ్మ మదే; 66

తలఁప సత్త్వరజస్తమంబులు
తెలియఁగా నగు బుద్ధివృత్తుల;
నల యవస్థాత్రయము నంటిన యాప్పు డాతండే
పలుకఁబడు విశ్వుండు తైజసుఁ,
డలఘుప్రాజ్ఞుఁ డనంగ; నావల
నల తురీయావస్థ చిత్సుఖ మండ్రు యోగివరుల్. 67

అడరి మిథ్యయు జడత దుఃఖము
పొడవుగాఁ గలమాయ కెదురుగ
నడచి పడసెను సచ్చిదానందం బనెడు పేరిన్;
కడఁగి పలువిధముల నుపాధుల
దడవి నానారూపములతో
విడక వర్తిలుఁగాన దీనికిఁ బెక్కునామంబుల్. 68

నేమ మెఱుఁగఁ, డనామకుఁడు, ని
స్సీముఁ, డనుపముఁ, డమలుఁ, డతనుఁ, డ
కామకర్మతమోగుణుండు వికారదూరుఁడౌ,
నామహా బ్రహ్మంబునం దీ
నామములు కృతకంబులే యగు,
భ్రామకంబులు సుమ్మ! తూష్ణీంభావరూపునకున్. 69

తనయ! లౌకికవైదికంబుల
కును విభేదములైన కైవడి,
వనయ మొక్కఁడె బ్రహ్మచర్యాద్యాశ్రమంబులచేఁ
దనరఁ బేరులు వేఱువేఱుగ
నొనరు క్రియ, బ్రహ్మమున నామము
లెనసెఁ బెక్కు, లుపాధికృతము లవెన్ని యో, వినుమా. 70

తూఱు పని రవిపుట్టుదిక్కును
నారయక యది పశ్చిమం బని
పోరుమూర్ఖుని కెఱుఁగఁ జెప్పెడు పోల్కి గాఁ, దగ నీ
వారయుచును, ననాత్మలను విడి
మీఱి ఘోషిలు వేదతతిలో
సారమగు సర్వాత్మ నీ వని సౌఖ్యపడుము సుతా! 71

నడచుచుండఁగ నావ నదిలో
నడచు నని గ్రహియింపలే కిరు
గడలతటముల తరులు నడచెడుఁగదె! యెదుర నను నా
జడమతికి భ్రమ చెల్లెదం చని
యుడుపుగతి, వేదంబు లన్నియు
జడముగా, దయ్యాత్మ యనియే సంతతముఁ బలుకున్. 72

కల్ల యగు వేదాంతమంతయుఁ
దెల్లపఱచును సత్యము నె, కను
మల్ల మట్టియుఁ, గట్టె ప్రతిమయు నరయ దేవునిలోఁ
జెల్లుశక్తిని బొందురీతిని;
కల్లసతి సంగమము కలలోఁ
గల్లకానిసుఖం బొసఁగునటు గాంచ చిత్రగతిన్ 73

చీఁకటిని గలవస్తువును గను
జోక పత్తి రగిల్చి, పిమ్మట
నాకడనె యది పాఱవేసెడు నటుల, శాస్త్రములం
దాకళించుచు వస్తుతత్త్వవి
వేక మొందినమీఁద శాస్త్రముఁ
గై కొనఁడు; నిశ్చలితవారిధి గతిని శాంతుఁ డగున్. 74

అరయ నైదు ప్రయోజనంబులు
వఱలు జీవన్ముక్తి, కందున
పరి మనస్సంశయవిపర్యాసము లుడిపి యవలన్
చిరము నిశ్చలమగుచు నిలిచెడి
పరమ మగుసుజ్ఞానమును గుఱు
తెఱిఁగి పాలించెడ ప్రయోజన మెలమి మొదటి దగున్. 75

పరఁగు కరణేంద్రియవినిగ్రహ
పరతఁ దపమును బెంచి, నిష్ఠను
నరుగుటయె రెండవప్రయోజన మగుచుఁ దనరారుఁ;
పరమవైదికలౌకికంబుల
నిరత మగుతఱిచింత నొందుటె
ధరఁ దృతీయప్రయోజనంబని తెలుపఁబడుఁ దనయా! 76

మెలఁగుచోఁ దా బ్రహ్మనిష్ఠను
తొలఁగి దుష్కర్మలు మదూరాత్మక్రి
దులు నశింపఁగ, దుఃఖ ముడుగుటతోడ నాలుగగుఁ;
తొలఁగ సంగాపేక్ష, మమతలుఁ
గల యహమ్మ నశించి నిశ్చిం
తల, సుఖంబును గాంచుటే యైదవప్రయోజనమౌ; 77

తన్నెఱుంగు మహానుభావున
కెన్న, భూమిక లేటికన: నవి
యన్ని సిద్ధించుటకు మాత్రమె; యవలఁ దాఁ దానై
యున్నతంబగు రీతిఁ జెలఁగెడు
భిన్నభావము వీడి, సుఖసం
పన్నతఁ జైతన్యమూర్తిగఁ బరమశాంతిమెయిన్. 78

గురుకరుణ బోధానుభవ మను
శరధిలో నోలాడి, మాయను
బరిహరించి పరేశుఁ డే నన వఱలి, సర్వమునం
బరఁగి, నిజనిర్ద్వంద్వనిర్గుణ
నిరత పరమానంద రాజ్య ప్ర
పరసుఖశ్రీపదవి మగ్నత సాటి లే కుందుఁ 79

హరిహరబ్రహ్మలును తమనిజ
మెఱిఁగి తామే బ్రహ్మ యనుకొని
పరిహరించిరి గాదె, మాయావరణసర్వంబుల్?
అరయ నిజయోగియును తనగుఱు
తెఱిఁగి తానే బ్రహ్మమై, యటు
పరఁగి బ్రహ్మము తా ననుచు దృఢభావ మొందుఁ జుమీ! 80

ఆలకింపుము, బ్రహ్మమందున
చాలఁ దాదాత్మ్యంబు గనిన వి
శాలయోగివిధంబుఁ దెల్పెద సర్వసమభావం
బోలిమైఁగొని, పూర్వభావముఁ
దోలి, విషయమ్ములను దగులక
లీలతో నాత్మానుభవసుఖ లీనుఁడై యుండున్. 81

విరతి యనఁబడుముగుదతో బలు
సరససల్లాపములు సలుపుచు,
తఱుచు గురుపదభక్తి యనఁబడుతరుణిజత విడకే
మరిగి, శ్రుతి యనుప్రోడతో రా
త్రిపగళ్ళను గడపి; పట్టపు
గరిత యగుముక్తిసుఖరతి యేకాంతమునఁ గూడున్. 82

క్రమ్మనహ మఱి, యోగి మఱి జ
న్మమ్ము నిడు-కర్మ విడి, తనధ
ర్మమ్ముగా వర్తించు, స్వప్రారబ్ధకర్మముచే;
సమ్మదిత నిస్సంగ మగునా
బమ్మమే తా నగుచుఁ దనలో
నమ్మగను; తద్విధ మెఱుంగఁగ నేరి కలవి యగున్? 83

చేరుప్రారబ్ధమున తను సం
చారమును గను; చిత్త మాత్మవి
చారమున నిశ్చింతమై మను సర్వకాలములన్
వే అనఁగ నిస్సంగుఁ డగుచును
దూరముండును, దుఃఖసుఖసం
సారధర్మములందుఁ దా నొకసాక్షిభూతుండై. 84

పొందుసుఖదుఃఖములఁ గా దన
కందుకొను; మఱి కాంక్ష సేయఁడు
ముం దొకటి; గడచినది తలఁపఁడు మోహ మూనఁడెదన్;
ఎందు బాలకులందు బాలుని
చందమునఁ, బెద్దలను బెద్దగు
నందమున, సోపాధికపుమణియట్లు వర్తించున్. 85

తనదు యోగక్షేమ మేమియుఁ
గనఁడు; జగదనుసరణమును గై
కొనఁడు; వారికివారివలెఁ దా గోచరించుఁ దగన్;
గొనకు తన కగుహానివృద్ధుల
మనసు నూనఁడు; చూచువారికి
వినుము, రాగద్వేషికైవడి వెలయుచుండుఁ జుమీ! 86

పామునను హారమున శిలను మ
హామణిని పూవునను పెంటను
కామినిని తృణమునను శత్రువు, కడను మిత్రునిదన్,
ఏమి భేదము లేక సమతను
దా మదిని గని పావనాశ్రమ
సీమ జీవన్ముక్తుఁ డరయఁగఁ జెలఁగి వర్తించున్. 87

ఆస బూడిదఁ జేసి, బూదిని
బూసి, యాత్మవిచారమున సం
త్రాస మనఁబడుకుండలంబులఁ దొడగి, మానసమున్
వాసియగుకౌపీనమును బిగి
చేసి కాసెను వేసి, ధ్వంసము
జేసి పంచక్లేశపాశముఁ, జెలఁగి సుఖముండున్, 88

తనకుఁ గలకురుపునకు సన్నవ
సనముగట్టెడురీతి, దేహము
మనుదనుక వస్త్రాన్నముల నిడి మనిచి, కామినులన్
గనిన మదిని వికారమొందక,
ఘనతరం బగుదృఢత గని తన
జననికైవడిఁ జూచు యోగి, యచలితమతి యగుచున్. 89

మొదటికారణ మగునుపాధిని
నొదవునీశ్వరభావ మంతట
వదలి, కార్యోపాధిజీవత్వమును విడి, యవలన్
సదమలానందాంబునిధియై
పొదలుయోగిని నీశుఁ డని త
త్పదయుగళి నర్చించి యిష్టార్థములఁ గైకొనరే? 90

సచ్చిదానందాత్మ నెఱుఁగఁగ
విచ్చిపోవు నవిద్య; వాసన
లచ్చరాలపోకాలు; వృత్తి లయంబగున్, బిదపన్
అచ్చుగాఁ జిత్తొకటిమాత్రమె
హెచ్చి జీవన్ముక్తుఁ డయ్యెడు
వచ్చి ప్రారబ్ధాదికర్మల వసుధలో నరుఁడు. 91

తనయ! యోగులు రెండుతెఱఁగులు;
విను, పరమహంసాశ్రమంబున
మనుచు జడభరతాదులటువలె మౌనవిధి నుండ్రు;
అనఘ! క్రియాకరణయోగులు
ఘనులు జనకాదులు సమాధుల
గనుచు భేదములం, దభేదము గాంచువారు సుమా! 92

తననిజముఁ గనువాఁడెపో, గుణ
వనధి యగునిజయోగివర్యుఁడు,
ఘనుఁడు నగుసన్న్యాసి, దేవుఁడు గనఁగ నాతఁడయా;
తనయ! వర్ణాశ్రమము లేటికి
యనుపమానందాత్మమూర్తికి?
వినుము! జన్మలు వేసములవలె వెలయు నాతనికిన్? 93

లేవు వర్ణాశ్రమవిధులు, మఱి
లేవు లౌకికవైదికంబులు,
లేవు విధులు నిషేధములు, నేలేశమును దనకున్;
కేవలానందానుభవ శివ
భావమే తా నగుచు సర్వము
పావనముగ సజీవముక్తినిఁ బడసి వర్తించున్. 94

సతము గాయత్రిఁగలయర్థ
స్థితిని గురుముఖమున నెఱిఁగి స
న్మతిని నావర్తించి సుజ్ఞానంబునున్ గనుచున్,
వెతకి ప్రత్యగ్జ్యోతి బుద్ధికి
సతికి యేకత్వంబు నొందు సు
గతి గనక సన్న్యాస మొందంగనె ఫలము గలదే? 95

బమ్ము తా నైనట్టిమనుజుఁ, డ
హమ్ము విడిచియు సంగ మొందువ
ధమ్ము గనుసన్న్యాస మూనక తగిలి కర్మము లో
కుక్కమ్మడిని విడి, యాత్మచింతవి
ధమ్ము మదిలోఁ గనక, వృథగ న
హమ్ముతో సన్న్యాసికా, ఫల మందఁగాఁ గలఁడే? 96

వినుము, 'నిస్సంగోయు' మనుచును
ఘనతరంబుగ శ్రుతులు పలుకఁగ,
ననఘ! సన్న్యాసో౽యమనున, దనాత్మవర్గము నై
చనెడు తనుకరణాదులకొ, భా
వనరహిత మైనట్టిబ్రహ్మకొ?
కనఁగ సన్న్యాసంబు భ్రాంతియె గాక, ఘనమగునే? 97

ఒడలిపై సన్న్యాసివేషము,
నుడుగులో బ్రహ్మంబు, మనసునఁ
బుడమిపట్టముఁ దాల్పఁగోరికఁ బొరిఁబొరిగఁ గనుచుఁ
బడతి నొక్కతె విడినయాతఁడు
గడుసువాదియె కాక, మాయను
నడఁచి యాత్మజ్ఞానియై తానలరుయతి యగునే? 98

ఠీవి నెవఁడు గృహస్థధర్మ
వ్యావహారికుఁ డగుచు భువి స
ద్భావవైరాగ్యమ్ములను శమదమములను గలిగి,
జీవపరమాత్మైక్యపదసం
భావితుం డగు నాతఁడే యతి
వో, వెలయ నాతండె జీవన్ముక్తుఁడును దనయా! 99

ఎండమావులయట్లు కనఁబడు
చుండు సంసారమున యోగియు
నుండి విషయాసక్తు కైవడి నొనరుచుండి సదా
నిండి నిలువగు బ్రహ్మవిద్యా
ఖండమతి యగు; తలఁపుతలపై
నిండుకుండను నిలిపి నటకుఁడు నృత్యమిడునటులన్. 100

తగుచు వైయాకరణుఁ డిటువలె
జగతిలో సంసారియట్టుల
పొగ రుడిగి భ్రమ నీగి, మోహము పోయి తెలఁ గడఁగన్ ,
మిగుల విషయము లనుభవించును
విగుణమనుజునిబోలి యోగుల
పగిదిఁ దలఁప నసాధ్యమగుఁ గద! బాలకా! తెలియన్. 101

డించి గర్భముఃపాలవేయఁ దె
గించు జారిణిగతిని, సంకెలఁ
ద్రెంచి కంభము పెఱికి గజ మేతెంచుగతిఁ దోఁపన్ ,
మించి పాదరజంబు తగ జా
డించునటు సంసారపాశముఁ
జించి తాను సమాధిలోపలఁ జెలఁగు సౌఖ్యముగన్. 102

మూకభావము నొంది తా నే
కాకి తిరుగుచు, దిగంబరత్వము
స్వీకరించుచుఁ బాణిపాత్రగఁ జేసి నిశ్చింతన్ ,
శాకమైనను షడ్రసాన్నపుఁ
బాకమైనను గుడిచి, కోరిక
లేక, తనివిని బొంది మెలఁగు విలీనచింతుఁడై. 103

ఒక్కతఱి శాకంబుదిను, మఱి
యొక్కతఱి పాకంబు గొను, నిలఁ
జక్కఁబండు నొకపుడు పువ్వుల శయ్యఁగొను నొకటన్
ఒక్కతఱి దివ్యాంబరంబును,
నొక్కతఱి బొంతను ధరించును;
చొక్కి యహమును యోగి నిరతముఁ జెలఁగివర్తించున్. 104

ఒసఁగరే, యింటింట నశనము
బిసరుహాక్షులు, భిక్ష వేఁడిన?
నొసఁగ లేవె జలాశయంబులు తృషనణప? బండన్
మసల ధర చోటింత యియ్యదె?
వసుధలోపల విషయకాంక్షా
వ్యసన ముడుగుమహానుభావుఁడె వత్స! యోగి యగున్. 106

కొంద ఱాతని తపసి యందురు,
కొంద ఱాతని విప్రు డందురు,
కొందఱో, తత్త్వజ్ఞుఁ డని యనుకొండ్రు జడుఁ డనుచున్;
కొంద ఱాతని మూఁగ యందురు;
కొంద ఱాతని శూద్రుఁ డందురు;
అందఱకుఁ దా నన్నిరీతుల నౌను యోగి తనన్. 106

పున్నెముల పాపముల కోర్కెలు
'పొన్నపిచ్చుకలాట,' బాలున
కున్నటుల; యమభీతి, 'గుమ్మ' ని యోజయాతనికా;
ఎన్న, జననజరామరణము ల
టన్న మృగతృష్ణలవిధంబుగ
నున్నవా నిజయోగి కరయఁగ నుర్విలోఁ దనయా! 107

వాసనలం బోనడవ, చిత్తవి
కాస మేర్పడ, మిగులంగా న
భ్యాస మలవడవలయు ననువిభ్రాంతి యేమిటికో?
ఈసమస్తముం గనంగం దనదువి
లాసమం చను నెఱుకయే ని
ర్వ్యాసననిజానందము మనోవ్యాపృతిహారంబున్. 108

మనన దెవ్వడం జనిన నేమగు?
తనువు తా నేమైన నేమగు?
తనయ! యింద్రియనికర మేదెసం దెఱల నేమి యగున్?
విను, పరంజ్యోతిప్రభామృత
వనధి, కద్వయునకు, నపరిమే
యునకు, నచలానందునకు, భయమున్న దే యెందున్? 109

కమియమాగినపండు కాయగు
నె మఱల నదియె? యాత్మ నెఱిఁగిన
యమలయోగి మనంబు కలుషిత మగునె తొంటిగతిన్
తమక మిడుకామాదిషడ్రిపు
సముదయము సమయించి యెప్పుడు
నమితనిత్యానందమయు మగు నదియు విను తనయా! 110

క్షీరమున వెలువడినయాజ్యము
క్షీరమగునే మఱల? కడుని
స్సారకాష్ఠమునుండియుఁ గడచనినవహ్నియుఁ దా
నారయఁగ మఱికాష్ఠ మగునే?
పారమార్థికమైనసత్యము
ఘోరమాయాకార్య మగునే? కొమర, పరికింపన్. 111

దేహమే తా ననుచుఁ దనలో
మోహ మొందుటె జన్మబీజము;
దేహ మది తాఁ గాదు, సాక్షాద్దేవుఁడే యను నా
యూహయే భవబీజనాశము;
దాహకాష్ఠముఁ దోలఁగు పావము
దాహమటు బీజంబు లెడఁగా తనువు లిఁకఁ గలవే? 11

తనయ! జన్మమె లేనపుడు ద్విజుఁ
డనఁగ నెట్లగు? విప్రధర్మము
గననివానికి నాశ్రమంబులు గలవె? యాశ్రమముల్
తనకు వల దను మేటి కేటికి
ఘనతరాగమకోటి? వినుము, భు
వనమునన్ సుజ్ఞాని తూష్ణీం భావమున నుండున్. 113

వేఁచి విత్తును నాట మొలచునె?
యాచెలువున నహమ్ముడుగఁగాఁ
దోఁచువస్తువు నెఱుఁగు యోగియుఁ దోట్టునే భవమున్;
చూచు బాహ్యము మఱచి వర్తిలఁ
జూచు జీవన్ముక్తుఁ డరయఁగఁ
దోఁచు దగ్ధపటంబువలె నత్స్ఫురణమాత్రుఁడుగన్. 114

ఈపగిది యోగులును సంసృతి
లేవ మొందక నడుచుచుండఁగ,
పాపు లొగి నిందింత్రు వారల వర్తనంబులను;
శ్రీపతిబ్రహ్మస్వరూపుల
నోపకయె నవ్వులాడి నారక
కూపమున నాదుష్టమనుజులు కూలుదురు తనయా! 11

అద్దినిమిత్తం బామహాత్ముని
పదపయోజనము లంటి, బ్రహ్మను
విదితముగ గుర్తించి, సంసృతి వీగి సంతతము
సదమలానందానుభవ మగు
నుదధిలో నోలాడ శాలుని
సదన మొల్లక కనుము సాయుజ్యంపుసుఖపదమున్. 116

పరువ మంటినమాత్ర లోహం
బరయఁగా నపరంజియైనటు
లరరె! వర్తిలు 'బ్రహ్మఖని' యనునటు చరించుచుఁ దా
బరఁగి, జంగమతీర్థ మనఁబడు
గురుకటాక్షముఁ బొంది, సాక్షా
త్పరమహేశ్వరు లనఁగ యోగు లవని జరింత్రు సుమీ! 117

యోగములలో రాజయోగమె
యోగ; మాత్మవిచార మది వి
ద్యాగరిమ శ్రేష్ఠంబు, సాయుజ్యంబు మోక్షములన్
బాగు; పెఱయోగములు రోగము;
లాగడములు తద్వితరవిద్యలు;
వేగతుల సాయుజ్యముక్తికి వెలి యితరముక్తుల్; 118

వ్రతములన్ శివరాత్రి; మంత్ర
వ్రతతిలో గాయత్రి; విద్యా
వితతి నాధ్యాత్మంబు; మతముల వెలయు శైవంబున్ ;
క్రతుల జపయజ్ఞములు; పూజా
స్థితులలో నిర్గుణము; దేవ
వ్రతతి శంకరమూర్తి దేవుఁడె వర మగును చూడన్. 119

సేవఁ గొనుమృద్దారుశిల లగు
దేవతాప్రతిమ లవి భక్తుల
భావకల్పిత మగుచు దేవత్వంబు నొందు ననన్,
కేవలానందాత్మకల్పన
లేవియును జొరరానియట్టిస్వ
భావసిద్ధుఁడు దేవుఁ డనఁగాఁబడఁడె తలపోయన్. 120

దేహమే దేవాలయం బగు,
దేహి యగు జీవుండె దేవుఁడు;
మోహమే నిర్మాల్య -మాయా-మూఁటి దాటిన యీ
యూహ కందనిదౌ స్వయంప్రభ
సోహ మనునదె పూజ; తిండియె
దేహమున కుపచార మంచని తెలియుఁ బ్రాజ్ఞుఁ డిలన్. 121

జ్ఞానమున సంచితము గడచును,
మానసనిధి! యాగామికర్మము
హానియగు దూషక విభూషకు లైనవారలచే;
తాను తనువిడుదాని గుడుచును
జ్ఞాని యయ్యును విడవు దేహము
హాని యయ్యెడుతనుక ప్రారబ్ధాదికర్మంబుల్. 122

సగరసంతతి, భార్గవుఁడు, శశి,
గగనమణి, సురనాథుఁ, డాతని
తగు సుతుఁడు, మనుఘఁడును స్వేచ్ఛాభద్రఫలభోక్తల్;
జగతిని హరిశ్చంద్ర కలశజు
లుఁ, గనఁగ పరేచ్ఛాఫలయుతులు
నగుదు; రిచ్ఛలె లేవు మాండవ్యాగ్నినాదులకున్. 123

ఈపగిది నధ్యాత్మబోధవు
దీపనము ద్వైపాయనుఁడు హృ
ద్వ్యాపకమహామోహా మనఁబడునంధకారంబుఁ
రూపుమాపఁగ శుకమునీంద్రుఁడు
తాప మడఁగఁగ, శాంతిరేఖా
దీపితం బగుసుఖసమాధిని దేలియాడెఁ దగఁ, 124

సగుణా! నిర్గుణా! సత్యా! నిత్యా! భు
జగశయన! భువనాభరణ! వర
ఖగగమన! కంజాక్ష! లక్ష్మీకాంత! గుణపూర్తా!
నిగమగోచర! శాంతిసాగర!
జగదుదయాకారణ! హరీ! శ్రీ
ప! గరుడవరతురంగ! వేపలపర్తిశ్రీరంగా! 125

జీవన్ముక్తి నిరూపణము

పదియవ అధ్యాయము

సమాప్తము.





# అనుభవామృతము

## పదునొకండవ అధ్యాయము

# నిర్గుణారాధన నిర్ణయము.

---

శ్రీమహాలక్ష్మీహృదీశా!
కామితార్థప్రద! సుగుణదీ
పా! మదాదివిభంగ! వేపలపత్రి శ్రీరంగా!
సీమరహితకృపాంతరంగా!
భీమబల! అవధారు:- మాని
స్వామి వ్యాసుం డిట్లు శుకుతోఁ బలుకఁదలకొనియెన్, 1

జాతిధర్మమువిడిచి, పెద్దల
ఖ్యాతి పోదిగదుడిచి, స్వేచ్ఛా
రీతు లెట్టులుద్రోయు నటువర్తించుదుష్టులకున్,
నీతి విడిచిననీచులకు, మఱి
ఘాతకులకును, కర్మరహితుల
నాతతాయుల కెపుడుఁ దెలుపకు మనుభవామృతమున్. 2

భూతదయ గలవారలకు, నా
త్మాతిశయులకు, బుధజనంబులఁ
బ్రీతిఁ గనువారలకు, భవ మన వెఱచువారలకున్,
నీతిపరులకు నిరతనిగమ
వ్రాతమతవిహితులకు, గుణవి
ఖ్యాతచరితుల కరసి తెల్పుమ! యనుభవామృతమున్. 3

జనక! తెల్పుము, నిర్గుణంబగు
దినుసునకు, నుపచార మెట్టులఁ
దనరు? తగుపూజావిధానప్రదవ్య మెటు లొప్పుఁ?
ఘనత నద్వైతమున వ
ర్తన సలుపఁగను టెట్లు? చి త్తది
యెనసి పూజకతాది పూజ్యత లెటులు గొను నొకఁడై. 4

నిస్తులము నిర్గుణము నిత్యని
రస్తసకలోపాధి యైనప్ర
శస్తతత్త్వమె కర్తయౌన, నుపచార మిదు టెటులో?
విస్తరింపఁగ కర్తృకర్మస
మస్తక్రియలు మనోవికృతు, లా
వస్తువున కర్చనవిధాన మభావ్య మగుఁ గాదే? 5

గురువరా! తద్విధముఁ దెల్పుము,
కరుణతో నని శుకుఁడు జనకుని
చరణముల శిరముంచి వేఁడఁగ సంయమీంద్రుఁడుదాఁ
గరుణతోఁ దత్తనయునిఁ గని
మరిగి మనసున దెల్పెఁ గడువి
స్తరముగాఁ దన్నిర్గుణారాధనవినిర్ణయముఁ. 6

తగ మననమున కైనసాధన
మగు సగుణపూజావిధానము
నిగమవిదు లీరాజయోగము నెఱపుదురు వినుమా!
ఒగిని తనుకరణములచింతను
దిగిచి తాఁ జిత్తప్రసాదముఁ
దగిలి నైశ్చింత్యంబుఁ బూనినదానిఁ జలుప నగుఁ. 7

విజనదేశమునందు నాసన
మజినముగఁ గూర్చుండి, తనువిడి
ఋజుగతిని, పద్మాసనంబును నిలుపఁ గైకొనుచున్,
సుజనుఁ డగుగురుమూర్తిపాదాం
బుజము ధ్యాన మొనర్చి, తా నా
నిజమయినయీశ్వరుఁ డనుచుఁ జింతింపఁ దగు నియతిన్. 8

మీఱిచనుచును మూఁడవస్థల
చేరుదుఁ దురీయమును సత్యా
ధారసుఖమయసచ్చిదానందంబు నగుపదమున్,
సార మగుపరమార్థతత్త్వా
పారబ్రహ్మము తా నిజ మనువి
చారమే సింహాసనం బగు సత్య మిది తనయా! 9

మలినవాసన లనెడుగవుసెనఁ
దొలఁచి, కామాద్యఖిలమలములఁ
గలఁచి, శమదమము లనుమణులవిశానమున వెలిఁగి,
చెలఁగి, తళతళ మెఱయునాని
ర్మలిన మంతర్ముఖపుబుద్ధియె,
యలరుసింహాసనపు టుపచారాదికంబు సుతా! 10

సత్తనఁబడు స్వరూప మొప్పఁగ,
చిత్తనెడుప్రభ చెలఁగి వెలుఁగఁగ,
నుత్తమానందం బనెడుసొబ గొప్పిరంజిల, సొం
పెత్తు ప్రత్యఙ్మూర్తి బ్రహ్మయె
హత్తి మతి నాసనముఁగొని నని
చిత్తమిడ నావాహనం బగు చింతసేయంగన్. 11

వెల యనుచు నర్ఘ్యమున కర్థము,
వెల యతులము ననర్ఘ్యమునకును,
వలరు బ్రహ్మ మనర్ఘ్యమనఁగా నర్ఘ్య మిదుట యగున్;
తెలిసి తనలోఁ దన్ను తానే
కొలఁదు లఱు నానందమయ మగు
జలధి యనునదె పాద్య మనునుపచారమగుఁ దనయా ! 2

మీఱుచు నవస్థాత్రయంబును
ఘోరతాపత్రయములకుఁ దా
దూర మంటి ననంగ స్నానము; తోరముగ దృష్టిం
దీరు విశ్వవ్యాప్తుఁడై కడు
మీఱి మిగిలితి నంచుఁ దా, నే
పారు నిజచైతన్య మనుటయె వస్త్రధారణమౌ; 13

అలి, స్వతేజముచేత సర్వము
వెలుఁగఁజేసెడు బ్రహ్మ మని మదిఁ
దలఁచు టాభరణోపచారము; తత్త్వమును గనుచున్
బలిమి సచ్చిత్సుఖమయంబుగ
కలతునాత్మమునందు సర్వము
వెలుఁగు టావర్తించుటయె యుపవీతధారణమౌ; 14

సర్వమునఁ దా నుండి తనలో
సర్వమును గని, యంటఁబడ దా
సర్వ మన, ననులేపనాద్యుపచార మదియ యగున్;
దుర్విచారము లోరయుమానస
సర్వవాసన లడఁచి తానన్
బర్వ నానిర్వాసనయె, పుష్పపూజ యగున్. 15

కుందుకొఱంతలు లేనియమలా
నందబ్రహ్మము నిర్గుణం, బే
గందమును గనదనుటె ధూపముగాఁ దలంపఁబడుఁ,
అందచందము లొప్పి తత్త్వపు
బృందమున లోవెలి వెలుఁగునా
నంద తేజం బనుటె దీపము నందనా! తెలియఁ, 16

భోగభోగ్యవిభోక్త లనెడు వి
భాగ మొందనినిత్యతృప్తుఁడు
భోగి యగుఁ దనలో ననంగా భోజనార్పణమౌ;
రాగ మెడలి రజస్తమంబుల
నీగి, నిర్గుణమైననిజసుఖ
భోగసాగర మే ననుటె, తాంబూలచర్వణమౌ, 17

పావన, పరానంద, పరమా
నావిలాత్మక, నిర్వికార, ని
రావరణుఁ డే నవఁ బ్రదక్షిణ మగును మదిఁ దలఁపఁ,
జీవపరమాత్మైక్య మనఁబడు
భావభేదభ్రాంతి విడిన ని
జావబోధమె వెలయు నిట సాష్టాంగనమనం బై, 18

ఈపగిది నుపచారకల్పన
లాపరబ్రహ్మమున స్వర్ణో
ద్దీపదేవప్రతిమలకుబలె దీటుగలభక్తిఁ
ధూపదీపము లనునెవంబుల
స్థాపితం బగుమనవిధిని ని
రూపణముఁ జేసితిని బోధారూఢి దృఢపడఁగ. 19

పూజకత పూజ్యత యనెడి, భిద
నైజమిానగుణమున విను! వి
భ్రాజదురుబింబమున ప్రతిబింబంబు పొల్పుగతిఁ,
ఈజగత్సాక్షి యలమానస
రాజిఁ బ్రతిఫలియించి జీవస
మాజమున పూజకత పూజ్యత వలసి పెంపొందుఁ. 20

తనయ! వినుమా, నిర్గుణారా
ధనము నభ్యసనంబొనర్పఁగ
మన మడఁగి, తలఁ పుడిగి, నిజబ్రహ్మంబు తా ననఁగా
ననుభవము జనియించు, నద్దా
నను వలఁతి సంసృతి తొలఁగి నీ
కనుపమసదానంద మనుమోహానుభవ మొదవుఁ. 21

ఈజగంబున జనులు సల్పెడు
పూజ లవి బహువిధము లగుచును
రాజిలెడు, నవ్వానిలోపల రమ్యతరము గదుఁ.
పూజనీయుం బిడియు సుమి! ని
ర్వ్యాజనిరుపాధికసుఖం బయి
రోజమై నిర్వాణసామ్రాజ్యోన్నతి నొసంగుఁ. 22

మనసుమలమును గడిగి, ధ్యానం
బనుమడుగు తోడి, నిర్మలత్వ
మ్మనెడు బూదిని బూసి, స్వస్థలమందు మండితుఁడై,
ఘనతరపరంజ్యోతి తా నను
కొనుచు, పూజలసల్పి మోహాం
గనను వలచి సుఖింపు మెపుడా కాంతకౌఁగిటిలోఁ. 23

ఫూని తత్త్వరహస్యమును సువి
ఖ్యానమున బోధింప, సౌఖ్యని
దాన మగుతత్సారమెల్లను ద్రావి శుకమునియుఁ
సానురాగత మించ హృదయము
లోన సచ్చిత్సారసుఖవి
జ్ఞాన ముటుకఁగ దన్మయత్వముఁ గలిగి ముదమొందెఁ. 24

పదునొకండవ అధ్యాయము

సమాప్తము.



# ఉపసంహారము.

ఘనమనుభవామృతము కన్నడ
మున గలుగు గ్రంథ మిటు తెనుఁగున
కనువదించితి 'రాయదుర్గం' బనెడు తాలూకా
పొనరు 'కలుగో' డనెడుపల్లియఁ
జనరు శ్రీవెంకోబరాయున
కును, గరితలక్ష్మాంబకును నేఁ గూర్మిపుత్రుండన్.

వినుఁడు, ద్విజుఁడ, వసిష్ఠగోత్రుఁడఁ,
గనఁగ, ద్వైతమతానురక్తుఁడ,
ననఘు విదురాశ్వత్థనారాయణువరంబున సం
జనితుఁడన్, శ్రీరామచంద్రుని
ఘనపదాబ్జధ్యానచిత్తుఁడ,
ననద రిల "అశ్వత్థరాయం" డనుచు నన్ను జనుల్.

వాసిగా 'సహవాసి' వంశవి
భాసితుఁడు 'మహాలింగరంగఁడు'
వ్రాసె కన్నడమందు, సంస్కృతభాష కది మును
సేసి రనువాదముగ, నిపుడేఁ
జేసితిని నాంధ్రముగ మత్సఖు
నాసమొయ్యి నిటు 'అనుభవామృత' మనెడిదీని నొగిన్.

ఘనుఁడు మెచ్చిర్రిగామకరణము
ఘుఁ, డద్వైతోపదేశకుఁ
డును ద్విజుఁడు, "శ్రీరాము" లన నెగడుసుధీవరుఁడున్
మనవిసేయ, స్వశక్తిఁ, గార్యము
ఘనత నెంచక, తెగువతో నిటు
తెనుఁగుఁ జేసితి సఖునభీష్టముఁ దీర్ప విధి యనుచున్. 4

స్పృహను వేపలవర్తిరంగని
మహితపాదార్పణముఁ జేసితి
బహుళగతి నద్వైతపథసంభావ్య మగు దీనిన్;
గృహగృహంబున నిద్ది యలరుత
మహిని నారవితారకంబుగ
నహరహము సుజనోపయోగం బగుచుఁ దగురీతిన్. 5

## మం గ ళ ము.

---

సకలలోకాధ్యక్ష జయజయ!
సకలజీవాధార జయజయ!
వికృతిరహితపరాత్మజయజయ! విశ్వజనసేవ్యా!
సుకరయోగవిలాస జయజయ!
సకలవేదవినోద జయజయ!
ప్రకృతిదూర! పరేశ! కేవలసత్తి సుఖవాసా.

దేవజయజయ! దివ్యమహిమప్ర
భావ జయజయ! శిష్టరక్షణ
భావ జయజయ! విజయకరుణాపారజలధి జయా!
శ్రీవిలాస! పరేశ! జయజయ!
దేవదేవేశ్వర! రమావర!
పావనాత్మక! జయ్య! కేవలసత్త్రినిలయా!

అ ను భ వా మృ త ము

స మా ప్త ము.

ఓంతత్సత్.

---

# గ్రంథ ముద్రణ స్ఖాలిత్యములు కొన్నిటికి సవరణలు.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 23 | నిషా | నిష్ఠా |
| 15 | 22 | జానానుభన | జ్ఞానానుభవ |
| 16 | 23 | నశె | నష్టె |
| 21 | 3 | దూరల్ | దూతల్ |
| 23 | 11 | రీరంమిఃది | కీరమిది |
| 27 | 15 | యత్ర | యంత్ర |
| 34 | 17 | విథునీ | మిథునీ |
| 41 | 3 | చేష | చేష్ట |
| 44 | 16 | కష | కష్ట |
| 47 | 21 | మాత్రచేత | మాత్రము చేత |
| 49 | 23 | బనుచు | అనుచు |
| 56 | 4 | నూలుండ్ర | మ్రాల్యుండ్ర |
| 57 | 23 | తమలోత్త | తములోను |
| 61 | 8 | భేదభావ్యన్త్రబ | భేదభావ |
| — | 24 | పీసె | పీవె |
| 66 | 1 | వనరె | నరరె |
| 70 | 11 | సతతంము | సతతము |
| 72 | 12 | పెఱమైపొ | పెఱమై |
| 02 | 4 | చెడు | చెడు ను |
| — | 9 | కయిచర్ల | కలఁచర్ల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 104 | 23 | శిస్టుల | శిష్టుల |
| — | 24 | దుస్టుల | దుష్టుల |
| 118 | 4 | ద్రోచనటి | ద్రోచనట్టి |
| 119 | 21 | నుగ | గను |
| 120 | 20 | దటుతె | బటుతె |
| 128 | 24 | భాను | భ్రాను |
| 145 | 3 | కానసా | క్రావవా |
| 147 | 4 | బజండం | బు. నజడం |
| 159 | 21 | కా | కా |
| 163 | 24 | నపుడు | నపుడె |
| 166 | 2 | చుడఁగ | చుండఁగ |
| 169 | 13 | గమునమున | గముమున న |
| 180 | 17 | పలావ | ప్రలావ |